# తెలుగు సాహిత్యం :
# గాంధీజీ ప్రభావం

మొదలి నాగభూషణశర్మ



గాంధీ సాహిత్య ప్రచురణాలయం
హైదరాబాద్-20

TELUGU SAHITYAM : GANDHIJI PRABHAVAM
by Modali Nagabhushana Sarma

ప్రథమ ముద్రణ 1970
2000 ప్రతులు

మేలుప్రతి 8-00
సామాన్యప్రతి [redacted]

ముఖపత్ర ముద్రణ :
పవన్ ప్రింటింగ్ వర్క్స్
హైదరాబాద్

ముద్రణ :
చారీ అండ్ కంపెనీ
103, సర్దార్ పటేల్ రోడ్
సికింద్రాబాద్

# విషయానుక్రమణిక

# ముందుమాట

తెలుగులో కాలక్రమాన్ని అనుసరించి వ్రాయబడ్డ చరిత్రలే కాని విశ్లేషణాత్మకమైన విమర్శలు రాలేదు. ముఖ్యంగా గద్యరచనల విషయంలో ఇది మరీ నిజం. నవలలను, నాటకాలను, కథలను సాంఘికాలు, చారిత్రకాలు, రాజకీయాలు అన్న విభజనక్రింద విశ్లేషించి ఒకొక్కక్క ప్రక్రియకు ఒక గ్రంథాన్ని వ్రాయాలన్న సంకల్పంతో తెలుగుదేశంలోని గ్రంథాలయాలు తిరుగుతున్నప్పుడు ఈ రచనకు బీజారోపణం జరిగింది.

తెలుగులో రాజకీయ సాహిత్యం గాంధీజీతోనే ప్రారంభించి, వికసించిందని చెప్పవచ్చు. రాజకీయ సాహిత్యంమీద వచ్చిన గ్రంథాలను పరిశీలిస్తున్నప్పుడు గాంధీజీవల్ల ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రభావితంకాని రచనలు నాకు చాలా తక్కువ కనిపించాయి. గాంధీజీ జీవితాన్ని, సిద్ధాంతాలను ఆలంబనంగా స్వీకరించిన గ్రంథాలు దాదాపు 800 వరకు నా దృష్టికి వచ్చాయి. ఇవికాక ఆనాడు దేశంలో అత్యంత ప్రచారంలో ఉన్న "ఆంధ్రపత్రిక", "కృష్ణాపత్రిక", "ఆంధ్రభారతి"వంటి పత్రికలలో వచ్చిన గాంధీసాహిత్యం అశేషం. వీనిని పరిశీలించినప్పుడు తెలుగు సాహిత్యంమీద గాంధీజీ ప్రభావాన్ని

గురించి ఒక ప్రత్యేకమైన గ్రంథాన్నే వ్రాయాలన్న తలంపు నాకు కలిగింది.

ఈ రచనకు కావలసిన గ్రంథాలనన్నీ రాజమండ్రిలోని గౌతమీ గ్రంథాలయంలోను, మద్రాసులోని కన్నెమెరా గ్రంథాలయంలోను, వేటపాలెంలోని శారదానికేతనంలోను, విజయవాడలోని రామమోహన గ్రంథాలయంలోను నాకు లభించాయి. ఆయా గ్రంథాలయాల అధిపతులకు నా కృతజ్ఞత. ముఖ్యంగా గౌతమీ గ్రంథాలయంలో నేను అడిగినదే తడవుగా నాకు కావలసిన పుస్తకాలను, పత్రికలను ఇచ్చి సహాయం చేసిన కార్యదర్శి శ్రీ మహీధర జగన్మోహనరావుగారికి, అక్కడి లైబ్రేరియన్ శ్రీ యమ్. వి. సుబ్బారావుగారికి నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథం వ్రాత ప్రతిని తయారుచేస్తున్న సమయంలో నా విలంబనాన్ని సహించి మూడువంతుల ప్రతిని వ్రాసిన తమ్ముడు చిరంజీవి వెంకటప్పయ్యకు ఆశీస్సులు.

ఈ గ్రంథాన్ని ప్రచురించడానికి నిశ్చయించిన గాంధీ సాహిత్య ప్రచురణాలయ సంపాదకవర్గానికి, ముఖ్యంగా శ్రీ కోదాటి నారాయణరావుగారికి నేను కృతజ్ఞుణ్ణి. వారు ఈ ప్రచురణను స్వీకరించక పోతే, నా అలసత్వం కారణంగా ఈ గ్రంథం ఇంత తొందరలో ప్రచురింపబడివుండేది కాదనుకుంటాను. ఈ పుస్తక వ్రాత ప్రతిని ఆసాంతమూ చదివి, చేర్పులను సూచించి, నా కృషిని అభినందించిన పెద్దలు శ్రీ కొడాలి ఆంజనేయులుగారికి నా నమస్కారాలు తెలుపుకుంటున్నాను.

ఈ పుస్తక రచనకు, ప్రచురణకు తోడ్పడిన పూజ్యమిత్రులు డాక్టర్ బి. రామరాజు, డాక్టర్ భీమసేన్ 'నిర్మల్', శ్రీ ఇవటూరి లింగమూర్తి, శ్రీ యం. యల్. నరసింహారావుగార్లకు నా కృతజ్ఞతలు. ముఖపత్రాన్ని అందంగా చిత్రించడంతోపాటు, దాని ముద్రణ

బాధ్యతను కూడా స్వయంగా స్వీకరించిన మిత్రుడు శ్రీవఝ శ్రీనివాసశర్మ గారికి ప్రత్యేక కృతజ్ఞతలు. ముఖపత్ర ముద్రణ సమయంలో ఎంతో సహాకరించిన మిత్రుడు శ్రీ కె. దేశపతిరావుకు కృతజ్ఞత.

ఈ గ్రంథాన్ని అందంగా ముద్రించిన చారీ అండ్ కో వారికీ, ముఖ్యంగా మిత్రుడు మురళికి కృతజ్ఞ తలు.

ఈ గ్రంథాన్ని మా నాన్నగారికి, అమ్మగారికి సవినయంగా అంకితం ఇస్తున్నాను. నాకు 12, 13 ఏళ్ళ ప్రాయంలో దగ్గర కూర్చోబెట్టుకొని గాంధీజీ ఆత్మచరిత్రను నా చేత చదివించారు నాన్నగారు. 1921 నుంచీ గాంధీజీ సిద్ధాంతాల ఆచరణకు పూనుకున్నారు. నాకు తెలుగు సాహిత్యంతో పరిచయం కలగడానికి కారకులు ఆయన. నేను చిన్నతనం నుంచి ఈనాటివరకూ చేస్తూ వస్తున్న హఠాన్ని సహిస్తున్న అమ్మకూ, నా అభిలాషను ఏనాడూ కాదనక నాలో యీనాడు వున్న ఏ కొద్దిపాటి సంస్కారానికైనా కారకులైన నాన్నగారికీ యీ గ్రంథాన్ని కృతజ్ఞతాంజలిగా సమర్పించుకొంటున్నాను.

నేను చేస్తున్న ఏ పనిలోనైనా సహభాగం అందిపుచ్చుకుంటే కాని తృప్తి చెందని నా శ్రీమతి – సరస్వతి – నా సాహిత్య వ్యాసంగానికి ప్రతినిత్యమూ సహాకరించే అర్ధాంగి. ఆమె వ్యాసంగాలన్నింటినీ నా రాత కోతల కోసం ఆమె ఆపుజేసింది. ఆమెకు ఎట్టి కృతజ్ఞతలు చెప్పినా ఆమె ఆగ్రహిస్తుంది కనుక ఆ మాట చెప్పకుండా కేవలం ఆశీస్సులనే అందజేస్తున్నాను.

నాగభూషణశర్మ

# పరిచయం

మూడు దశాబ్దాలకాలం భారతజాతి మనోఫలకాలపై చెరగని ముద్రవేసింది గాంధీయుగం. మూడు దశాబ్దాల కాలం అంటే జాతి జీవితంలో అల్పమయిన కాలమే కావచ్చు. కాని దేశంలో ఈ కాలం తెచ్చిన పరివర్తనదృష్ట్యా చూస్తే ఈ కాలపు మహాత్మ్యం మన జాతి చరిత్రలో "నభూతో నభవిష్యతి" అని చెప్పవచ్చు. నిద్రాణమయి యున్న జాతిని మేల్కొల్పి వారిలో ఆత్మగౌరవాన్ని నూరిపోసి స్వాతంత్ర్య సమరానికి ఆయత్తం చేయడమూ, దశదశలుగా వారి లోని శక్తిసామర్థ్యాలను పరీక్షించుకుంటూ వ్యూహాలను మార్చు కుంటూ ముందుకుసాగడమూ చివరకు స్వాతంత్ర్యాన్ని పొందటమూ- ఇదంతా ఒక ఎత్తు. దీనిని కేవలం రాజకీయ క్షేత్రంలో ఆయన చేసిన కృషిగా మనము అభివర్ణిస్తే అభివర్ణించవచ్చు. కాని వైయుక్తికం గాను, సమిష్టిగాను భారత జాతీయ జీవనాన్ని ఆధారంగా తీసుకొని ఆయన మానవ జీవితంపై చేసిన సత్యశోధన ప్రయోగాలు మరొక ఎత్తు. అవి దేశపు ఎల్లలను దాటి విశ్వమానవ జీవితంలోని అన్ని రంగా లను స్పృశించినవి. అందుకనే గాంధీమహాత్ముడు జన్మతః భారతీయు డైనా, ఆయన సత్యప్రయోగాలలో భారతీయ సంస్కారం ఉట్టిపడు తున్నా అదంతా స్థూలదృశ్యం మాత్రమే. ఆయన సత్యశోధనలోని అంతరాంతరాల లోనికి చొచ్చుకొని పోగలిగిన సూక్ష్మదృష్టి

ఉంటే, అట్టి సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే దేశాల, జాతుల పరిధుల నతిక్రమించి ఆయన ప్రయోగాలు విశ్వమానవ దృక్పథంతో చేయ బడినవనే వాస్తవము మనకు గోచరిస్తుంది ఆయనను నావాడు అన టానికి ఏ దేశానికి, ఏ జాతికి ప్రత్యేకమయిన హక్కులేదు. ఆయన ప్రపంచాని కంతకూ చెందిన వాడు. ఆయన ప్రయోగ ఫలితాలు ప్రపంచాని కంతటికీ వర్తించేవి. ఈ యథార్థం ఆయన నిర్యాణం తరువాత మనకు స్పష్టంగా కనిపించింది.

ఇంతటి విశాల పరిధిలో ఆయన ప్రయోగాలు సాగినప్పటికీ మానవ జీవితంలోని ఏ రంగంలోనూ ఆయన పరిశోధన చేయకుండా వదలలేదు. సామాజిక జీవితంలోనే గాక, వ్యక్తి జీవితంలోని ప్రతి చిన్న అంశంపైన కూడా, ఆయన ప్రయోగ ప్రభావము ఎంతో కొంత పడింది. ఆయనతో నూటికి నూరుపాళ్ళు అంగీకరించిన వారు అనేకులున్నారు గాని ఆయన భావాలన్నింటితోను భేదించిన వారు లేనే లేరంటే అతిశయోక్తి కానేరదు. అందుకనే ఏదో దృకోణం నుంచయినా సరే చూచి ప్రతి భారతీయుడు ఆయనను తన మనసులో ఆరాధించినాడు. చివరకు ఆయనను హత్యచేసిన గోడ్సే కూడా ఆయనకు ప్రణమిల్లి గాని ఆపని చేయలేకపోయినాడు.

ఇంతటి మహాత్మ్యాన్ని జాతి జీవితంపై నెరపిన మహాపురుషులు చాలా అరుదని చెప్పవచ్చు. ఈ ప్రభావం సాహిత్యంపైన కూడా ప్రసరించటం సహజం. పైగా గాంధీజీ భారత కార్యక్షేత్రంలో అడుగు పెట్టడానికి ముందే అనుభవమూ, కీర్తిప్రతిష్ఠలూగల ప్రత్యేక భూమిక ఆయనకు ఉన్నది. అందువల్ల ఆయన కార్యరంగంలో అడుగు పెట్టగానే సాహిత్యసృష్టి వెలువడడం మొదలయింది. ఆయన మూడు దశాబ్దాల సేవాకాలం భారతీయ సాహిత్యాన్ని సుసంపన్నం చేసి కొత్త పుంతలను తొక్కించింది.

సహజంగానే ఆవేశపూరితమయిన ఆంధ్రమనస్తత్వం ఎవరి నయినా ఆరాధించటం మొదలుపెట్టిందా, దానికి హద్దులూ పద్దులూ

ఉండవు. ఆ ఆరాధనలో కవిత్వమూ, గానమూ, నృత్యమూ, చిత్రకళ మొదలయిన లలితకళలన్నిటినీ మేళవించి తమ ఆరాధనలో తాదాత్మ్యం పొందుతారు. ఆంధ్రేతిహాసంలో ప్రతియుగంలోను ఈ వాస్తవం మనకు కన్నులకు కట్టినట్లు కనిపిస్తుంది.

గాంధీమహాత్ముడు భారత కార్యరంగంలో అడుగుపెట్టే నాటికే జాతీయోద్యమము స్వాతంత్ర్య సంగ్రామముగా పరిణమించ జొచ్చింది. అనతికాలంలో భారతదేశం మొత్తం కురుక్షేత్రమయింది; భారతజాతి యావత్తు నరరూపందాలిస్తే మహాత్ముడు నారాయణుడయి నాడు. ఆంధ్రజాతి ఈ నారాయణ రూపాన్ని దర్శించి భక్తి తత్పర తతో "జగద్రక్షకుడు గాంధీమహాత్ముడు, జనులారా మీ రెరుగండీ" అని-ఆయన విశ్వరూప సందర్శనాన్ని లోకానికి కలిగించుటకు ఎలు గెత్తి పాడింది. పరంపరాగతంగా "భజనజేసే విధము తెలియండీ జనులార మీరు'' అని భక్తిని ప్రబోధించినట్లే "రాట్నం వడికే విధము తెలియండీ'' అని జనసామాన్యంలో ప్రబోధం గావించారు. భక్తకోటి రాట్నంలోని చక్రాన్ని విష్ణుచక్రంగా భావించి కీర్తించారు. అనేక విధాలుగా ఆయన నామాన్ని మహాత్మ్యాన్ని భక్తిభావంతో వినమ్ర పూరితంగా గానం చేశారు. తమకు గల భక్తివిశ్వాసాలను ప్రజలలో ప్రబోధం చేసి గాంధీజీ ఆజ్ఞలను ప్రజాసామాన్యంలో ప్రచారం చేయడానికి అనేకపద్ధతులు అవలంబించారు ఉద్యమసేవకులు. వీటన్నిటి వల్ల ఆంధ్రసాహిత్యమే ఒక కొత్త మలుపు తిరిగింది. అనేక నూతన ప్రక్రియలు ఏర్పడినవి. అనేకములయిన నవీనభావాలు ఉత్పన్నమయి నవి. ఆంధ్రసాహిత్య చరిత్రలో గాంధీయుగం చిరస్మరణీయమేగాక స్వర్ణయుగం అని చెప్పితే కూడా అతిశయోక్తి కాదు.

ఈ దృష్టితో పరిశోధన చేసిన ఒక సాహిత్య గ్రంథాన్ని ప్రచు రించవలెనని గాంధీ సాహిత్యప్రచురణాలయ సంపాదక సమితి సంక ల్పించుకొన్నది. దీనికై అనేక పథకాలు వేయడం జరిగింది.

ఈ కార్యం చాలా కష్టసాధ్యమయినది కావడంవల్ల ఎవరూ పూనుకొనలేదు. ఈ పరిస్థితులలో ఈ సంకల్పానికి కార్యరూపం కలిగించడము ఎట్లాగని ఆలోచిస్తుండగా శ్రీ మొదలి నాగభూషణశర్మగారు ఈ విషయంలో కృషిచేస్తున్నట్లు కొందరు మిత్రుల ద్వారా తెలియవచ్చింది. వారిని ఆహ్వానించి వారు చేస్తున్న కృషిని గురించి తెలుసుకొని దీనికి సంబంధించిన నివేదికను సంపాదక సమితిముందు ఉంచటం జరిగింది. వారు ఈ పుస్తక ప్రచురణకు హర్షామోదాలను తెలిపారు. ఆ తరువాత శ్రీ నాగభూషణశర్మగారిని ఈ కృషికి రూపురేఖలు కల్పించి తుది మెరుగులను యివ్వవలసిందిగా కోరాము. వారు చాలా శ్రమపడి తమ కృషికి ప్రస్తుతరూపంలో రూపకల్పన చేశారు. దీని ప్రచురణవల్ల గాంధీ సాహిత్యప్రచురణాలయానికి చిరకాలాభీష్టం నెరవేరింది. ఇందుకు సంపాదక సమితి శ్రీ శర్మగారికి అభినందనపూర్వకమయిన కృతజ్ఞత తెలియజేస్తున్నది.

శ్రీ నాగభూషణశర్మగారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఇంగ్లీషు భాషాధ్యాపకులుగా పనిచేస్తున్నారు. ఇంగ్లీషుతో పాటు తెలుగు సాహిత్యరంగంలో కూడా వీరు విశేషమయిన కృషిచేశారు. వారి కృషికి ఈ పుస్తకము చక్కని ఉదాహరణ. పైగా వీరికి గాంధీ ఉద్యమముతో పరంపరాగతమయిన సంపర్కం ఉండడము, తన్మూలంగా వీరికి గాంధీజీ పట్లను, ఆయన ఉద్యమం పట్లనూ సానుభూతి ఉండటము వీరి ఈ కృషికి "పసిడికిని తావి అబ్బినభాతి" అయింది. అయితే ఈ సందర్భంలో ఒకమాట చెప్పటము సముచితము కాగలదు. ఇప్పుడు ప్రకటిస్తున్న ఈ పుస్తకము సమగ్రమైనదని రచయితగానీ, మేము గానీ భావించటం లేదు. ప్రత్యక్షంగానూ అంతకంటే పరోక్షంగానూ గాంధీ-గాంధీయుగం-సాహిత్యంపై కలిగించిన ప్రభావం ఎంతో ప్రగాఢమైంది. దీనిని సక్రమంగా గ్రంథస్థంచేస్తే ఒక్కొక్క అంశంపైన ఒక్కొక్క గ్రంథం వ్రాయవచ్చు. అయితే ఇంతకృషి జరిగే వరకు ఏమిచేయకుండా వూరుకోలేము. జరుగవల్ల

సిన బృహత్కృషికి ఇది దిగ్దర్శనంగా ఉపకరించగలదని మా ఆశ. అంతేకాక ఈ కృషి, సాహితీ పరిశోధకులలో స్ఫూర్తిని కలిగించగలదనిన్నీ మా విశ్వాసం.

గాంధీ సాహిత్య ప్రచురణాలయము కొన్ని పుస్తకాల ప్రచురణలో చేయూత నీయవలసిందిగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారిని అర్థించింది. వారు వెంటనే ఈ పుస్తక ప్రచురణకు రెండువేల రూపాయలు ఈయడానికి దయతో అంగీకరించారు. కాగితము, అచ్చు ధరలు విపరీతంగా పెరిగిన ఈ రోజులలో సాహిత్య అకాడమీవారి సహాయము మాకు వేడినీళ్ళకు, చన్నీళ్లుతోడయినట్లయింది. ఈ సహాయానికి అకాడమీ కార్యనిర్వాహకులకు, ముఖ్యంగా అధ్యక్షులు డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారికి, కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి వినయపూర్వక కృతజ్ఞతను తెలియజేస్తున్నాము.

ఈ పుస్తక ముద్రణను అనతికాలంలో చక్కగా చేసి ఇచ్చిన చారీ అండ్ కంపెనీ కార్యకర్తలకు, ముఖపత్ర ముద్రణను అందంగా తయారుచేసి ఇచ్చిన పవన్ ప్రెస్ వారికిని మా ప్రశంసలు.

గాంధీయుగంలో ఆంధ్ర జాతీయజీవనంలో వివిధ రంగాలపై కలుగజేసిన ప్రభావాలను తెలిపే అనేక గ్రంథాలను ప్రచురించాలని సంపాదక సమితి ఆకాంక్షిస్తున్నది. ఈ మహాత్కార్య నిర్వహణలో ఆంధ్రలోకపు అండదండలు ఇతోధికంగా లభించగలవని ఆశిస్తున్నాము

కోదాటి నారాయణరావు
కార్యదర్శి
సంపాదక సమితి

గాంధీ సాహిత్య ప్రచురణాలయం
హైదరాబాదు - 20

# 1

# సాహిత్యం - జాతీయత

### జాతీయత - జాతీయోద్యమాలు

జాతి నిష్ఠమైన మానవత జాతీయత. ఇక్కడ 'మానవత' అంటే స్వచ్ఛందమూ, ఆర్ద్రమూ అయిన హృదయం కలిగి వుండడం ఏ ప్రజలు తమ జాతికి చెందిన సర్వజనుల జీవన విధానానికి, స్వేచ్ఛకు ఎట్టి అడ్డంకులు ఉండకూడదని నమ్మి ఆ ధ్యేయంకోసం సమిష్టి కృషి సలుపుతారో, ఆ జాతి ప్రజ జాతీయతకోసం పాటుపడుతున్నారని మనం చెప్పవచ్చు. 'జాతీయత'లో రెండు ముఖ్యమైన లక్షణాలు మిళితమై వున్నాయి. ఒకటి దేశభక్తి. రెండవది తాము కొన్ని బలీయమైన అనుబంధాలవల్ల ఏక కుటుంబానికి చెందినవారమన్న ఆత్మీయతా భావం.

దేశభక్తి చాలవరకు భౌతికమైన భావాలకే పరిమితమైనట్లు కానవస్తుంది. ఇది నాయిల్లు, నాభూమి, నాదేశం అన్నభావం దేశభక్తికి మూలకందమైన సూత్రం. ఇట్టి దేశభక్తి అన్ని దేశాలలోను, సర్వకాలాలలోను మనకు గోచరిస్తూనే వుంటుంది. "ఇంగ్లండుకు చెందిన యీ శరీరం, ఇంగ్లీషు గాలినే పీలుస్తూ"[1] అని ఒక దేశభక్తు

డైన కవి ఉద్రిక్తుడై పలికినప్పుడు, ఎన్నో యుగాల వెనుక భారతీయ ఋషులు అథర్వవేదంలోని పృథ్వీసూక్త నదీసూక్తాలను మైమరచి గానం చేసినప్పుడు యీ వుద్వేగమే వ్యక్తం అవుతున్నది.

కాని ఏక కుటుంబానికి చెందినవారమన్న ఆత్మీయతా భావం లేకపోతే దేశభక్తి పాక్షికమై పోతుంది. ఈ ఏక కుటుంబ భావం భాషవల్ల రావచ్చు; సంస్కృతీ సంప్రదాయాలవల్ల రావచ్చు, లేదా ఈ రెంటి కలయికవల్ల రావచ్చు. భారతదేశంలో యీనాటికి కూడా పటిష్టమైన జాతీయతా భావం ప్రభవించకపోవడానికి భాషలలోని భిన్నత్వమే కారణం. కాని దానిని కూడా అధిగమించగల సంస్కృతీ సంప్రదాయాల ఏకత్వం యీ దేశాన్ని రక్షించగల ఏకైక తత్త్వం.

ఇరవయ్యో శతాబ్దం ప్రథమ అర్ధభాగాన్ని జాతీయోద్యమ యుగంగా చెప్పవచ్చు. జాతీయోద్యమాలు అన్నీ జాతీయతా భావంలోనుంచి ప్రభవించినవే! ఒక జాతి తన అస్తిత్వాన్ని నిలుపుకోవడానికి చేసే సమైక్య కృషిని జాతీయోద్యమం అనవచ్చు. ఆ అస్తిక్యాన్ని నిలుపుకోవడానికి స్వాతంత్ర్యం ప్రాథమికమైన అవసరం. జాతి అస్తిక్యతపై దాని మానావమానాలు ఆధారపడి వుంటాయి. జాతి ఐక్యంగా వున్ననాడు - అంటే, దాని ఉనికిని నలుగురూ గుర్తించిననాడు ఆ జాతి తన భద్రతను కాపాడుకోవడమే కాక, ఇతర జాతులలో గౌరవ, ఆధిక్యతలను కూడా పొందుతుంది. అందువల్లనే జాతి ఐక్యత గుర్తింపబడడానికి అది స్వతంత్రమై వుండాలి. బానిస జాతులు గౌరవింపబడడం చరిత్రలో మనం ఎరుగని విషయం. ఇరవయ్యో శతాబ్దం ప్రథమార్థంలో బయలుదేరిన జాతీయోద్యమాలన్నింటికీ యీ స్వాతంత్ర్య సముపార్జనమే ప్రప్రథమ ధ్యేయమై వెలసింది.

జాతి అభ్యుదయానికి సామాన్య ప్రజానీకాన్నంతనూ ఐక్యతా

భావంతో సంఘటితం చేయడం జాతీయోద్యమానికి ప్రధానమైన లక్ష్యం. ఇట్టి ఐక్య సంఘటనలు పద్దెనిమిదవ శతాబ్దం చివరి భాగం తోనే ప్రారంభమై పందొమ్మిదవ శతాబ్దం మధ్య భాగానికి యూరపు అంతటా వేళ్ళు పాదుకొన్నవి. ఇట్టి ఐక్యసంఘటన మామూలుగా ప్రజలకు అహితమైన ప్రభుత్వానికి విరుద్ధంగా ఏర్పడుతుంది. ఆనాడు రాజ్యం చేస్తున్న ప్రభుత్వం ప్రజలకు ఎంత అహితమైనదవుతుందో జాతీయోద్యమం అంత తీవ్రమై వుంటుంది. అంతేకాదు. జాతీయో ద్యమ భావానికి ఆధునిక కాలంలో బీజారోపణం చేసిన రూసో - ఒక జాతికి సంబంధించిన సర్వ విషయాలలోను ఆ జాతికి స్వేచ్ఛ ఉండా లన్న నినాదం చేశాడు. స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వం ప్రాతిపదిక లుగా తన జాతి బాగోగులను తానే తీర్చి దిద్దుకోవాలన్న కాంక్ష ప్రతి జాతికి సహజం. ఆ కోర్కెలోనుంచి వచ్చినదే పరప్రభుత్వాలపై తిరుగుబాటు.

ఇలాంటి జాతీయోద్యమం ఫ్రాన్సులో మొగ్గతొడిగి, అమెరి కాలో పుష్పించి, రష్యాలో పిందె వేసింది. ఇలా పాశ్చాత్య దేశా లలో ప్రారంభమైన యీ ఉద్యమం - పాశ్చాత్య విద్యా సముపార్జన వల్ల, అంతర్యాప్తమైన యిచ్ఛవల్ల ఆఫ్రికా, ఆసియాదేశాలలో కూడా తలయెత్తింది. పరప్రభుత్వం బలవంతంగా బంధించివుంచిన మాతృ శృంఖలాలను తెంచి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను సముపార్జించాలనే ఆకాంక్షతో కోట్లాది ప్రజలు విభిన్నమైన పద్ధతుల్లో తమ ఉద్యమా లను ప్రారంభించారు. ప్రపంచ విస్తృతమైన యీ స్వాతంత్ర్య సము పార్జనా కాంక్షలో భారత జాతీయోద్యమం కూడా ఒక భాగమే !

### భారత జాతీయోద్యమం

"ప్రాచీన భారతదేశంలో జాతీయత" అన్న గ్రంథంలో ప్రొఫెసర్ రాధాకుముద్ ముఖర్జీ ఋగ్వేదకాలంనుంచీ కూడా

భారతదేశంలో జాతీయతాభావం ఎలా ప్రజల జీవితాలను సంఘటిత పరుస్తూ వచ్చిందో సోదాహరణంగా వివరించారు.[2] ప్రకృతి శక్తులను ఆరాధించి ఆహ్వానించే ఋక్కులు, పృథ్వీమాతను ఆవాహన చేయ డానికి ఉద్దేశింపబడ్డ పృథ్వీసూక్తం, విష్ణుపురాణంలో నియమింపబడ్డ ప్రజల విధులూ - యుగయుగాలనుంచీ భారతదేశంలోని దేశభక్తికి తార్కాణంగా ఆయన వివరించారు. "జననీజన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" అన్న సూక్తి ఈ భావానికి పరమోత్కృష్టమైన ఉదాహరణ.

కాని మధ్యయుగంలో బలమైన జాతీయతా భావం లోపించ డంతో దేశం పరదేశపాలనకు లోనుకావలసివచ్చింది. అప్పుడప్పుడు, అక్కడక్కడ తలయెత్తిన జాతీయోద్యమాలు- దేశభక్తి,రాజభక్తిగల కొద్దిమంది ఆవేశపూరితులైన త్యాగమూర్తుల కార్యదీక్షకు ఫలితాలై విస్మృతిలోను, ఉధృత సంచలనంలోను కూడా పరిమితాలుగానే వుండి పోయాయి. ఇట్టి వారిలో రాణాప్రతాప్, శివాజీ మొదలైన వీరశిఖా మణులను పేర్కొనవచ్చు.

పరప్రభుత్వాన్ని ఎదిరించాలన్న ఆవేశం జాగృతమై దేశ వ్యాప్తంగా సమిష్టి విప్లవాన్ని రూపొందించిన ప్రథమ స్వాతంత్ర్య సమరమే (1857) దేశప్రజలలో మొట్టమొదటిసారి జాతీయతా భావానికి అంకురార్పణ చేసింది. తదాది విద్యావంతులైన మేధావుల ఆధ్వర్యంలో జాతీయ మహాసభ (కాంగ్రెస్, 1885) ప్రారంభం అయ్యేవరకు ఆ భావం తలయెత్తుతూనే వచ్చింది.

రాజకీయమైన జాతీయతాభావానికి దోహదంచేస్తూనే, రాజా రామమోహనరాయ్ వంటి సంస్కర్తలు సంఘ దురాచారాలను మాన్పి జాతిని సాంఘికంగా పరిశుద్ధం చేయడానికి ప్రయత్నించారు. రాజకీయ సాంఘిక చైతన్యాలు ఒకదానికొకటి తోడై

జాతిని మేల్కొల్పే ప్రయత్నం చేస్తున్న తరుణంలో నిద్రాణమైన ప్రజలకు బెంగాల్ విభజన పిడుగుపాటుగా తోచింది. అప్పుడు అర్థమైంది ప్రజలకు, పరప్రభుత్వానికి తమ యిష్టానిష్టాలతో పనిలేదని. అది జాతీయభావ ప్రజ్వలనకు ఇంధనంవలె పనిచేసింది. బిపిన్ చంద్రపాల్ దేశ పర్యటనతో అది దేశం నలుమూలలకు పాకింది. గాంధీజీ రాజకీయ రంగంమీదికి ప్రవేశించేసరికి పరిస్థితి యిది. దీనిని సమగ్రమూ, సర్వజనాకర్షకమూ చేసిన ఘనత గాంధీజీదే. గాంధీజీ ప్రారంభించిన జాతీయోద్యమం కేవలం రాజకీయ ఆందోళనకు మాత్రమే పరిమితం కాకుండా ఆర్థిక, సాంఘిక స్వాతంత్ర్యాల సమ్మిశ్రిత స్వరూపం కావడంవల్లనే దీనిని సమగ్రమైన జాతీయోద్యమం అనవచ్చు.

"భారతదేశంలోని జాతీయోద్యమం కాంగ్రెసు పందిళ్లలోను, తిలక్ గోఖలేల తీర్మానాలలోను, పాల్ బెనర్జీల ఉపన్యాసాలలోను ఉదయించలేదు. కృష్ణునివలె అది కూడా పరప్రభుత్వ పీడనకు తాళలేక ఉత్సాహవంతులై వుండి కూడా అణగి వుండవలసివచ్చిన దేశభక్తుల హృదయ కారాగారాల్లో జన్మించింది. కృష్ణునివలెనే రాజప్రాసాదాల్లోకాక, సామాన్య మానవుల హృదయోద్యానాలలో పెరిగింది భారత జాతీయత"[3] అంటారు అరవిందులు. నిజమే. ప్రజ్వలించిన జాతీయతను నియమిత మార్గాన నడిపించగల నాయకునికోసమే అది వేచి వుంది. భారతీయతనూ, భారతీయ సంస్కృతినీ పరిరక్షించే నాయకత్వం వున్నప్పుడు ఆ జాతీయత ఎంత ఉజ్జ్వలమయం కాగలదో గాంధీ నాయకత్వాన దేశమంతా ఏకమై నిలిచినప్పుడు కాని పరప్రభుత్వానికి అర్థం కాలేదు. అందువల్లనే గాంధీజీ జాతినంతనూ ఒకే త్రాటిమీద నడిపి మహాత్ముడైనాడు

## సాహిత్యం - జాతీయోద్యమం[4]

కావ్య ప్రయోజనాలను గురించి చర్చిస్తూ "విశ్వశ్రేయః కావ్యమ్" అని, "కావ్యం......కాంతా సమ్మిత తయోపదేశ యుజే" అని భారతీయ ఆలంకారికులు పేర్కొన్నారు. వ్యష్టిలాభాన్ని వదిలి సమిష్టి శ్రేయస్సుకోసం పాటుపడడం జాతీయ లక్షణం. ఈ భావాన్ని గ్రంథస్థం చేసి తద్వారా కావ్యాన్ని విశ్వశ్రేయస్సుకోసం ఉపదేశాత్మకం చేస్తాడు కవి. ఈ ఉపదేశాత్మకత దేశ కాల వాతావరణాలను బట్టి మారుతూ వుంటుంది.

నిద్రాణమైన జాతిని ఉద్బుద్ధం చేయడానికి యిట్టి ఉపదేశాత్మకమైన సాహిత్యంకన్న మరో ఉత్తమ సాధనం లేదు. "ప్రజా సంకల్పములను, ప్రజాశయములను విశదముచేసి ప్రజలను కార్యపరతంత్రులనుగ జేయుటకు వాఙ్మయము పరమ సాధనముగ నున్నది."[5] అన్న మాటలు నాటికి నేటికి కూడా సత్యాలే. వాఙ్మయం ద్వారా జాతి యొక్క సర్వజీవన విధానమూ, వారి ఆశలు, ఆశయాలు, వారి నిరాశలు, కావేషాలు - అన్నీ విస్పష్టంగా విశదమౌతాయి. ఇట్టి ప్రబోధ సాహిత్యం రెండు విధాలుగా ఉండవచ్చు. కవి - ఒక జాతీయోద్యమం పెరిగి పెద్దదైన తరువాత అది జాతినంతనూ ఆవేశించినప్పుడు తానుకూడా ఉత్తేజితుడై ప్రబోధ సాహిత్యం సృష్టించవచ్చు అది ఛాలమంది రచయితలు అనుసరించే పద్ధతి. అలాకాక కవి 'క్రాంతదర్శి' కనుక తన సమాజానికి ఏది హితమో, శ్రేయమో - దానిని తానే వ్యూహించి, ఉపదేశిస్తే - ప్రజలు ఆ కవి పూరించిన సాహిత్య శంఖారావాన్ని విని మేల్కొనడం - ఉత్తమశ్రేణికి చెందిన ప్రబోధ సాహిత్యం అవుతుంది.

ఫ్రెంచి విప్లవానికి కారణభూతమైన రూసో, వాల్టేర్‌ల రచనలు, రష్యా విప్లవానికి తీర్చిదిద్దిన మార్క్స్, టాల్‌స్టాయ్, డాస్టొ

వస్కీల రచనలు, ఆయా దేశాల జాతీయోద్యమాలకు దోహదంచేసి, ప్రజలపై ఎంతో ప్రభావాన్ని కలుగచేశాయి.

అలాగే భారతదేశంలో జాతీయోద్యమం ఇంకా ప్రారంభావస్థలో వుండగానే స్వామి దయానంద సరస్వతి, రాజా రామమోహన రాయ్ వంటి ప్రముఖుల రచనలు ప్రజలలో కొత్త ఆశలను మొలకెత్తించాయి. తిలక్ తన భగవద్గీతా వ్యాఖ్యానం ద్వారా 'నిష్కామ యోగా'న్ని రాజకీయాలకు అన్వయించి, భారత స్వాతంత్ర్య యుద్ధానికి ఒక వినూత్నమైన అర్థాన్ని స్ఫురింపచేశాడు. శ్రీకృష్ణుడు అర్జునునికి చేసిన బోధకు, దేశానికి ఆవశ్యకమైన కర్మయోగానికి సమన్వయం కుదిర్చి, జాతీయోద్యమానికి, కురుక్షేత్రంలో పాండవులు సాగించిన ధర్మ యుద్ధానికి సారూప్యం చూపాడు ఆయన. తాము పాండవులమని, తమలో ప్రతి ఒక్కడూ అర్జునుడనీ గ్రహించారు ప్రజలు. కాని వారికి దారిచూపి, నడిపించవలసిన కృష్ణుడెవరు ?

ఎప్పుడైతే గాంధీజీ - తన నడవడి ద్వారా శాంతి, అహింసలన్న తన సిద్ధాంతాల ద్వారా, సత్యాన్ని ఆశ్రయించడం ద్వారా - రాజకీయాలకు, ఆధ్యాత్మిక జీవన విధానానికి ఒక అవినాభావ సంబంధాన్ని, ఒక పటిష్టమైన బంధాన్ని పాదుకొల్పాడో, అప్పుడు ప్రజలకు తాము ఇన్నాళ్ళుగా కలలు కంటున్న అవతార పురుషుడు ఆవిర్భవించాడనిపించింది. అందువల్లనే జనులు

> "గాంధిదేవుడై యవతరించెనన్నారు. ఆయనయే కృష్ణుడు. రాటమే వేణువు. తన్మధుర ధ్వని వంశీనాదము. భారత దేశము బృందావనము. ప్రజలు గోపికలై యాయన చెప్పినట్లే కోట్లకు గోట్లు జనులు గుమిగూడి యవలంబింపజొచ్చిరి."[6]

అంతేకాదు "స్వధర్మే నిధన శ్రేయః, పరధర్మో భయావహః"[7] అన్న

సూత్రాన్ని మనోవాక్కాయ కర్మలతో ఆచరించడానికి కంకణం కట్టుకొన్నారు ప్రజలు. దానికి పర్యవసానమే గాంధీజీని దేవుణ్ణిగా చూపే అసంఖ్యాకములైన రచనలు వెలువడడం.

దేశ భాషల్లో వచ్చిన గాంధేయ సాహిత్యాన్ని పరిశీలిస్తే, 1920-32 మధ్యకాలంలో వచ్చిన రచనల్లో అత్యధిక భాగం గాంధీజీని భగవంతుని అవతారంగా భావించిన భక్తి రచనలే అధికం. 1932-48 మధ్య కాలంలో ఆయన సిద్ధాంతాలను, ఆయన పేరొక్కన్న నిర్మాణ కార్యక్రమాలను గురించిన రచనలు, తిరిగి ఆయన మరణానంతరం - 1948 నుంచీ - ఆయనను భగవంతునిగా ఆరాధించే రచనలే ఎక్కువగా వచ్చాయని మనం గ్రహించవచ్చు.

గాంధీజీ కేవలం రాజకీయ నాయకుడు మాత్రమే అయివుంటే ఆయనయెడ ప్రజలకు యింతటి భక్తి ప్రపత్తులు, సాహిత్యంలో యింతటి భక్తి రచనలు వెలువడి వుండేవేకాదు. ఆయన ప్రజలకు రాజకీయ నాయకుడే కాదు. వారి నైతిక జీవన విధానాలను తీర్చిదిద్దే నాయకుడైనాడు. అందువల్లనే ఆయనకు యింత విస్తృతమైన ఖ్యాతి; ఆయనయెడ ఇంతటి భక్త్యావేశాలు.

## తెలుగు సాహిత్యంలో గాంధీజీ

ఇలా సర్వ ప్రజలకూ నాయకుడై, జాతిపిత అయిన గాంధీజీ జీవిత చరిత్రలూ, ఆయన సిద్ధాంతాలపైన గ్రంథాలు దేశంలోని అన్ని భాషల్లో వ్రాయబడి, విద్యాగంధం ఉన్న ప్రతివానికీ అందుబాటులో వుండేటట్లు చేయబడ్డాయి. అవి కావ్యాలుగా వెలిశాయి. ప్రశంసాత్మకమైన శతకాలుగా వెలువడ్డాయి. నవలలై యింటింటా చదవబడ్డాయి. గేయాలై, పాటలై నలుమూలలా గానం చేయబడ్డాయి. ఇలా సాహిత్యంలోని అన్ని ప్రక్రియల ద్వారా గాంధీజీ సిద్ధాంతాలు

వెలువరింపబడడం చూస్తే పండిత పామరులను సైతం ఆయన ఎంతగా ప్రభావితులను చేశారో ద్యోతకం అవుతుంది.

ప్రేమ్‌చంద్, మైథిలీశరణ్‌గుప్త, సుదర్శన్, రాయప్రోలు, తుమ్మల, నారాయణసీతారాం ఫడ్కే, ఖాండేకర్, శ్రీకృష్ణశర్మ, దివాకర్—ఇలా ఎందరో రచయితలు - అన్ని భాషలకు, అన్ని ప్రాంతాలకు చెందినవారు ఆయన కీర్తిని గానం చేసి, ఆయన సిద్ధాంతాలకు కావ్యత్వం కల్పించి, వానిని ఉదాత్తమైన సాహిత్యంగా రూపొందించారు. రాజకీయవాదులు గాంధీ సాహిత్యాన్ని విస్మరించవచ్చు; ఆయన ప్రపంచించిన నైతికమైన విలువలు ఈనాడు ఆచరింపబడకపోవచ్చు. కాని భారతీయ సాహిత్యంవల్ల గాంధీజీ అమరుడై కలకాలం బ్రతికి వుంటాడు.

తెలుగు సాహిత్యంలోని వివిధ శాఖలపై ప్రసరించిన గాంధీజీ ప్రభావ రేఖల్ని చూపడమే యీ పరిశోధనా వ్యాసానికి ధ్యేయం.

2

# కావ్య సాహిత్యం

గాంధీజీవలన ప్రభావితమైన కావ్యసాహిత్యాన్నంతనీ రెండు భాగాలుగా విభజించవచ్చు. గాంధీజీ జీవితాన్ని స్వీకరించి కావ్యాలుగా మలచినవానిని ప్రత్యక్ష ప్రభావితాలుగాను, ఆయన సిద్ధాంతాలను స్వీకరించి వాని చుట్టూ కథలు అల్లి ఆ కథలను వస్త్వాశ్రయబద్ధంగా రూపొందించిన వానిని పరోక్ష ప్రభావితాలుగాను పేర్కొనవచ్చు. అంటే కావ్యబద్ధమైన జీవితచరిత్రలను ప్రత్యక్ష ప్రభావిత రచనలుగాను, సిద్ధాంతపరములై వస్త్వాశ్రయంతో వ్రాయబడిన కథా కావ్యాలను పరోక్ష ప్రభావిత రచనలుగాను విభజించవచ్చు. జీవిత చరిత్రలను కావ్యాలుగా వ్రాయడంకన్న, ఒక సిద్ధాంతాన్ని స్వీకరించి, దానికి ఆలంబనంగా ఒక కథను అల్లి కావ్యం రాయడం కవికి ఎక్కువ స్వేచ్ఛను, అతని ప్రతిభకు ఎక్కువ రాణింపును కలిగిస్తాయి. కనుక ప్రత్యక్ష ప్రభావితమైన రచనలకన్న పరోక్షంగా ప్రభావితములైన రచనలే ఏ సాహిత్యంలోనైనా ఎక్కువ. తెలుగులో గాంధేయ సాహిత్యమూ అంతే.

ఈ అధ్యాయంలో 'కావ్యసాహిత్యం' అన్న శీర్షికక్రింద కవిత్వం

లోని వివిధ ప్రక్రియల్ని పరామర్శించడం జరుగుతుంది. ఇందులో కావ్యం, ఖండకావ్యం, శతకం, గేయసాహిత్యం (పాటలు, కీర్తనలు, గేయాలు) చేరతాయి. ఈ అన్ని ప్రక్రియల్లోని రచనలను ప్రత్యక్ష, పరోక్ష ప్రభావితాలంటూ వేరుచేయడం సాధ్యం కాదు. ఈ విభజన ఒక్క కావ్యాలకు మాత్రమే ఎక్కువగా వర్తిస్తుంది.

### కావ్యాలు

గాంధీజీ జీవితాన్ని ఇతివృత్తంగా స్వీకరించి వ్రాయబడ్డ కావ్యాలలో తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారి **"ఆత్మకథ"**, **"మహాత్మకథ"**, మరింగంటి శేషాచార్యులుగారి *"శ్రీ గాంధీ భారతము"*, అంబటి సుబ్బరాయగుప్తగారి *"శ్రీ గాంధి మాహాత్మ్యము"* పేర్కొనదగినవి. ఇందులో చివర పేర్కొనబడ్డ కావ్యం అసంపూర్ణం. అందులోని ప్రథమ పంచకం యిటీవలనే (1969) మొదటి సంపుటంగా వెలువడింది.

### తుమ్మలవారి కావ్యాలు

గాంధీజీ జీవితంవల్ల, ఆయన సేవా తత్పరత త్యాగశీలాలవల్ల ప్రభావితాలై, ఆయనను యుగపురుషుణ్ణిగా భావించి కీర్తించిన కావ్యాలు తెలుగులో అసంఖ్యాకాలు. అటు కావ్యగౌరవాన్ని పొంది, ఇటు మహాత్ముని జీవితమిచ్చే సందేశాన్ని వ్యక్తంచేసే ఉత్తమ కావ్యాలు వ్రాసిన కవులలో అగ్రగణ్యుడు శ్రీ తుమ్మల సీతారామమూర్తిచౌదరి. "కడు కమ్మని కైత రచించువాడు"[1] అని తమ గురుపాదులు చెళ్లపిళ్లవారిచేత పొగడ్తల నందుకొన్న ఈయన గాంధీజీ జీవితాన్నంతనూ **"ఆత్మకథ"**, **"మహాత్మకథ"** అన్న రెండు పద్య కావ్యాలలో ప్రతిభావంతంగా చిత్రించారు. చౌదరిగారు స్వయంగా అకలంక దేశభక్తుడు. అందువల్ల సహజమైన అనుభూతితో

యీ కావ్యాలు వ్రాశారు. "కవితలో కమ్మదనము"[2] మెరిసేలా వ్రాయాలని దీక్షగై కొని అందులో కృతకృత్యులైనారు "అభినవ తిక్కన".

ఈ కావ్యాలలో మొదటిది "బాపూజీ ఆత్మకథ". 2-10-32 న ప్రారంభించి 26-1-51 వరకు దాదాపు ఇరవై సంవత్సరాల కాలంలో యీ "ఆత్మకథ"ను పూర్తిచేశారు. కవి తన జీవితధ్యేయాన్ని చెప్పుకుంటూ "నా సాహితీ సామర్థ్యములను మహాత్ముని యాశయములకే యంకితము చేసితిని"[3] అన్నారు. ఈ గ్రంథాన్ని—"సూనృతాహింస లీ రూపుం గైకొనివచ్చె"[4] ననీ, "ఆర్తజనతా రోచిష్ణుతా కాంక్షమై బాపూజీ మన వేల్పు దీని నిచటన్ బండించె"[5] ననీ, "విశ్వప్రజా పాపచ్ఛేదకమైన పంట యిది"[6] అనీ చౌదరిగారు పేర్కొనడం చూస్తే సాహిత్యక్షేత్రంలో ఎంత కాకలుతీరిన వ్యావసాయికుడుగా గోచరిస్తాడో, అంతగానూ గాంధీజీ ఆశయాల పంటను పండించే రైతుగా కనిపిస్తాడు ఆయన.

ఈ గ్రంథానికి కట్టమంచి రామలింగారెడ్డిగారు "తిలక రచన" చేస్తూ "తుమ్మల సీతారామమూర్తి మహాత్ముని యొక్క ఆస్థానకవి. ఈ స్థానము శాశ్వతము"[7] అన్నారు. ఈ మాటలు ఎంతైనా సత్యం. తిక్కనను మరిపించే శైలిలో[8] ఆధునిక భారతము అనదగిన గాంధీజీ జీవితాన్ని తెనుగు లెంకయై వ్రాసి "అభినవ తిక్కన" అన్న సార్థక నాముడైనాడు చౌదరిగారు.

ఈ 'పద్యాత్మకమైన ఆత్మకథ' ఇంతకు పూర్వమే "శివరామ శాస్త్రి - విద్వత్కవి సింహము - దీని మధుర గద్యాకృతిలో"[9] వ్రాసినా, పద్యాలలో వ్రాసినప్పుడే సరసులు మెత్తురని యీ పనికి పూనుకొన్నట్లు చెప్పుకొన్నారు రచయిత.

ఇది ఆత్మకథకు అనువాదం కనుక మూలంలో వున్నదానిని

యథాతథంగా పద్యాలలో పొదగడమే కవి చేయవలసిన పని కనుక ఈ కావ్యంలో కవికి ఎక్కువ స్వేచ్ఛ వుండే వీలులేదు. అయినా కవి తీసుకోదగినంత స్వేచ్ఛను కొన్నిచోట్ల రచయిత తీసుకోక తప్పలేదు. 'జన్మాదికము' అన్న అధ్యాయంలో తన తండ్రిని గూర్చి చెబుతూ గాంధీజీ వ్రాసిన మాటలకు పద్యానువాదం ఇది :

ఆతని కైదవ సుతుడై
పూతాత్ముడు నాదు తండ్రి పొడమె నతడు వి
ఖ్యాత మనీషా బల వి
జ్ఞాతాఖిల రాజ్యతంత్ర చతురుం డయ్యెన్.[10]

ఇందులోని విశేషణాలన్నీ కవి స్వయంగా కూర్చినవే! ఇలాగే 'స్వస్తి' అన్న అధ్యాయంలో పన్నెండు, పదమూడు పద్యాలు కూడా కవి తీసుకొన్న స్వేచ్ఛను చూపుతాయి. ఈ స్వేచ్ఛ కొన్ని స్థిరపడి పోయిన పదాల విషయంలో కూడ వీరు చూపారు. ఉదాహరణకు, 'హోమురూలు' అన్న పదానికి వీరు చేసిన అనువాదం 'ఇంటి సత్యాగ్రహము'.

మొత్తంమీద 'ఆత్మకథ'తో తుమ్మలవారు, తుమ్మలవారితో 'ఆత్మకథ'—రెండూ తెలుగుదేశంలో ప్రఖ్యాతా లయ్యాయి. "విష యము గాంధీమహాత్ముని స్వీయచరిత్రము, లోకారాధ్యమైనది. సర్వ జనాదరణీయమును, సేవ్యమును. తమ శైలి యించుమించు ఆంధ్ర మహాభారత ప్రతిబింబము"[11] అన్న కట్టమంచి వారి అభిప్రాయమే సర్వ విమర్శకుల అభిప్రాయం కూడా. ఇలా సమకాలీన కవులచేత, విమర్శకులచేత కూడా సమంగా ప్రశంసల నందు కొన్నారు చౌదరి గారు. ఈయనలోని సౌజన్యము, ధర్మాభిరతి యీయనను జాతీయ కవులలో ప్రఖ్యాతుణ్ణి చేశాయి. ఈయనలో పండితులు మెచ్చే శబ్దాధి కారము, పామరుల నాకర్షించే భావావేశము కన్పిస్తాయి.

### మహాత్మ కథ

తుమ్మలవారి రెండవ కావ్యం "మహాత్మ కథ". 1951 నుంచి 1966 వరకు దీని రచన సాగింది. "ఆత్మకథ" లో "మన ముందు బాపూ సాగించిన సత్యాగ్రహసమరముల చరిత్రలు,మనకై నలగి నలగి బలియైపోయిన జాతిజనకుని జీవనగాథలు లేమింజేసి"[12] మహాత్ముని జీవితాన్ని ఆసాంతము అభివర్ణించడానికిగాను వ్రాసినది ఈ "మహాత్మ కథ". అందువలన దీనిని "ఆత్మకథ" కు పరిపూరకమైన భాగము అన వచ్చు. గాంధీజీ ఆత్మకథ నాగపూర్ కాంగ్రెస్‌తో అంతమౌతుంది. "ఇక్కడనుంచి నా జీవితంలో జరిగిన విషయాలలో ప్రజలకు తెలియ నివి లేవు" అంటూ తన ఆత్మకథను ముగించారు బాపు ఆ తెలిసిన ఘట్టాలను కావ్యరూపంలో రూపొందించారు తుమ్మలవారు.

"ఆత్మకథ" అనువాద కావ్యం. "మహాత్మకథ" స్వకపోల కల్పితం. అందువల్లనే చౌదరిగారు "కృత్యాది"లో ఈ రెండు గ్రంథా లకు గల భేదాన్ని తామే యీ విధంగా పేర్కొన్నారు :

"చేసిన పుణ్యమై తనకు జిక్కిన కైత ఫలింప భక్తిమై
వ్రాసినవాడ దొల్లి యెరవాడ తపస్వి కృతంబు సూనృత
శ్రీ సముపేత మాత్మకథ........."[13]

అంతే కాదు

"......బాపుజీ నిర్వచించిన బ్రతుకు చంద
మేబదేండ్లది యద్దాన నెరుగవచ్చు"[14] నని చెప్పి "ఉత్తర కథా నిధానమై యొప్పుదాని"[15] ని తమ "మహాత్మ కథ" లో ఎరుగ వచ్చునని చెప్పారు రచయిత. మరొక ముఖ్యమైన భేదాన్ని గురించి కూడా కవి తెలియచెప్పారు :

"బాపూ వ్రాసికొన్న తెరంగునకును నా వ్రాయనేర్చిన తెరంగు
నకును వింగడం బెంతేని కలదు—ఆత్మపరిశోధనైక దృష్టిమై

నడుగడుగునం దొరిపిడి వడుచుం బ్రకటించుకొన్న దాత్మకథ. కేవల భక్తి విశ్వాసముల కలన గృతజ్ఞతా సూచకమ్ముగా నభివర్ణించునదీ మహాత్మ కథ - అది తత్త్వపమితు. ఇది కథా కావ్యము"[16]

ఈ మాటలనుబట్టి కవి దీనిని కథాకావ్యంగాను, గాంధీజీని నాయకుణ్ణి గాను స్వీకరించినట్లు స్పష్టమవుతున్నది ఒట్టి నాయకుడు కాదు; దేవు డైన నాయకుడు :

"విశ్వకల్యాణమునకు నుద్వేలమైన
లపము గావించె, నఖిల బాధలు సహించె
నెవ్వ డవ్వాని వేల్పుగా నెంచి యతని
బ్రతుకు నుతిసేయు కృతి కిష్టపడెద నేను"[17]

తాను నాయకుణ్ణి ఊహించిన విధానాన్ని గురించి చెబుతూ "రాముని సత్యము, కృష్ణుని ప్రేమము, గౌతముని కరుణ - పెనగొన్న"[18] బాపూ జీవితం తన కావ్యానికి కథ అంటాడు. ఈ కథను చెప్పడంలో తుమ్మలవారు - పంజరం నుంచి వెలికి వచ్చిన స్వేచ్ఛావిహంగంవలె - బాపూ ప్రశంసలను చేశారు. దీనికి పరాకాష్ఠగా

పలికెడిది గాంధి కథ యట
పలికించెడివారు తెనుగు ప్రజలట దీనిం
బలికిన నూరట యౌనట
పలికెద నిక నొండు మఱచి బాపు చరిత్రన్"[19]

అని చెప్పుకొని, పోతన్నగారు రాముణ్ణి స్మరించినట్లే - తాను గాంధిదేవుణ్ణి స్మరిస్తున్నానన్న భావాన్ని వ్యక్తీకరించారు.

ఇందులో కథ 1918 మే నుంచి ప్రారంభమౌతుంది. రౌలటు చట్టమూ, గాంధీజీ మొదటిసారిగా సత్యాగ్రహం ప్రారంభించటమూ - మొదటి అధ్యాయంలోని విషయాలు. ఈ కావ్యం ఆద్యంతమూ

మనకు కనిపించే మొదటి లక్షణం – "గాంధీజీని భగవదవతారంగా ఊహించడం." ఆయన దేశాన్ని, ప్రజలను ఉద్బోధిస్తూ చెప్పిన మాటలు ధర్మయుద్ధం చేయండని పాండవులకు బోధించిన కృష్ణుని మాటలను జ్ఞప్తికి తెస్తాయి.[20]

ఈ కావ్యంలో గాంధీజీ జీవిత చర్యలతో పాటు ఆయన నిర్మాణ కార్యక్రమాన్ని, అందులో పాల్గొన్న కన్నెగంటి హనుమంతు, అల్లూరి సీతారామరాజు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య వంటి తెలుగు వీరుల కథలను ఎంతో ఆత్మీయతాభావంతో పేర్కొన్నారు రచయిత. "ఈయన కేవలం జాతీయ కవే కాదు. నిజమైన తెలుగు కవి"[21] అన్న కాటూరివారి మాటలు సత్యదూరాలు కాదు.

ఈ రెండు కావ్యాలకు "ఆత్మకథ", "మహాత్మకథ" అని పేర్లుంచడంలో తుమ్మలవారు తమ ఆలంకారిక చాతుర్యాన్ని చూపారు. మొదటిది "ఆత్మకథ". రెండవది మహాత్ముని కథ లేదా 'మహా ఆత్మకథ' మొదటి కావ్యంలో – గాంధీ తన్ను గురించి తాను చెప్పుకొన్నది కనుక – మాహాత్మ్య మేమీ కనుపించదు రెండవది కవి ఆయనను గురించి చెప్పినది కనుక, ఆయన దానిలో గాంధీజీ మాహాత్మ్యాన్ని చూపగలిగాడు. కనుక–ఇది మహాత్మ కథ. రచయిత దృష్టిలో ఆత్మకథకన్న ఇది మించినది – తాను గాంధీజీ జీవితాన్ని చిత్రించే విషయంలో లేదా తన భక్తి భావాన్ని వెల్లడిచేసే విషయంలో – అని కూడా అర్థం స్ఫురించక తప్పదు. అంతేకాక ఆత్మకథలో గాంధీజీ చూపిన సత్య పరిశోధన కన్న ఆ తరువాతనే ఆయన ఆ విషయంలో ఎక్కువ ప్రయోగాలు చేయడంవల్ల కూడా ఆయన తరువాతి చరిత్ర 'మహాత్మ కథ' కావడమే సమంజసం.

కేవలం జీవిత చరిత్రకు కావ్యత్వాన్ని కల్గిస్తూ వ్రాయడం కష్టసాధ్యమైన పని. దానిని ఎంతో నేర్పుతో తీర్చిదిద్దారు తుమ్మల

వారు దీనికి ముఖ్యమైన కారణం బాపూజీ యెడ కవికున్న భక్తి ప్రపత్తులు. ఆ భక్తిప్రపత్తులను అనేక విధాల కవి యీ కావ్యాలలో ప్రదర్శిస్తూనే వున్నాడు. "ఆత్మకథ" ను పూర్తి చేసిన వెంటనే (1951, జనవరి 26) తన కృతిని గురించి, దానికి బాపూజీకి గల సంబంధాన్ని గురించి ఆయన పేర్కొన్న భావాలు గమనించతగ్గవి.

"ముప్పది ఏండ్లనుండి తృణమో కణమో తినుచున్నవాడ నో
యప్ప! భవద్వచోవిభవ; మన్యులెరుంగకపోవుగాక యీ
యప్పు భరింపరాని బరువై నిను నచ్చపుచెల్లుబాస నీ
చొప్పున దీర్చుకొందు బుణశుద్ధి, కిదే సరిపుచ్చుకొందువా ?"[22]

లోకోత్తరమైన కదను స్వీకరించి, చక్కని తెలుగు నుడికారాన్ని దానికి జోడించి, రెండు చక్కని జాతీయ కావ్యాలను తెలుగువారికి అందించారు సీతారామమూర్తిగారు. గాంధీజీ చివరి దశను వర్ణిస్తూ

"పలికినట్టి పలుకు బ్రతికిన బ్రతుకును
గట్టకడకు సార్థకమ్ము గాగ"[23]

తన జీవితలక్ష్యాన్ని సాధించిన మహానుభావునిగా పేర్కొన్నా రాయనను. సీతారామమూర్తిగారు కూడా అలానే తమ లక్ష్యాన్ని సాధించి తెలుగు సాహిత్య సీమలో అజరామరమైన కీర్తిని సాధించు కోవడమే కాక తమ బ్రతుకును సార్థకం చేసుకొన్నారు.

## శ్రీ గాంధీ భారతము

గాంధీజీ జీవితాన్ని కావ్య రూపంలో మలచాలన్న కోర్కెతో చేయబడిన మరో ప్రయత్నం "*శ్రీ గాంధీ భారతము*". దీని కర్త శ్రీ మరింగంటి శేషాచార్యులు. గాంధీజీని శ్రీకృష్ణుణ్ణిగా ఊహించి, జాతీయోద్యమాన్ని భారతయుద్ధంగా భావించి మహాభారతం వలెనే పద్దెనిమిది పర్వాలలో "*శ్రీ గాంధీ భారతము*" అన్న పేరుతో

బృహత్కావ్యాన్ని వ్రాయాలనే మహత్సంకల్పం కలవారు డాక్టరు శేషాచార్యులు. ఈ పద్దెనిమిది పర్వాలలో మొదట ప్రచురింపబడ్డది 'నిర్యాణపర్వము' (1949). ఇందులో గాంధీజీ అంతిమదశ వర్ణించ బడ్డది. మహాభారత కథను జనమేజయునికి వైశంపాయనుడు చెప్పి నట్లుగా యీ కావ్యాన్ని కూడా అభినవసూతుడు "ఛాదరి" అన్న వ్యక్తికి చెప్పినట్లుగా చూపబడ్డది.

"ఛాదరి" అన్న వ్యక్తి వేసిన—

"కలడే ఈ కలియందు ధర్మమునకే కష్టమ్ముదానోర్చి శ్రీ
లలనా పాంగ కటాక్ష చంద్రికల నిర్లక్ష్యంబుగా ద్రోచి ని
స్థుల నిర్లిప్త విరాగ పద్ధతులలో దుర్మార్గ సంఘంబులన్
లలి సన్మార్గము జూపి వృద్ధిగనగా లాలించువాడెవ్వడేన్."[24]

అన్న ప్రశ్నకు 'అభినవసూతుడు' చెప్పిన సమాధానమే ఈ 'భారతము'. దీని కథావస్తువు శాంతిసమరంలో మహారథుడైన గాంధీజీ జీవితం "అపారచింతాజనకమైన గాంధీమహాత్ముని నిర్యాణ మభివర్ణించిన తరువాత... స్వార్థత్యాగజ్యోత్స్నా విరాజిత జీవనములు గడపుటకై నిశ్చయించి స్వీయకృపిత పుత్రులైన శాంతాశ్రమ వాసులకు, సకలనవీనేతిహాస వర్ణన కళావిశారదుండైన యభినవ సూతమహర్షి "[25] శ్రీ గాంధీజీ జీవితమును వర్ణించి చెప్పడమే యీ గ్రంథం కథావస్తువు.

ఈ 'నిర్యాణపర్వము' లో మహాత్ముని మరణసమయంనుంచి, సంచయనం వరకు జరిగిన విషయాలు వర్ణించబడ్డాయి. ఈ పర్వం లోనే మరో భాగం ఉన్నదని, దానిలో గాంధీజీ అస్తికల సంచయనం, హత్య కావించిన వారి న్యాయ విచారణ మొదలైన విశేషాలు వర్ణింపబడతాయని రచయిత పేర్కొన్నాడు. కాని ఆ భాగం వెలువడినట్లు తోచదు.

దీని తరువాత ప్రచురింపబడినది "బాల్యపర్వము" (1951). గాంధీజీ లోకోత్తమ పురుషుడని, "గోపికలు కృష్ణమహాత్ముని వర్ణించి తరించినటుల మన యందరి కవితాకన్య లా లోకోత్తమ పురుషు నభివర్ణించి తరింపవచ్చును" - అని గ్రంథకర్త ఉపోద్ఘాతంలో పేర్కొన్నాడు. ఈయన కూడా - తుమ్మలవారి వలెనే - పన 'గాంధీభారత' రచనకు వ్రాసిన 'ప్రస్తావన' లో

"పలికెడిది గాంధి చరితము
పలికించెడి శక్తి సత్య భావోదయమే
పలికి దృతీయ యుద్ధము
కలుగన్ రాదనెడి నమ్మకమ్ము జనించెన్"[26]

అని చెప్పి, గాంధీజీ సత్యాహింసలకు ప్రపంచ రాజకీయాలపై గల ప్రబల ప్రభావాన్ని నిరూపించాడు

ఈ రచయితకు గాంధీగారంటే వల్లమాలిన భక్తి. అందువల్లనే "ఇట్టి మహాసీయుని చరిత్ర వ్రాయుట పుణ్యమును పురుషార్థమును అనెడి భక్తిభావనుతో నా మిత్రుడీ రచనకు నుపక్రమించియుండును. అంతేగాని కవి యశఃకాంక్షచే గావనుట స్పష్టము"[27] అని పింగళి లక్ష్మీకాంతంగారు చెప్పిన మాటలు ఎంతైనా సమంజసమైనవి. ఇందులో కవిత్వంకన్న భక్తిభావం అధికంగా ఉన్న మాట నిజం. అక్కడక్కడ కవిత్వపు ఛాయలు లేకపోలేదు.

"అరడజే మొనమొన్న హైందవ వ్యథ బాప
నూరూర నవకాళి నోర్మి దిరిగె"

అన్న పద్యంలోనూ

"ఈ వీరుడే కదా ఎనలేని కష్టాల
స్వాతంత్ర్య లబ్ధికై చక్కనోర్చె"

వంటి పద్యాలలోను కొడాలి సుబ్బారావుగారి "హంపీక్షేత్రము"లోని పద్యాల పోకడలు కానవస్తాయి.

సాహిత్య విమర్శ దృష్ట్యా అంత ఉత్తమమైన రచన కాక పోయినా గాంధీజీ జీవితాన్ని - ధర్మాధర్మ సంఘర్షణలో ధర్మం పక్షాన నిలచిన శ్రీకృష్ణుని జీవితంతో పోల్చడం ఈ గ్రంధకర్తకు గాంధిగారియెడ గల భక్తితత్పరతను చాటి చెబుతున్నది. అందుకైనా యీయన ప్రశంసార్హుడు. ఈ రెండు పర్వాలలోను కేవలము ప్రజలందరికి తెలిసిన ఘట్టాలకు అంత ప్రాముఖ్యం యివ్వక, గాంధీజీ జీవితంలో ఎక్కడెక్కడ మానసిక సాంఘిక సంఘర్షణమూ, పరిణామమూ కన్పిస్తుందో ఆ యా సంఘటనలను మాత్రమే స్వీకరించినట్లు కన్పిస్తుంది. అతిబాల్యవివాహాలను గురించి, "హూణదేశ విద్యాభ్యాస ప్రయాణ చింతనము" ను గురించి ప్రస్తావించి వాని మంచిచెడులను గురించి విమర్శిస్తాడు రచయిత.

గాంధీగారు ధర్మసంస్థాపనం కోసం యీ కలికాలంలో జన్మించిన అవతారపురుషుడన్న భావాన్నే యీయన యీ రెండు పర్వాలలోను చిత్రించారు

## శ్రీ గాంధి మాహాత్మ్యము

గాంధీ శతజయంత్యుత్సవ సమయంలో వెలువడిన యీ చంపూ కావ్యం రచయిత శ్రీ అంబటి సుబ్బరాయ గుప్త. మహాత్ముని సమగ్ర జీవిత చరిత్ర వ్రాయాలన్న సంకల్పంతో ప్రారంభమైన యీ ప్రయత్నంలో తొలిఘట్టం అయిన 'ప్రథమ పంచకం' మొదట ప్రచురింప బడ్డది (1969). ఆ తరువాత ద్వితీయ షట్కం, తృతీయ సప్తకం కూడా వెలువడతాయని, యీ చరిత్ర మొత్తం అంతా పద్దెనిమిది స్కంధాలలో వ్రాయబడుతుందని రచయిత పేర్కొన్నారు.

ఇందులోని స్కంధ విభాగం భాగవతాన్ని పోలివుంది. "భాగవతము శ్రీకృష్ణావతార గాధ. ఈ యుగపురుషుడైన గాంధీ మహాత్ముడు గూడ అవతారపురుషుడే. కనుక నాయన జీవితగాథ దెలుపు గ్రంధమున స్కంధ నామము వాడుట సమంజసము"[23] అని శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులుగారు పీఠికలో చెప్పిన మాటలను బట్టి రచయిత ఉద్దేశ్యం స్పష్టమవుతున్నది.

ఈ కావ్యంలోని ప్రథమ సంపుటంలో ఐదు స్కంధాలు వున్నాయి. గాంధీజీ జననంతో (1869) ప్రారంభమైన యీ భాగం 1920 తో ముగుస్తుంది ఇలా 1920 తో ప్రథమ భాగాన్ని ముగించడంలో రచయిత గాంధీజీ ఆత్మకథను అనుసరించినట్లు కనిపిస్తుంది. గాంధీజీ ఆత్మకథ కూడా నాగపూరు కాంగ్రెసు (1920) తో ముగుస్తుంది ఇందులో ఐదు స్కంధాలే కాకుండా, కథను సమగ్రంగా చేయడానికి మధ్యమధ్య అనుబంధాలు కూడా చేర్చారు రచయిత. "చరిత్ర సమగ్రముగా నుండుట కందందు స్కంధాంతములం దనుబంధ రచన గూడ జరిగినది". ఈ అనుబంధ రచనలలో ఆత్మకథలో విపులంగా లేని కొన్ని ఘట్టాలను, సంఘటనలను చేర్చారు రచయిత. నాలుగు, ఐదు స్కంధాల తరువాత యీ అనుబంధాలు చేర్చబడ్డాయి.

ఈ కావ్యం అనువాదం కాదు. గాంధీజీ ఆత్మకథతో పాటు ఎన్నో మూలగ్రంథాలు ఆధారంగా చేసుకొని వ్రాయబడ్డది. అందువల్లనే మిగిలిన గాంధీ జీవిత చరిత్రలు కావ్యాలుగా వ్రాయబడ్డట్లు కాక యిది సమగ్రమైన రచనగా కన్పించక మానదు.

ఈ కావ్యంలో ఉన్న ముఖ్యమైన గుణం హాయిగా నవలలా, గద్యంలో వున్న జీవిత చరిత్రలా ప్రతి ఒక్కరూ తేలికగా చదువుకోవడానికి వీలైన శైలిలో వుండడం. ఈ కావ్యంలోని సుగమత్వానికి

కారణం "నేటి గద్య యుగమునకు ప్రియంబుగా గద్యము వలె పద్యమును హృద్యముగా నడిపించుటకు, యతిప్రాసాదిక ఛందో నిబంధనలందును, సంధులు, శకటరేఫానుస్వారాదిక వ్యాకరణపు ముడులందును కొంత మడి సడలింప" బడడమే! రచయితే కావ్య ప్రస్తావనలో

"అర్థ సౌలభ్య లయలె మదాశయమ్ము
లగుట - గ్రాంథికమో వ్యవహారభాషొ
ఆశ్రయింతును ప్రీతిగా నందరికిని
నాదు గాంధేయ కావ్యాబ్ధి నీదుటకును."[29]

అన్నారు. ఈ "గద్యయుగా" నికి అనువుగా వుండేటట్లు, యీ కాలం లోని భిన్న రీతుల మధ్య వున్న సంఘర్షణను వ్యక్తం చేస్తూ

"కొందరు గ్రాంధిక భాషకు
కొందరు వ్యవహారభాషకు న్మొడివడుటన్
కొందల మందెడి తెలుగున
నందరి కందమగు చంద మవలంబింతున్"[30]

అన్న సమన్వయ పద్ధతిని - స్వీకరించారు రచయిత. ఈ సుగమత్వం సాధించడానికే చాలా పదాలను ఆంగ్లంనుంచి యథాతథంగా స్వీక రించారు రచయిత "నాన్‌వయలెన్స్" వంటి పదాలకు తెలుగు సమా నార్థకాలు రూఢమై ప్రజలలో ప్రచారానికి వచ్చిన తరువాత కూడా ఆ పదాలు వాడవలసిన ఆవశ్యకత కనిపించదు.

ఈ గ్రంథానికి "సుప్రసిద్ధ దేశభక్తులును, ఆంధ్రమందు మహాత్మగాంధి చరిత్ర మొదట రచించిన వారును" అయిన శ్రీ ఆత్మ కూరె గోవిందాచార్యులవారు చక్కని పీఠికను కూర్చడం ఎంతైనా సమంజసంగా వుంది. రచయిత, పీఠికా రచయిత - యిద్దరూ రామ భక్తులు. శ్రీరామునికి అంకితంగా వ్రాయబడ్డది యీ కావ్యం.

గాంధీజీని కూడా తన వలెనే రామభక్తుణ్ణిగా భావించి "నీ నామభజన సతతము జేసిన మహాత్ముని" గురించిన యీ కథ "నవ్య దివ్య భావ భరిత భవద్భక్త పవిత్ర చరిత" అంటాడు రచయిత. ఈ భక్తి ప్రపత్తులు యీ కావ్యంలో ఆసాంతమూ కన్పిస్తాయి. పీఠికా రచయిత అన్నట్లు "తేటమాటలతో...... ప్రతి పద్యము మధురముగ నున్నది. ఆర్ద్ర హృదయమున, భక్తిప్రపత్తులతో రచింపబడిన"[31] కావ్యం యిది.

## సౌందర నందము

గాంధీజీ సిద్ధాంతాలను ప్రాతిపదికగా చేసుకొని వాసికి కావ్య రూపాన్నిచ్చిన గ్రంథాలన్నీ గాంధీజీ వల్ల పరోక్షంగా ప్రభావిత మైనవే! గాంధీజీ సిద్ధాంతాలలో విశ్వమానవత్వాన్ని విస్పష్టంగా వ్యక్తం చేసే మహత్తరమైన లక్షణం అహింసా సిద్ధాంతానికి ఉంది. ఈ సిద్ధాంతం కొత్తది కాదు. యుద్ధోన్మాదంలో సర్వజనులు పరస్పరం నిహతుల్ని చేసుకోవడం చూచిన ప్రతి ఆర్ద్రహృదయుని మనోభావ స్పందనమే అహింసాభావం. జీవకారుణ్యానికి అనాదికాలంనుంచీ భారతదేశం పుట్టినిల్లు. అహింసా సిద్ధాంతానికి బుద్ధుడు ఆద్యతన ప్రవర్తకుడు. ఆ బుద్ధుని అహింసా సిద్ధాంతాన్ని, ఆ సిద్ధాంతంవల్ల ప్రభావితమైన అసంఖ్యాకమైన ప్రజల జీవితాల్లోని కారుణ్యామయ గాథల్ని, ఆ కారుణ్యామయ జీవుల జీవితాలను తన దయావీక్షణాలతో సుఖమయం చేసిన అహింసామూర్తి గాథల్ని ఏ కవీ త్రోసిపుచ్చలేడు. విశ్వజనీనమైన యీ కారుణ్య దృష్టి తెలుగు కవులను కూడా ప్రభావితం చేసింది.

తెలుగు కావ్య ప్రపంచంలో యీ అహింసా సిద్ధాంతం రూపు కట్టుకొన్నది తిరుపతి వేంకటకవుల "*బుద్ధచరిత్రము*" లో. దీనిపై గాంధీజీ ప్రభావం లేకున్నా, తరువాతి తరాలలో అహింసా సిద్ధాంతాన్ని గూర్చి గాని, ఈ శతాబ్దంలో దానికి ప్రతీకగా నిలిచిన

గాంధీజీని గురించి గాని వ్రాసిన కవులందరు "*బుద్ధచరిత్రము*" వల్ల కూడా ప్రభావితమైనవారే! ఈ కావ్యం తరువాత చెప్పుకోవలసిన ఉత్తమ గ్రంథం పింగళి - కాటూరి కవుల "*సౌందరనందము*". "విశ్వసందేశమును సాహిత్యమున వెలయించు పట్టున కవిత్వ మీశ్వరాంశము. ఇట్టి వైశిష్ట్యమును ఆంధ్రకావ్యప్రపంచమున తొలకరించినది "*సౌందరనందము*!"[32]

సంస్కృతంలో అశ్వఘోషుడు వ్రాసిన "*సౌందరనందా*" నికి యీ కావ్యానికి ఏమీ సంబంధం లేదు. "ఇతివృత్తములో నీషత్తు ఐోలిక కలదు గాని ఇంక నెందును సాదృశ్యము లేదు... గ్రంథనామ మింపుగా నుండుటచే నదియే కైకొంటిమి" అన్నారు రచయితలు.

ఈ కావ్యం సుందరీనందుల ప్రేమను అభివర్ణిస్తుంది. కాని ఇది కేవలం ప్రేయసీప్రియుల ప్రేమకాదు వీరి ప్రణయంలో విశ్వమానవ ప్రేమ ద్యోతకమవుతుంది. బుద్ధుడు బోధించిన విశ్వకారుణ్యాం, గాంధీజీ బోధించిన విశ్వమానవ సౌభ్రాతృత్వం - ఈ రెండూ పరస్పరం సంబంధం కలవి. నందుడు బుద్ధుని తమ్ముడు. భార్యాలోలుడై బాహ్యప్రపంచాన్ని మరచిన నందునికి బౌద్ధులు బలవంతంగా సన్యాసాన్నిచ్చి అతని మనస్సును మారుస్తారు. లోకపూజ్యుడైన వాని సోదరుడవు కావడంవల్ల ధర్మాన్ని ఆచరించడంలో కూడా నీవు నీ వంతును పంచుకోవాలి— "పంతము దారి పోవక శివమ్మగు ధర్మపథమ్ము త్రొక్కుమా" అన్న బోధను వినిపించి "సరగున", "క్షణమాత్రములోననే" ఆతనిని భిక్షువుగా మారుస్తారు - ఇతర భిక్షుకులు.

అతడు భిక్షువైన తరువాత బుద్ధుడు నందునికి బోధించిన బోధల సారమంతా యీ విధంగా చెప్పవచ్చు :

కొడుకులు లేనివారలకు గూరిమి బిడ్డవు; మాతృహీనులౌ
బుడతలకెల్ల దల్లివయి పోషణసేయుము; 'నా' అనంగలే
కడలెడు దీనులన్ మనుపు, మార్తుల కాదరువై భజింపు మీ
పుడమి దివమ్ము సల్పుమిదె, పో, పరమార్థము బౌద్ధజాతికిన్.[33]

ఈ పద్యంలో చూపబడ్డ జీవకారుణ్యాం బౌద్ధధర్మ లక్షణం. కాని ఈ బౌద్ధధర్మం ఆధునిక కాలంలో గాంధీగారి అహింసా సిద్ధాంతం ద్వారానే తిరిగి ప్రాణం పోసుకొన్నది; దేశంలో గౌరవాన్ని ఆపాదించుకొన్నది.[34]

ఈ కావ్యంలో 8 సర్గలున్నాయి "పునరాగమనము, భిక్షా గమనము, సరివ్రాజము, నిరీక్షణము, ఉపదేశము, ధర్మసంవాదము, అనుజ్ఞ, సహధర్మచర్యము" అన్న యీ సర్గల్లో నడిచిన నందుని జీవిత పరిణామాన్ని గమనిస్తే యిదే పరిణామం గాంధీజీ జీవితంలో కూడా వచ్చినట్లు మనం గ్రహించవచ్చు. ఐహికమైన ప్రాపంచిక సుఖాలనుంచి బౌద్ధధర్మం వైపుకు తీసుకొనిపోబడినవాడు నందుడు; తన స్వయంకృషితో, ఆత్మ సంయమనంతో యీ ఇచ్ఛలను దూరం చేసుకొని, విశ్వమానవ కల్యాణం కోసం బుద్ధుడైనవాడు గాంధీజీ.

*సౌందరనంద* కావ్యం ప్రప్రథమంగా 1932 లో ప్రచురింప బడ్డది. అప్పటికే గాంధీజీ ప్రారంభించిన అసహాయోద్యమం పల్లెపల్లెల్లోను వేళ్లు నాటుకొన్నది. గాంధీజీ తన అనుయాయుల్ని "శాంతి యోధులు" అన్నాడు. అలాగే బౌద్ధభిక్షువులు కూడా

మమతలంద్రెంచి, కాముని మాయ గెలిచి
రాజ్యలోభంబు ద్రోచి, క్రూరత నణంచి
శాంతులై చేరి నిల్చి రంజలి ఘటించి
ధర్మదేవత పాదపద్మముల చెంత.[35]

ధర్మం కోసం అహింసా యుద్ధాన్ని చేసే శాంతి యోధులు ఆ భిక్షుకులు కూడా.

ఈ కావ్యంలో బుద్ధుడు దీనుల కరుణావస్థను తమ్మునికి వివరించి చెప్పిన ఘట్టాలకు, గాంధీజీ తన "యంగ్ ఇండియా" లో వ్రాసిన వ్యాసాలలో వెలిబుచ్చిన భావాలకు ఎంతో దగ్గరి సంబంధం ఉన్నది. అందువల్లనే పింగళి - కాటూరి కవులు చెప్పిన "*సౌందరనంద*" కథకు బాపూజీ కథకు గల సామ్యాన్ని వివరిస్తూ తుమ్మల సీతారామమూర్తిగారు యిలా అన్నారు :

మరచిన బుద్ధగౌతముని మాటలు బాటలు కంటిముందటన్
జరిగిన బాపుజీ బ్రతుకు చందము లందము లొక్కతావునన్
మెఱయునటుల్ మహామతులు మేలొనరించిన సృష్టిలో వినూ
త్నరుచి నిధానమై యొక సనాతన ధర్మము గోచరంబగున్.[36]

రాణాప్రతాపసింహ చరిత్రము

ఈ కోవకు చెందినదే దుర్భాక రాజశేఖర శతావధానిగారి "రాణాప్రతాపసింహ చరిత్ర". ఈయన స్వయంగా దేశభక్తుడు. 1921 లో గాంధీగారి పిలుపు నందుకుని ఉద్యోగానికి రాజీనామా ఇచ్చిన త్యాగి. ఈయన "***రాణాప్రతాపసింహ చరిత్రము***" వీర రస ప్రబంధం (1932). ఇది "టాడ్" వ్రాసిన "***రాజస్థాన కథావళి***" ఆధారంగా వ్రాయబడ్డది. ఈ కావ్యము ఆధునిక కాలంలో వెలువడ్డ ప్రథమాంధ్రేతిహాస ప్రబంధం. ఉత్తమ చారిత్రక కావ్యం. ఈ కావ్యంలో "వీరజనతాపూర్వాభిగణ్యుండు" అయిన రాణాప్రతాపుని జీవితంలోని కష్టగాథలు, అతని స్వాతంత్ర్య పిపాస, తత్సాధనలో ఆయన పడ్డ కష్టాలు వివరంగా వర్ణించబడ్డాయి.

రాణాప్రతాపుని చరిత్రకు గాంధీజీ చరిత్రకు చాలా దగ్గిర సంబంధం ఉన్నది. విశ్వనాథవారి మాటల్లో చెప్పాలంటే "రాణాప్రతా

పునకును మహాత్మునకుగల సామ్యము భారతజాతికిగల యస్వతంత్రత మహాత్మునిది కత్తిలేని సాత్త్వికపు పోరు. ప్రతాపునిది కత్తిగల సాత్త్వికపు పోరు.......... .."

ప్రతాపుడు - "భారత జాతీయ ధర్మము పరులకు లొంగిపోదు - చచ్చిపోదు" - అని ఋజువు చేయుటకే యుద్ధము చేసెను : కాన విజయంబు ముఖ్యంబు కాదు మనకు · ధర్మనిర్వహణ మిపుడు కర్తవ్య మిపుడు."

"నేటి సత్యాగ్రహమునకును ఆ నాటి ప్రతాపుని యుద్ధ ధర్మమునకును భేదమే లేదు.......... ఈ కథకు మన కథకు వేయి పోలికలు "[37]

ఐదు ఆశ్వాసాలు గల బృహత్ ప్రబంధం "**రాణాప్రతాపసింహ చరిత్రము**" "చరిత్రాత్మకములై దేశభక్తి నుద్దీపింపజేయు పద్యకావ్యములు లేనేలేని"[38] కాలంలో (శ్రీ) రాజశేఖర శతావధానిగారి కావ్యం "దేశభక్తులకు శిరోభూషణము"[39] వలె వెలువడ్డది

సుదీర్ఘమైన పద్యకావ్యాలు వ్రాయటం మోటుగా భావింపబడే రోజుల్లో ఇంత విస్తరమైన గ్రంథాన్ని వ్రాయటానికి ఎంతో భావపుష్టి, సృజనాత్మక సౌష్టవం, మహాకావ్యనిర్మాణ చాతుర్యం కవికి ఉండితీరాలి. అవి అన్నీ ఈ కావ్యంలో ప్రతి పద్యంలోనూ మనకు ద్యోతకమవుతాయి.

"అలరుదేనెల మరపించు పలుకుబొందు
పలుకు బొందున కుచితమౌ భావపుష్టి
భావపుష్టికి దగు రస వైభవంబు"[40]

కూర్చినవాడే కవికుంజరుడని రాజశేఖరశతావధానిగారి అభిప్రాయం. ఈ కూర్పు వారి రచనలో కనిపించినంత స్పష్టుగా ఆధునిక కాలంలోని మరి ఎవ్వరి రచనలలోను మనకు కనిపించదు.

ఈ కావ్యవస్తువుకు గాంధీజీ బోధించిన స్వాతంత్ర్యతా భావానికి ఎన్నో దగ్గరి పోలికలు ఉన్నాయి. అష్టకష్టాలకు ఓర్చి అక్బరుతో ధర్మయుద్ధం చేసి, కొండలలో నివసించి గడ్డి రొట్టెలు తిని తన దీక్షను సాధించుకున్న స్వాతంత్ర్య పిపాసి రాణాప్రతాపుడు. ఉపవాసాలు చేసి అధికార మదంతో భారతీయుల జన్మహక్కైన దేశ స్వాతంత్ర్యాన్ని వారికి ఇవ్వము అని పట్టుబట్టి కూర్చున్న ఆంగ్లేయులతో అసహాయోద్యమం అనే ధర్మయుద్ధాన్ని సాగించిన యోధుడు మహాత్ముడు. అందువల్లనే ప్రతాపుడు గెలిచినపుడు "భామాసాహీ" అతణ్ణి ఆశీర్వదిస్తూ .

అమితోత్సాహము దేశభక్తిరతి
నీదై యుండు, నీ మేని ర
క్తమునందున్ గల బిందు వొ
క్కొకడు స్వాతంత్ర్యంబు స్వాతంత్ర్యమం
చు మహాదీక్షను బల్కు................"

అని ఆశ్వాసించాడు. అంతేకాదు కవి - తాను చెప్పతలచుకొన్న మాటలు "భామాసాహీ" ద్వారా ఈ విధంగా చెప్పిస్తాడు :

"భూజనులు విప్లవంబుల బృంగునపుడు
..............................
నిన్ను బోలు మాధవుడు జన్మించుగాత !"41

అని చెప్పడంలో "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" అన్న గీతా శ్లోకం ధ్వనింప చేయబడ్డది.

ఇది కేవలం కావ్యానంద అనుభవానికే ఉద్దేశించి వ్రాయబడ్డ కావ్యం కాదు. దీని వెనుక ఒక మహత్తరమైన సందేశముంది. ఈ కావ్యాన్ని చదివి ఆంధ్రులు

"........................................ స్వాతంత్ర్యమున్ ద్యాగ వి
స్ఫురణంబున్ సముదార విక్రమ కళాపూర్ణత్వమున్ సేర్వగ
ల్గిరయేనిన్ ననుబోలు ధన్యు లిలలో లేరంచు హర్షించెదన్."[42]

అని కోరుకున్న కవి హృదయంలో దేశభక్తి దేశాభిమానము ఎంతగా పాదుకొని ఉన్నాయో వేరుగా చెప్పనక్కరలేదు.

ఈ కావ్యంలో వీరరసం ప్రధానమైనా ఈ కావ్యకథ భారత చరిత్రలో స్వాతంత్ర్యం కోసం తన సర్వస్వాన్ని త్యాగం చేసిన మహానుభావుని కథె అయినా, ఈ కావ్యానికి ఇంత వ్యాపకత, ఇంతటి దేశవ్యాప్తమైన ఆదరణ లభించాయంటే దానికి కారణం ఈ కవికి తాను చెప్పుకున్న కథ ఎడ, ఆ కథ చెప్పే నీతి ఎడ ఉన్న అచంచల మైన విశ్వాసం. దీనినే "తన్మయత్వము" అన్నారు చెళ్లపిళ్లవారు.

## అమరసింహ చరిత్ర

రాజశేఖర శతావధానిగారి మరో కావ్యం "*అమరసింహ చరిత్ర*". ఈ గ్రంథ కావ్యావతారికను పరిశీలిస్తే కవికి ఆంధ్రదేశం మెచ్చియిచ్చిన బిరుదావళి అంతా ఆయన వీరరస కావ్యాభినివేశాన్ని పొగుడుతున్నట్లు కనిపిస్తుంది. నిజానికి వీరి మొదటి కావ్యం వలెనే యీ కావ్యం కూడా వీరరస ప్రధానమే.

విషయలోలుడై, ధర్మచ్యుతుడౌతున్న రాజు హితుల బోధలు విని, పశ్చాత్తప్తుడై తిరిగి ప్రజలు తన పైన ఉంచిన కార్యభారాన్ని వహించడం యిందులోని నాయకుడైన అమరసింహుని జీవితంలో జరిగిన ముఖ్య సంఘటన. ఈ కథ వంటివే మనకు బాలచంద్రుడు, ఖడ్గతిక్కన వంటి కథల్లో కన్పిస్తాయి. స్వాతంత్ర్యసమరం ముమ్మరంగా జరిగే రోజుల్లో ఆంగ్లేయుల పక్షాన ఉండి దేశక్షేమాన్ని విస్మరించిన స్వార్థపరులను, తటస్థంగా వూరుకొన్నవారిని విమర్శించడానికే యీ మాటలు కవి ఉద్దేశించినట్లు స్పష్టమవుతున్నది.

మేవాడ రాణా అమరసింహునితో జహంగీరు యుద్ధానికి తలపడతాడు. రసపుత్ర యోధుల అండదండలతో యుద్ధానికి బయలు దేరుతాడు రాణా. తన సైన్యాన్ని ఉద్బోధిస్తూ రాణా చెప్పిన మాటలు 'క్విట్ ఇండియా' ఉద్యమంలో సర్వనాయకులు ప్రజలను ఉద్బోధిస్తూ చెప్పిన మాటలను తలపుకు తెస్తాయి .

"ఈ దేశ మీ కొండ లీ సూర్యుడీ తరు
లీ వాయు వీ యెండ యన్నిమావి".[43]

రాణా నాయకత్వానికి ముగ్ధులై సైనికులందరూ "శిరమ్ముట్టికోసి నీ చరణములందు నుంతు మిది సత్యము! నీ చరణంబు సాక్షిగన్" అని శపథం చేశారు. అట్టి స్వార్థత్యాగమూ, ప్రతిజ్ఞా పరిపాలనమూ సత్యాగ్రహ సమరంలో మన కళ్ల ఎదుట కన్పించాయి.

ఇలా తమ రెండు కావ్యాలలోను ప్రచ్ఛన్నంగా జాతీయ భావాన్ని, స్వాతంత్ర్య భావాన్ని బోధించి "వీరగాథావిధాత" గా తెలుగు సాహిత్యారామంలో సమున్నత పీఠంపై అధివసించిన శ్రీ రాజశేఖర శతావధానిగారు ఆంధ్రుల కృతజ్ఞతలకు పాత్రులు. "ఆధునికులలో ఈ రాజశేఖర కవి తన్మయత్వం కల కవి అని రచన వ్యాఖ్యానిస్తూ ఉంది"[44] అని చెళ్లపిళ్లవారు యీ కావ్యాన్ని గురించి, యీ కవిని గురించి చెప్పడంలోని ఆంతర్యం - ఈ కవి తాను చెప్పదలుచుకొన్నదానిని ఎంతో అభినివేశంతో తన కథలో లీనమై చెప్పగలడన్న భావాన్ని వ్యక్తం చేయడమే.

ఈ విధంగా దేశంలోని సమకాలీన స్థితికి తాదాత్మ్యం కల చారిత్రక గాథలను స్వీకరించి వీరరస ప్రధానంగా కావ్యాలను సృష్టించిన వారు శ్రీ రాజశేఖర శతావధాని. మొదటి గ్రంథాన్ని గూర్చి విశ్వనాథవారన్న మాటలు ఈ రెండు గ్రంథాలకూ అన్వయిస్తూ, వాని వైశిష్ట్యాన్ని చాటి చెబుతాయి : "ఈ గ్రంథము

అస్వతంత్ర జాతి కొరక స్మృతిగ్రంథము వంటిది"[45] అన్నారు విశ్వ నాథ. కవి దేశపరిస్థితులను గ్రహించి ప్రజలను తన కవిత ద్వారా ఉత్తేజితులను చేయడం ఇట్టి కావ్యాలవల్లనే సాధ్యమైంది.

## శివభారతము

భారతీయ ఆర్ష ధర్మ పునరుద్ధరణకు, స్వాతంత్ర్య సముపార్జనకు, కంకణం కట్టుకున్న వారిలో రాజపుత్రుల తర్వాత మహారాష్ట్రులు పేర్కొనదగినవారు. మహారాష్ట్రుల శౌర్యమునకు, స్వాతంత్ర్యేచ్ఛకు శివాజీ ప్రతీక ఆ శివాజీ కథను '*శివభారతము*' అన్న పేర మహా కావ్యంగా వెలయించినవారు శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రి. గాంధీజీ నాయకత్వాన సాగించిన ధర్మ సమరంలో కొందరు యోధులు రంగంలో దూకి తమ సర్వస్వాన్ని త్యాగం చేసినట్లుగానే, కొందరు కవులు తమ కవితాత్మను ఆ స్వాతంత్ర్య బీజాలను దేశం నలుమూలలా వెదజల్లడానికి ప్రయుక్తం చేశారు. అట్టివారిలో దుమ్మల, రాజశేఖర శతావధానిగార్ల స్థాయిలో నిలువదగినవాడు శ్రీ శేషశాస్త్రి. *శివభారత* రచనలో గాంధీజీ ప్రభావం చాలాఉందికి వెంటనే స్ఫురించకపోవచ్చు. కాగా ఆ రెంటికి మధ్య అంతరమే ఎక్కువగా కన్పించవచ్చు. కాని *శివభారత* రచనాకాలాన్ని జాగ్రత్తగా గమనిస్తే అది ఒకప్రక్క స్వాతంత్ర్య సాధన కోసం కవి పరోక్షంగా చూపిన ఆకాంక్షగాను, మరొక విధంగా శివాజీని ఆదర్శంగా చూపి సమ కాలీన ఉద్యమ నాయకులైన గాంధీజీవంటివారి త్యాగశీలమూ, స్వాతంత్ర్యపిపాసా చూపాలన్న ఆకాంక్షగా కూడా స్ఫురించక మానదు. 1942-46 మధ్య కాలం మన జాతి చరిత్రలో ఒక ముఖ్య మైన ఘట్టం. 'క్విట్ ఇండియా' ఉద్యమం తీవ్రంగా ఉన్న రోజులవి. అట్టి కాలంలో పరాయి పాలనకు స్వస్తి చెప్పడానికి ప్రయత్నం

చేసిన మహారాష్ట్ర వీరుడు శివాజీ కథ ఆనాటి చదువరులకు స్వాతంత్ర్యేచ్ఛను కలిగించి, వారిని ఉద్రూతలూగించిందంటే ఆశ్చర్యం లేదు.

ఈ కావ్యాన్ని వ్రాయడానికి గల కారణాలను, ప్రోత్సాహాన్ని పేర్కొంటూ తన మిత్రుడు యీ కథను కావ్యంగా వ్రాయవలసిన అవసరాన్ని వివరించి, శివాజీని

"ధీరాగ్రేసరమూర్తి, హైందవధరిత్రీభాగ్యసత్స్థాపన
ప్రారంభుండు, దయాగుణాంబుధి
భవ్యభరతోర్వీధర్మరక్షార్పిత
శ్రీరమ్యుండు ."[46]

అని చెప్పాడట. అంతేకాదు——

"ఆతని చరితము హైందవ
జాతి పరాయణము, భావి జగదభ్యుదయ
స్ఫీతము, ధర్మోపేతము
నీతిపథము, నిగమసూక్తి నిభమై వెలయున్ "[47]

"పరాపహృతమైన భారత భూధేనువును త్రిప్పి శివాజీ అర్జునుడై నాటి భారతోదంతము నవిచ్ఛిన్నముగ సాగించినాడు"[48] అన్న మాటలు సమకాలిక భారతీయ చరిత్రను గూర్చి చెప్పాలంటే గాంధీజీకి అన్వయించక తప్పదు.

మరొక విషయంలో కూడ ***శివభారతా***నికి గాంధీజీ జీవితానికి పోలికలు కన్పిస్తాయి. గాంధీజీ జీవిత కావ్యానికి వలెనే శివభారతానికి కూడా "**శాంతము**" **స్థాయి**. "మహాగంభీరజలధి" ఎంత ప్రశాంత స్వరూపం కలిగివుంటుందో, యీ నాయకుల యిద్దరి ప్రవృత్తులూ అంతే. "కాని జలధి అంతర్భాగంలోని సంక్షోభము అనిర్వాచ్యము. ఈ ధ్యాన శివస్వరూపము శాంతమును, నిర్మలము, ప్రసాదగుణభూయి

ష్టము."[49] ఈ విషయాలన్నీ గాంధీజీ జీవితానికి కూడా తు. చ. తప్పకుండా వర్తిస్తాయి. స్వాతంత్ర్య సమర మహాయజ్ఞంలో తాము కూడా ఒక సమిధ అయిపోవాలన్న ఆకాంక్ష గలవారికి తల్లిబిడ్డలు, వేదవేదాంగాల చదువులు పట్టవు. ఆనాడు శివాజీ అనుయాయులకు అవి పట్టలేదు. ఈనాడు గాంధీజీ అనుయాయులకూ అవి పట్టలేదు. అందువల్లనే శివాజీ వంటి కేవలం కర్మవీరునికి తాటాకు గ్రంథాల కన్న తుపాకి గుండ్లే అతిముఖ్యం. అందువల్లనే

కలతంజెందెడు నాత్మ దేశమలమున్ గాపాడ శస్త్రాస్త్ర వి
ద్యలు జాణక్య తపంబులున్ చదువు"[50]

నట్టి విద్వాంసులు వేదవేదాంగాలు మెచ్చుతారా? - అంటాడు కవి. అన్ని దేశాల స్వాతంత్ర్య యుద్ధాలలోను తమ కవిత్వానికి స్వస్తిచెప్పి కత్తుల్ని పట్టిన కవులు ఎందరు లేరు?

కవి యీ కావ్యానికి భరతవాక్యంగా ఉద్దేశించి వ్రాసిన ఒక పద్యంలో ఇలా కోరుకుంటాడు:

"దేశపుత్త్రుల కీర్తి వర్ధిల్లుగాక
దేశచరితలు రక్తి సంధించుగాత"[51]

దేశభక్తిని బోధించే ఏ కావ్యమైనా "*శివభారతం*" వలె కలకాలము రక్తినందించగలదు.

**శాంతి విజయము**

ఇటీవల వచ్చిన కావ్యాలలో మరికొన్ని గాంధీజీ జీవితం వల్లను, ఆయన బోధనల వల్లను ప్రభావితాలయ్యాయి. అందులో ముఖ్యమైనది శ్రీమతి నండూరి చంద్రమతీదేవి వ్రాసిన "**శాంతి విజయము**" (1957). ఈ కావ్యానికి భారత దేశంలో తరతరాలుగా వస్తున్న "కారుణ్య తత్వము" ఆలంబనంగా స్వీకరించబడ్డది. "చిన్న

నాటి నుండియు అహింసా సిద్ధులయిన మహాత్ముల చరిత్రములు నా హృదయమున నేదో యొక స్పందనము కల్గించుచుండెడివి...... పరస్పర విద్వేషములతో మానవులొనర్చు మారణ హోమములకు మంట లెగయు హృదయమున నేదో యొక కరుణామూర్తి చల్లని హస్తము అమృతము కురియించు చున్నట్లు గాఢతమోమయమై రుధిరార్ణవమున మునిగిపోవుచున్న భూవలయము నేదో యొక జ్యోతిర్మూర్తి స్వహస్తమున సముద్ధరిస్తున్నట్లు ఒక విచిత్రానుభూతి కల్గుచుండెడిది".[52] ఈ అనుభూతే యీమెను యీ కావ్యరచనకు పురికొల్పింది. హింసావాదముకన్న కారుణ్యవాదమే భారతీయ సంస్కృతికి చక్కని ప్రతిబింబమని ఈ కావ్యం రుజువుచేస్తున్నది.

ఈ అహింసా సిద్ధాంత నిరూపణకు సిద్ధాంతగ్రంథం బాపూజీ ఆత్మకథ. దానికి ప్రయోగ దీపిక "*శాంతి విజయము*". జాతి అహింసాత్మక మైనప్పుడు ప్రజలు నైతికంగా ఎంతటి ఉన్నత స్థితిలో ఉంటారో చూపారు రచయిత్రి. ఇందులో ఎక్కడా మనకు గాంధీజీ పేరు కానరాదు. కాని ఆ అహింసామూర్తి నిత్యమూ యీ కథకు వెనుక లీలగా మనకు గోచరిస్తూనే వుంటాడు. నిజానికి ఈ నాటి పరిస్థితులను బట్టి చూస్తే ఈ కావ్యంలోని కథ కేవలం ఊహాలోకంలో మాత్రమే జరుగగలదని కొందరు ఆక్షేపించవచ్చు. కాని ఆదర్శాత్మకమైన అహింసారాజ్యం వస్తే అది కేవలం "శాంతి విజయము" వల్లనేనని కవయిత్రి యిందులో స్పష్టంగా చూపారు. స్వాతంత్ర్యానంతరం, గాంధిజీ మరణానంతరం ఆయన సిద్ధాంతాలను ఆధారంగా చేసుకొని వచ్చిన అనేకములైన కావ్యాలలో "*శాంతి విజయము*" నిశ్చయంగా ఉత్కృష్టమైన రచన. ప్రథమ శ్రేణిలో ఉంచదగిన రచన— కథా వైశిష్ట్యం దృష్ట్యా చూచినా, కావ్యశిల్పం దృష్ట్యా చూచినా కూడా.

## భారత స్వాతంత్ర్య సంగ్రామము

ఇటీవల వెలువడిన కావ్యాలలో వీరరస ప్రధానమైన మరో ఉత్తమ కావ్యం శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి వ్రాసిన "**భారత స్వాతంత్ర్య సంగ్రామము**". ఇది 1857 లో జరిగిన విప్లవానికి కథా కావ్యరూపం. ఆనాటి కథను, ఆ విప్లవంలో పాల్గొన్న వ్యక్తులను పేర్కొనడమే కాక రచయిత ఈ కావ్యంలో తరువాతి తరాల్లో నాయకత్వం చేపట్టవలసిన గాంధీజీని కూడా పరోక్షంగా పేర్కొన్నారు. కవిగారే పీఠికలో చెప్పినట్లు - కొన్ని పద్యాలలో గాంధీజీ విస్పష్టంగా సూచింపబడతాడు. ప్రథమ రంగంలోని

"తరుణమ్మిదియది వాలునైన అది చేతంజార నే నూర్వ
త్సరముల్ కావలెనో సుమారు మన స్వాతంత్ర్యమ్ముకై, ఏ మహా
పురుషుం డుద్భవమొంది రావలెనొ ఈ భూమాత చే సంకెలన్
విరుగంగొట్టగ కూడకట్టుకొని ఈ విశ్వ ప్రజానీకమున్".[53]

అన్న పద్యంలో గాంధీజీ రాకను సూచ్యార్థ సూచన ద్వారా కవి తెలియచెప్పారు. అలాగే పంచమ రంగంలో శబ్దం ద్వారా గాంధీజీ రాకను సూచించారు రచయిత.[54] గాంధీగారి సహాయనిరాకరణోద్యమం అదివరకే అయోధ్యా రాజ్యంలో ఏర్పడ్డదని[55], విదేశవస్తు బహిష్కారం ఆ విప్లవంలో పాల్గొన్న శూరుల మధ్య చర్చింపబడ్డదని కవిగారు ఈ కావ్యంలో సూచించారు.[56] అంతేకాదు. గాంధీగారి ఉప్పు సత్యాగ్రహం కూడా అంతకు చాల పూర్వమే జోధ్‌పూర్‌లో మరొక విధంగా ప్రారంభింప బడ్డదని కూడా రచయిత సూచించారు. ఈ సూచనలు కావ్యప్రయోజనానికి అంత ఉపయోగకారి కాకపోయినా, దాని వలన రచయితకు గాంధీజీ యెడగల అభినివేశం మాత్రం వ్యక్తం అవుతున్నది. ఈ సూచన లేమైనా, ఈ కావ్యంలో వీరరసాత్మకములైన విప్లవము, యుద్ధములతో పాటు - సర్వజనా

మోదయోగ్యమైన అహింసాస్త్రాన్ని సంధించే మహారథు డెవడో కొన్నాళ్ల తర్వాత ఈ దేశంలో జన్మించి భారతమాత చేతి సంకెళ్లను తెగగొట్టగలడన్న ఆశంస ఈ కావ్యం ఆసాంతము మనకు ద్యోతక మవుతుంది విప్లవము, హింస, యుద్ధము పరివర్తనకు, స్వేచ్ఛా ప్రియత్వానికి ప్రథమ దశ అని, అహింస, శాంతికాముకత్వము దానికి అంతిమ దశ అని కవి చేసిన సూచన ఉత్తమమైనది.

### కళాక్షేత్రము

ఈ "*కళాక్షేత్రము*" అన్న కావ్యం ఇటీవలనే (1968) వెలువడ్డది. దీని రచయిత విద్వత్కవి శ్రీ బోడేపూడి వేంకటరావుగారు. "*కళాక్షేత్రము*" అన్నది నాగార్జునకొండకు సంకేత రూపము. బౌద్ధధర్మ ప్రభావం అధికంగా కన్పించే కావ్యం ఇది.

ఈ కావ్యానికి 'భూమిక' వ్రాస్తూ డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు యీ కావ్యంలో చూపబడిన బౌద్ధధర్మానికి, సమకాలీన కాలంలోని మహాత్ముని ధర్మానికి గల తాదాత్మ్యాన్ని సూచించారు:[57]

"ఆధునికాంధ్ర వాఙ్మయమున గాంధిమహాత్ముని గుణగణములచేతను, ఆదర్శముల చేతను ప్రభావితులై తజ్జీవితచరిత్ర వస్తుకములైన కావ్యములు రచించిన కవులు కొందరున్నారు. ఆదర్శ సాదృశముచే కొందరి దృష్టి మహాత్మునినుంచి బుద్ధభగవానునిపై ప్రసరించి వారిని బౌద్ధమత సిద్ధాంత ప్రబోధకములైన కావ్యములు రచింపబురికొల్పినది. అట్టివానిలో "*సౌందరనందము*" మొదలైనవి ముఖ్యమైనవి. కవితా కౌశలము, భావప్రౌఢిమ, ఉపదేశ సామర్థ్యము,

శైలీప్రసన్నత మున్నగు గుణములను బట్టి చూచినచో నిది సర్వవిధ ముల వానితో సాటి యని చెప్పదగి యున్నది."

ఈ కావ్యము ప్రశంసాఖండము, అవతార ఖండము, చంద్ర ఖండము అన్న మూడు ఖండాలుగా విభజించబడ్డది. ఇందులోని అవతార ఖండానికి గాంధీజీ జీవితానికి సంబంధం కన్పిస్తుంది.[58]

# 3

# తెలుగులో గాంధీ శతకాలు

మల్లికార్జున పండితుడు ఏ శుభముహూర్తాన తెలుగులో శతకరచనకు శ్రీకారం చుట్టాడోకాని వెయ్యి యేళ్లు గడిచినా అది నిరంతర వాహినిగా, వేనవేలు పాయలై ప్రవహిస్తూనే వుంది. తెలుగువారు దీనిని సంస్కృతంనుంచే గ్రహించినా, తెలుగుతనం నింపి స్వంతం చేసుకున్నారు. ఆత్మపరమైన చిత్తవృత్తిని చిత్రించడానికి శతకాన్ని మించిన సాహిత్యప్రక్రియ లేదు. ఇందులో ఒదగని అనుభూతి లేదు. శతకరచనల్లో దాదాపు అన్నీ భక్తి సాహిత్యం క్రిందికి వచ్చేవే. అందువల్లనే గాంధీజీ పై తెలుగు కవులు భక్తిప్రపత్తులు చూపించ దలుచుకొన్నప్పుడు శతకాన్ని మించిన ప్రక్రియ లేక పోయింది. తెలుగులో గాంధీజీ పై దాదాపు వంద శతకాలు వున్నాయంటే దానికి కారణం గాంధీజీని దేవుణ్ణిగా కొలుచుకొన్న తెలుగు కవుల భక్తి, ఆరాధనలే!

1921 లో గాంధీజీ రాజకీయ రంగం మీద ప్రవేశించినప్పటి నుంచీ ఆయనపై వ్రాయబడ్డ కవితలలో ఆత్మాశ్రయ కవితా సాహిత్యం అంతా శతక, దండక రూపంలోను, కొద్దిభాగం మంగళహారతులు

యిత్యాది స్త్రీల పాటల రూపంలోను వెలువడ్డది. ఒక్క 1921 లోనే దాదాపు రెండు డజన్ల శతకాలు వెలువడ్డాయి! ఈ శతకాలన్నింటిని గురించి యిక్కడ ముచ్చడించడం అంత ప్రయోజనకారి కాదు. ఎందువల్లనంటే వీనిలో చాల శతకాలలో భక్త్యావేశం మినహా కావ్య గౌరవం లేదు.

శ్రీ బుద్ధవరపు సత్యనారాయణామాత్యుడు వ్రాసిన "*శ్రీ గాంధీ శతగీతి*" (1921) ఇట్టి శతకాలలో మొట్టమొదటిదిగా కనిపిస్తున్నది. గాంధీజీని శ్రీరామచంద్రుడితో పోల్చడంతో యీయన గాంధీజీకి దైవత్వాన్ని ఆపాదించాడు.

భక్తితో గాంధి పూజానురక్తిలేక
దేశసేవల నించుక దీక్షలేక
ధర్మమెఱుగని హైందవ తనువులేల
కలుగుజెల్లను దల్లుల కడుపుచేటు.

అంటూ ప్రారంభించిన యీ శతకంలో మొదటి రెండు పద్యాలు ప్రస్తావన పద్యాలుగా మకుటం లేకుండా వ్రాయబడ్డాయి. ఆ తరువాతి పద్యాలన్నీ "గాంధి పూజ సేయ గడగుడయ్య" అన్న మకుటంతో వ్రాయబడ్డాయి.

శ్రీ దోమా వేంకటస్వామి గుప్త వ్రాసిన "*మహాత్మ గాంధి శతకము*" కూడ 1921 లో వచ్చినదే. ఈ శతకంలో కవి గాంధీజీని గురించి చెప్పకొన్న దానికంటె తన్ను గురించి చెప్పుకొన్నదే అధికంగా కనిపిస్తుంది "సర్వం బొచ్చును నాకటంచు నెట వాచా పూర్తిగా చెప్ప"నని అంటూనే, చిన్న తనంలో తాను తెలుగు, సంస్కృతం, ఆంగ్లం నేర్చుకోవడం నుంచీ రికార్డు చేశారు. ఈ కవి శతావధాని కావడంవల్ల కాబోలు పద్యరచన అలవోకగా సాగినా అనవసరమైన పదజాలం ఎంతో ఎక్కువగా వాడబడ్డది. "ముక్త పరి

పంధిన్ గాంధినిన్ గొల్చెదన్" అన్న మకుటంలోనే కన్పిస్తుంది కవికి గాంధీజీ అంటే వున్న భగవద్భక్తి.

కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు "ఆంధ్రపత్రికనిచ్చి, అమృతాంజనమిచ్చి"న మహనీయుడేకాదు. ఆనాటి అవిభక్త మద్రాసు రాష్ట్రంలో ఆయన గాంధీజీకి కుడిభుజంగా నిలిచిన కార్యకర్త. ఆయన తెలుగులో గాంధీ సాహిత్య రచనకు చేసిన సేవ చిరస్మరణీయం. ముఖ్యంగా ఆయన ఆంధ్రపత్రిక ద్వారా వెలువరించిన జాతీయోద్యమ భావాలు ఆనాడు తెలుగుదేశాన్ని ఉద్రూతలూగించాయి. పంతులుగారు 1924 జనవరిలో "**భారతి**" అన్న మాస పత్రికను స్థాపించి ఆధునిక సాహిత్య ప్రకటనకు తోడ్పడ్డారు. 1924 జనవరిలో ప్రారంభమైన "**భారతి**"లో— అంటే మొదటి సంపుటము, మొదటి సంచికలో— మొట్టమొదటి కవిత శ్రీ మంగిపూడి వేంకట శర్మగారి "***గాంధి శతకము***". ఇది జనవరి, ఫిబ్రవరి, మార్చి— మూడు మాసాలు భారతిలో ధారావాహికంగా వెలువడ్డది. "గాంధీమహాత్మా!" అన్న మకుటంతో వ్రాయబడిన కంద పద్యాలు గల శతకం ఇది.

ఆనాడు దేశవ్యాప్తంగా గాంధీజీ యెడ ప్రజలు-ముఖ్యంగా రచయితలు-చూపిన భక్తి ప్రపత్తులనే వేంకటశాస్త్రిగారు యీ శతకంలో చూపారు. శాస్త్రిగారు అప్పటికే "***నిరుద్ధ భారతము***"ను వ్రాసి గాంధీగారి సిద్ధాంతాలలో ముఖ్యమైన "హరిజన సమస్య"కు సిద్ధాంత గ్రంథం వ్రాసి దాని నివారణకు తోడ్పడ్డారు.

ఈ శతకంలో గాంధీ నిర్మాణ కార్యక్రమాల వివరణకన్న గాంధీజీ వ్యక్తిత్వంలోని లక్షణాల పొగడ్త ఎక్కువగా కన్పిస్తుంది.

నిరుపమ కల్యాణ గుణా
భరణా జనకాభయోగి వందిత చరణా

పురుషార్థ భరిత చరితా
కరుణామృత పూరితాత్మ గాంధి మహాత్మా!

గాంధీజీని మరొక అవతార పురుషుడుగా భావించిన అందరు కవుల వలెనే శాస్త్రిగారు కూడా

నీ వేసువనుచు బుద్ధుడ
వీవనుచున్ రాముడనుచు గృష్ణుడవనుచున్
భావింతురు నీవందఱు
గావలయునటంచు నెంతు గాంధి మహాత్మా!

ఇదేకాలంలో వచ్చిన గాంధీ శతకాలలో - వనమ్ శంకరశర్మ వ్రాసిన *"మహాత్మగాంధి శతకము"* (1925), జీడిగుంట శ్రీరామమూర్తి వ్రాసిన *"మహాత్మకథ"* (1925), భాగవతుల నృసింహశర్మ వ్రాసిన *"గాంధి శతకము"* పేర్కొనదగినవి.

కొండవీటి వేంకటకవి రచించిన *"త్రిశతి"* అన్నది మూడు వందల పద్యాలతో కూడిన మూడు శతకాల సంపుటి. బుద్ధుడు, వేమన, గాంధీ యీ ముగ్గురిపై వ్రాయబడ్డాయి యీ శతకాలు. కవి - పండితుడే కాని సాంప్రదాయాన్ని పూర్తిగా ధిక్కరించినట్లు తోస్తుంది. అంతేకాదు. ఇందులో ఆయా మహామహుల సిద్ధాంతాలని చెప్పబడ్డవి ఆయా ప్రవక్తలవని గట్టిగా చెప్పలేము.

"ఇంటిగుట్టు రచ్చకెక్కించి ప్రహ్లాదు
డార్యజాతి దాసుడయ్యె బుద్ధు"

డని చెప్పిన ఈయనే—

"వంగి వంగి దండమనుచు వధియించె నున్మాది
గీత నెఱిగి యుంటచేత గాంధి!"

అన్నారు. ఈయనకు సంప్రదాయంమీద మరికొంత గౌరవం ఉంటే, ప్రతిభా వ్యుత్పత్తులున్న ఈ కవి రచన మరింత ఉత్కృష్టంగా వుండేది.

పండిత, కవులతోబాటు కేవలము భక్తితత్పరత మాత్రమే కలిగిన ఎందరో జాతీయవాదులు గాంధీజీకి తమ రచనల ద్వారా ప్రేమోపహారం అర్పించారు. అట్టి వారిలో గొన్నాభక్తుల చినమల్లి ఖార్జునరావు ఒకరు. ఈయన వ్రాసిన ***"గాంధి శతకము"***

"తొల్లిటిదైవావతార మహాపురుషులు యుగ యుగా దర్శనా జన్మలగుటచేసి, మరల నీ కలియుగములో పాపభూయిష్ట మగు కవి స్వరూపమును బాపుటకై యవతరించిన మహాత్మక సంభూతిని కల్క్యవతార స్వరూపునిగా భావించి"

వ్రాయబడ్డది. ఇందులోని వన్నీ కంద పద్యాలు. పద్యాలు పేలవంగా ఉన్నా భక్తి తత్పరతలు ఎక్కువగా ఉన్నాయి ఈ శతకంలో.

గాంధీజీ ఎడ భక్తితోబాటు కవితావేశం కూడా కలిగితే శ్రీ మంగళంపల్లి సూర్యనారాయణగారి ***"నతశతి"*** వంటి శతకాలు వెలువడతాయి. శ్రీ సూర్యనారాయణగారు ***"గణ్యా శాంతిదూత గాంధి తాత"*** అనే మకుటంతో వంద పద్యాలతో గాంధీజీకి వందనం చేశారు. కేవలం భావావేశమేగాక రచనా పాటవంలో కూడా సహృదయులను సంతోషపెట్టే పద్యాలు ఇందులో చాలా ఉన్నాయి. ఈ శతకంలో గాంధీజీ అసామాన్యత్వం అతిసామాన్యమైన, సరళమైన పద్యాల్లో వర్ణించబడ్డది

"మంటినుండి నీవు మనుజుల సృష్టించి
శాంతి సహనములను సాధనముల

నిచ్చి దొరలపైకి ప ద్తైఱ కంపితి
గణ్యా శాంతిదూత గాంధితాత."

"పడనేర్చితయ్యా ఈ చిత్ర సమరమ్ము
అన్న మెుల్లకుంట పన్నుకట్ట
కుంట ఇవియ పగర నొత్తు సాధనములు?"

గాంధీజీ మరణాన్ని గురించి చెబుతూ ఈయన —

"నీ ఎడంద చింది నేల పారిన రక్త
రక్తిమంబు మాయరాని మచ్చ."

అంటాడు నిజానికి తరతరాలుగా మహామహులందరూ మరణించిన పద్ధతిని గమనిస్తే ఈ మాట ఎంతైనా నిజమనిపిస్తుంది.

స్వాతంత్ర్యానంతరం వచ్చిన గాంధేయ శతక సాహిత్యంలో శ్రీ వల్లమూడి గోపాలకృష్ణయ్య వ్రాసిన "*గాంధీ శతకము*" ఒకటి. ఇది కంద పద్యాల్లో వ్రాయబడ్డది ఈయన కవిత్వం కూడా ఈయన వ్యాకరణం వలె విలక్షణమైనది.

"శ్రీకారంబున మొదలిడి
పాకంబుగ నుండు కంద పద్యంబులలో
'షోకు'గ నీ నామంబున
నీకై శతకంబు జేతు నీటుగ గాంధీ."

ఈయన కూడా గాంధీని దేవతాగణంలో జేర్చాడు.

"నెత్తినొక చిన్న పిలకయు
సత్తువ లేనట్టి తనువు, సన్నని కట్టున్
చిత్తరవు బోసినగవును
హత్తిన రూపంబు నున్న హరుడవొ గాంధీ"

కేవలము గాంధీజీపై గాక గాంధీజీ సూత్రాలైన అస్పృశ్యత, స్వరాజ్యోద్యమము, హరిజన సమస్య వంటి విషయాలపై శతకాలు వ్రాసిన వారు లెక్కకు మిక్కిలి.

4

# ఖండకావ్యాలు - ఖండికలు

గాంధీజీచే ప్రభావితమైన ఆధునిక రచనలు ఖండకావ్య రూపంలో వచ్చినన్ని మరి ఏ సాహిత్య శాఖలోను రాలేదు. దానికి కారణం ఆధునికులు ఖండకావ్యాన్ని తమ కవితా వ్యాసంగానికి ప్రధాన రూపంగా స్వీకరించటమే. ఆధునిక కవిత్వ చరిత్రలో భావకవితోద్యమము లేదా కాల్పనికోద్యమము అన్నదానిని "ఖండ కావ్య యుగము" అనికూడా అనవచ్చు. తరువాతి అభ్యుదయ కవిత్వానికి గేయం మూలరూపం ఎలా అయిందో అలాగే కాల్పనికోద్యమానికి ఖండకావ్యం అట్టి మూలరూపం అయింది.

"కావ్యలక్షణములన్నీ లేకపోయినా స్వయంసంపూర్ణమై పూర్వాపరనిరాకాంక్షమై పరిసమాప్తార్థకమైన రసపర్యవసాయి కాదగిన కావ్యైకదేశము ఖండకావ్యము."[1] ఈ నిర్వచనం ప్రకారం చూస్తే స్వీయానుభూతి అన్యాపదేశంగాను లేదా ఆత్మపరంగాను వుంటూ నాతిదీర్ఘములై ఏకవిషయికములైన పద్యరచనలన్నీ ఖండకావ్యాల క్రింద పరిగణింపవచ్చు. ఈ నిర్వచనం ప్రకారం చిన్న చిన్న ఖండికలు కూడా ఖండకావ్యాలుగానే స్వీకరింపబడవచ్చు. నిజానికి శతకాన్ని

కూడా ఖండకావ్యంలో ఒక రూపంగా పేర్కొనవచ్చు. అదికూడా ఆత్మానుభూతిని వ్యక్తీకరించేదే. ఒకే విషయాన్ని ప్రతిపాదించేదే. అయితే ఈ శతకరచన అనాది కాలంనుంచీ రూఢమైన సాహిత్య రూపంగా ఒక ప్రత్యేకతను ఆపాదించుకున్న కారణంగా గాంధీజీ పై వచ్చిన అట్టి అసంఖ్యాకములైన శతకాలను ఖండకావ్యాలలో చేర్చక ప్రత్యేకమైన శీర్షిక క్రింద పరిశీలించడం జరిగింది.

ఖండకావ్యాలు, ఖండికలు పత్రికలలో ప్రచురింపబడి అందులో కొన్ని తర్వాత పుస్తకరూపంగా రావటం, మరికొన్ని అలానే అజ్ఞాతంగా వుండిపోవటం జరుగుతున్నది. ఇక్కడ పేర్కొన్న ఖండ కావ్యాలు బహుధా పత్రికలలోనుంచి స్వీకరించినవి.

ఈ ఖండకావ్య రచనకు భారత స్వాతంత్ర్య సమరానికి కూడా అవినాభావ సంబంధం వున్నట్లు తోస్తుంది స్వాతంత్ర్యోద్యమం నలుమూలలకి ప్రాకటానికి దేశంలో అసంఖ్యాకంగా పత్రికలు ప్రారంభింపబడ్డాయి. కవులు పత్రికల కెక్కడం ప్రారంభించారు. అయితే పత్రికలలో వుండే పరిధి కొంచెం కనుక మహాకావ్యాలను పత్రికలలో ప్రచురించడం అసంభవమైన విషయం. పైగా ప్రజలను ఉత్తేజపరచటానికి మహాకావ్యాలకన్న ఖండకావ్యాలే ఎక్కువ దోహదకారి. ఈ శీర్షిక క్రింద ప్రధానములైన ఖండకావ్యాలను మాత్రమే పరామర్శించడం జరుగుతుంది. ఎందువల్లనంటే తెలుగుదేశంలో ఎందరు కవులున్నారో అందరూ గాంధీజీని గురించి కొంచమో గొప్పో వ్రాసినవారే. ఇందులో ప్రధానమైనవే ఇక్కడ పరిశీలింపబడ్డాయి.

భారత జాతీయోద్యమం దేశం నలుమూలలా ప్రాకటం, 1905 లో జరిగిన వంగ విభజనతోగాని ప్రారంభం కాలేదు. వంగ విభజన దేశాన్ని అట్టుడికించింది. రాజకీయ నాయకుల్లో ఎంత సంచలనం కల్గించిందో మేధావుల్లోను, సామాన్య ప్రజానీకంలోను అది అంతటి

సంచలనాన్ని కల్గించింది. ఇదే కాలంలో బిపిన్‌చంద్రపాల్ వంటి నాయకులు దేశం నలుమూలలా పర్యటించి ఈ భావాన్ని ఇంకా ఎక్కువ రగిల్చారు. బిపిన్‌చంద్రపాల్ ఆంధ్రదేశ పర్యటన ఆంధ్ర జాతీయోద్యమ చరిత్రలో ఒక నూతనశకాన్ని ఆరంభింపజేసింది. వందేమాతరం అన్న నినాదం ప్రతి ఆంధ్రుడినోట విన్పించింది. బిపిన్ చంద్రపాల్‌గారు రాజమండ్రిలో ఉపన్యసించిన సభలో చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు ఆవేశ పూరితంగా చదివిన పద్యం

"భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై ఏడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి"

"భారత జాతీయోద్యమ సంబంధమైన తొలి రచన అని చెప్పవచ్చును"[2] అన్న నారాయణరెడ్డిగారి మాటలు కొంతవరకే నిజం. ఎందువల్లనంటే 1897-98 మధ్యకాలంలో "సరస్వతి" మొదలైన పత్రికల్లో భారతదేశపు స్థితిగతులను గూర్చి అశేషమైన ఖండికలు వెలువడ్డాయి. ఇవి ఏవీ పుస్తక రూపంగా రాలేదు. అయితే "మనోరమ" పత్రిక వచ్చినప్పటినుంచే ఈ జాతీయోద్యమ విషయాలు పత్రికలలో ఎక్కువగా రావటం ప్రారంభించాయి. బహుశా దీనికి సంపాదకులైన చిలకమర్తివారిదే కావచ్చు "*భరతఖండ విముక్తి*" శీర్షికతో కొన్ని పద్యాలు 1906 లో వెలువడ్డాయి.

"స్వాతంత్ర్యమున గాదే
ఖ్యాతిన్ బలమున్ జయంబు గను దేశంబుల్
స్వాతంత్ర్యమె మేలి తొడవు
స్వాతంత్ర్యము లేని బ్రతుకు బ్రతుకే తలపన్"[3]

1905 కు పూర్వమే గాంధీజీ తర్వాతి రోజుల్లో స్వీకరించిన దేశ విముక్తి, అస్పృశ్యత, మద్యపాననిషేధం వంటి అనేక సమస్యలపై పద్యాలు, ఖండికలు వెలువడ్డాయి. ఇందులో మంగిపూడి వేంకట శర్మగారు పంచములపై వ్రాసిన పద్యాలు[4], "మద్యపాన దూషణము" అన్న గైనేడి వేంకటస్వామి నాయుడిగారి సీస వింశతి, పంచచామర పంచవింశతులు[5] ప్రచురింపబడ్డాయి. ఇందులో మద్యపానంవల్ల నష్టాలు వివరంగా చెప్పబడ్డాయి.

ఇదే కాలానికి చెందిన ముఖ్యమైన రచన చెన్నాప్రగడ భాను మూర్తిగారి "*భారత ధర్మ దర్శనము*" ప్రచురణ 1907లోనే జరిగినా యిందులోని ఖండికలు 1905-1907 మధ్యకాలంలో వ్రాసినవే. ఇది ఆంధ్రభాషాభివర్ధనీ ప్రచురణములలో మొట్టమొదటిది. దీనికి పీఠికారూపంలో ఆ ప్రచురణముల కార్యదర్శి శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారు తమ ధ్యేయాన్ని గూర్చి యిలా పేర్కొన్నారు.

"మన దేశమున నూతనముగా బయలువెడలిన భారతీయ జీవన భావను మనల ననేక యభివృద్ధి సంపాదనావిషయిక ప్రయత్నములకు బురికొల్పుచున్నది. ఈ జాతీయ జీవన పోషణకును దాని వ్యాపకమునకును...కావలసిన గ్రంథములు మన భాషలో పేర్కొనుట కొకటి రెండైనను కానరాకున్నవి"[6] అన్నారు.

ఈ గ్రంథంలో నాల్గు భాగాలున్నాయి. మొదటిది "*వందే మాతరం*" అన్న బంకించంద్ర గేయానికి తెలుగు అనువాదం. రెండవది "*హిందూదేశ దైన్య విచారము*". మూడవది "*భవిష్యద్భారతవర్ష దర్శనము*" నాల్గవది "*భారతీయ ధర్మా ధర్మ నక్షత్రమాల*" వీని అన్నింటికినీ ముందు చిలకమర్తివారి పద్యము ఉల్లేఖించబడటంతో అప్పటికే ఈ పద్యంయొక్క ప్రశస్తి ఎంతగా వున్నదో మనకు తెలు

స్తుంది."వందేమాతరం" శీర్షిక క్రింద పద్యాలు 1905లో వంగ రాష్ట్ర విభజన సందర్భంలో వ్రాసినవి.

ఇలా చిలకమర్తితో ప్రారంభమైన జాతీయోద్యమ భావము రాయప్రోలు వారిని చేరడానికి ముందుగానే చెన్నాప్రగడ భానుమూర్తి, మంగిపూడి వెంకటశర్మ, గైనేడి వేంకటస్వామి ప్రభృతులను కదిల్చివేసింది. శ్రీ వేంకటశర్మగారు "భారతమాత" అన్న శీర్షికతో వ్రాసిన పద్యాలలో భారతదేశ ప్రాచీనౌన్నత్యాన్ని చాటి చెప్పారు.[7] ఇంతకన్న ముఖ్యమైన వీరి కావ్యం "*నిరుద్ధ భారతం*" (1915). ఇది పంచముల దైన్య జీవితాన్ని గూర్చి వ్రాయబడిన మొట్టమొదటి పద్య కావ్యము.

ఒక్క విషయాన్ని మాత్రం ఇక్కడ పేర్కొనాలి. ఈ గ్రంథానికి చివర గాంధీజీ హరిజన సమస్యను గూర్చి ఇచ్చిన ఒక ఉపన్యాసానికి తెలుగు అనువాదం ఇవ్వబడింది.

"దేశభక్తరత్నమును భారత బాంధవుడును నగు శ్రీ మోహనదాస కరుణాసాంద్ర గాంధిగారు మాయవరమున పంచముల సన్మానపత్రమునకు ప్రత్యుత్తరముగా నిచ్చిన యుపన్యాస సారాంశము" అని ఇందు పేర్కొనటం వల్ల దీనిని ప్రప్రథమంగా తెలుగులోనికి అనువదించబడిన గాంధీ సాహిత్యంగా పేర్కొనవచ్చు.

### రాయప్రోలు సుబ్బారావు : గురజాడ అప్పారావు

రాయప్రోలు వారిలో జాతీయోద్యమ ప్రభావము 1914 నుంచీ ద్యోతకమవుతుంది. గాంధీజీ మీద 1914 లోనే[8] ఆయన ఒక వ్యాసాన్ని ప్రచురించటం చూస్తే అప్పటికే ఈయన గాంధీజీ ప్రభావానికి లోనైనట్లు తోస్తుంది. కావ్య రూపంగా వచ్చిన వీరి మొదటి జాతీయ ఖండిక 1915 లో గోఖలే నిర్యాణ సమయంలో వెలు-

వడింది. వీరి జాతీయాభిమానం "జన్మభూమి" మొదలైన పద్యాల్లోను "ఏదేశమేగినా" వంటి పాటల్లోను పరాకాష్ట కెక్కింది.

నవ్యసాహిత్య వైతాళికుడని చెప్పబడిన గురజాడ అప్పారావులో జాతీయాభిమానం వున్నా దానికి మించిన మానవతావాదం వుండటంవల్ల ఆయన ముఖ్యంగా అట్టి కావ్యఖండికలనే వెలువరించాడు.

ఈ కాలానికే చెంది గాంధీజీచే ప్రత్యక్షంగా ప్రభావితమైన వ్యక్తి బలిజేపల్లి లక్ష్మీకాంతకవి. ఈయన వ్రాసిన "**స్వారాజ్యరథము**" "స్వారాజ్య సమస్య" యిందుకు ఉదాహరణలు. కావ్యాలు రెండూ అత్యంత దేశభక్తి ప్రపూరితాలు. వీనిలో స్వరాజ్యోద్యమము, దాని ఆకారము, దాని ప్రచారము, వివరణము, తిలక్ దేశానికి చేసిన సేవ, ఆయన తర్వాత గాంధీజీ నాయకుడు కావటం మొదలగు విషయాలు చాల హృదయంగమంగా చిత్రీకరింపబడినవి. ఇందులోని పద్యాలు చాలా ఆ కాలంలో బహుళప్రచారంలో ఉన్నవి.

"తరి గాంధీయుగ మేగుదెంచె నిక నే తద్భారతీయ స్వరా
జ్యరథం బాతని సారథిత్వమున వే సాగింపుడంచున్ జగ
ద్గురు డేగెన్ దివి లోకమాన్యుడవె యుద్ఘోషించె దూర్యధ్వనుల్
ఉరుతద్దివ్యరథంబు లాగుటకు రండో భారతీయప్రజల్"[9]

ఇట్టి దేశభక్తిపూరితములైన ఖండికలు ఈ గ్రంథము ఆద్యంతమూ వున్నాయి. ఇందులో ఆంధ్ర విద్యార్థులను సంబోధిస్తూ గాంధీజీని గూర్చి వారికి చెప్పిన మాటలు పేర్కొనతగినవి. "గాంధీభగవాను" వాక్యములను నమ్మి ఆచరించవలసినదిగా కోరుతూ

"సాక్షాన్నారాయణమూర్తియే మరల గాంధీ స్వరూపం
బు గైకొన్నా డా జగదేకనాయకుని వాక్కుల్ వేదముల్"[10]

అంటాడు.

తిలక్ నిర్యాణం, గాంధీజీ భారత జాతీయోద్యమానికి నాయకత్వము వహించడం కూడా తెలుగు సాహిత్యంలో నాటకాల రూపాన, కావ్యాల రూపాన, గ్రంథస్థం చేయబడ్డాయి. అందులో ముఖ్యమైనది **"స్వారాజ్య ప్రబోధము"** అన్న కాశీనాధుని వీరమల్లయ్యగారి ఖండ కావ్యం. ఇందులో స్వరాజ్యప్రబోధము, తిలక్ నిర్యాణము, భరత మాత దుఃఖోపశమనము మొదలైన వివిధ శీర్షికలు వున్నాయి. ఈ చివర పేర్కొన్న శీర్షికలో "ఘనుండు గాంధి నిను సంబాళింపగా నున్న గాసంతైనను భయమేమి నీకు గలదమ్మా!" అంటూ తిలక్ నిర్యాణం వల్ల దుఃఖావిష్ట అయిన భరతమాతను సముదాయిస్తాడు కవి. ఇందులోని 9 వ శీర్షిక ***"గాంధీ అవతార ఘట్టము"***. గాంధీజీ దేశ నాయకత్వం చేపట్టటం, ఆయన ఘనత పేర్కొనబడ్డాయి యిందులో.

"ధర్మమును జేరి గాపాడు ధర్మరాజు
దగ నధర్మమునెడ యమధర్మరాజు"

అంటూ గాంధీజీని దేవునితో పోలుస్తాడు కవి. ***"గాంధీ స్వారాజ్యా ఖారము"*** అన్న శీర్షికలో "గాంధి భగవానుడా! నమస్కారమయ్య" అన్న మకుటంతో పద్యాలు వ్రాయబడ్డాయి. 1921 నాటికే గాంధీజీపై పెక్కు ఖండికలు వెలువడటం, వానిలో గాంధీజీని దేవునిగా అవతారమూర్తిగా పేర్కొనటం జరిగింది.

1924లో గాంధీజీ సాగించిన ఉపవాసవ్రతం చాలమందికి క్రొత్త ఆయుధంగా కన్పట్టింది. దానివలన ఆయన ప్రారంభించిన ఉద్యమాల లోని నైతికత, ఆధ్యాత్మికత ప్రజలకు అర్థమయ్యాయి. దీనివల్ల ప్రభావితుడైనవాడే "ఆంధ్రరత్న" దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు. ఈయన తన వాక్చమత్కృతితోను, కవితా ప్రతిభతోను ఊరూరా ఉపన్యాసాలుచేసి ఆంధ్ర ప్రజలను సమ్మోహితులను చేసిన వ్యక్తి. ఆ కాలంలో చాలమంది కవులు ఆయనను పొగుడుతూ పద్యాలు,

పాటలు ప్రాశారంటే[11] దానికి కారణం ఆయన ప్రతిభ; ఆంధ్రదేశంలో ఆయనకున్న ఆదరణ. ఆయన సృష్టించిన రామదండు, పన్నుల నిరాకరణకోసం ఆయన స్థాపించిన కొత్తగ్రామాలు మొత్తం దేశాన్నే కదలించి వేశాయి. అట్టి దుగ్గిరాల అనేక సందర్భాల్లో మహాత్ముని గురించి ఆశువుగా పద్యాలు చెప్పారు. 1924 లో ఢిల్లీలో ఉపవాసము ప్రారంభించిన గాంధీజీని గురించి ఆయన వ్రాసిన 3 పద్యాలు మనకు మిగిలి వున్నాయి.

"వాద వైఖరితోడి వేదాంత రతిదేలి
స్వారాజ్య పారంబు జేరుకొరకు
వ్యవహార నయ సమన్వయ భవ్యమార్గము
సత్వర స్థితి బ్రతిష్ఠించుకొరకు
హింసా పదాగత ధ్వంసియౌ ధర్మంపు
వంశం బహింసచే వర్ధిలుటకు
లోక కల్యాణంబు జేకూర్ప నాత్మార్ప
ణమ్మును నార్షపథంబు దుదకు

బూనినాడు మహాత్ముడు భూభరమ్ము
బాపగా నేడు మహాదుపవాస వ్రతము
ముక్తి సుముహూర్త వేళలు మూగినవిక
రామనగరీ నరేంద్ర శ్రీరామచంద్ర."[12]

### కవి కోకిల ఖండ కావ్యాలు

"కవి కోకిల" శ్రీ దువ్వూరి రామిరెడ్డి జాతీయోద్యమంవల్ల ప్రభావితులైన తెలుగు కవులలో తొలికారు వారు. గాంధీజీ రాజకీయ రంగస్థలం మీదికి రాకపూర్వమే రామిరెడ్డిగారు ఎన్నోసార్లు స్వాతంత్ర్య శంఖారవాలు పూరించారు. "భారత మాతృ ప్రబోధము" (1914-18) అన్న ఖండికలో భారతమాతను అనునయిస్తూ

"లేవమ్మా స్వాప్నికశయ్యా వీడి, కనుమా యందంద సూర్యాంశులన్"[13] అంటాడు అంతేకాదు. నీ కుమారులు నీకు మేలు కొలుపులు పాడుతున్నారు, లేవమ్మా - అంటాడు :

"మును గంగాలహరీతరంగతతులన్ ఘోకొట్టు స్వాతంత్ర్య గా
న నినాదంబులు నేడు తత్ప్రియ సుతానందాత్మవీణారవ
మ్మున సమ్మేళనమంది నాగరకతాపూర్ణత్వసంధానసూ
త్రనినాదంబయి మిన్నుముట్ట జననీ తల్పంబువేడిగ్గవే"[14]

1920 లో గాంధీజీ భారతరాజకీయాకాశంలో ఉదయించిననాటినుంచీ శ్రీ రామిరెడ్డి జాతీయత అన్నా, మహాత్ముని ప్రశాళికలన్నా ఎంతో వుత్సాహం చూపారు. వానిని పద్యాలలో కీర్తించారు; గేయాల ద్వారా ప్రచారం చేశారు. 1918-21 మధ్యకాలంలో వచ్చిన ఖండికలలో "స్వాతంత్ర్యరథము" పేర్కొనతగిన రచన. ఆ స్వాతంత్ర్య రథానికి

"లేవు దివ్యతురంగముల్, లేవు కరులు
ప్రజలె యా తేరు మోకులు పట్టువారు"[15]

అని ప్రజాసందోహానికి వారు పాల్గొనే స్వాతంత్ర్యోత్సవానికి నివాళులు పడతాడు.

కాని 1921 తరువాతనే రామిరెడ్డిగారి కవితలో స్పష్టమైన జాతీయతాభావమూ, గాంధీజీఎడ భక్తిప్రపత్తులూ ద్యోతకం అవుతాయి. 1927-32 మధ్యకాలంలో రెండు ముఖ్యమైన ఖండికలు వున్నాయి. "జాతీయత" అన్న ఖండికలో భారతీయుల జాతీయతాభావానికి జోహారు లర్పిస్తాడు కవి.

"ఓసి జాతీయతా, నీ బలోజ్జ్వలత్వ
మెంత! నీ శక్తిసామర్థ్య మెంత!

నీదు శంఖరవమున గల యింద్రజాల మెంత!
అస్థిపంజరములు సైత మాడు నౌర!"[16]

అంటూ జాతీయతాగరిమను పేర్కొని దాని గుణగణాలను భారత జాతీయతకు అన్వయిస్తాడు.

"నీ యాజ్ఞచే గదా నిఖిల భారతభూమి
గాంధీమహాత్ముని కట్లుబడియె......
నీ ధర్మమున గదా నెరజాణ యైనను
మోటు ఖద్దరు మేన మోయదొడగె".[17]

అంటూ చెరసాలలో మ్రగ్గేవారిని, ఖద్దరు ధరించేవారిని అభినందిస్తాడు కవి.

ఈయన వ్రాసిన ఖండికలలో[18] మరొక ముఖ్యమైన రచన "**గాంధి**" (22-9-32 నాడు వ్రాయబడినది). ఈ ఖండికలో రామిరెడ్డి గారు బాపుజీని అవతారపురుషునిగా మాత్రమే భావించక, ఆయన చేసిన అనేకములైన విశిష్ట కార్యాలను గురించి కూడా కీర్తించాడు.

"ధర్మసంస్థాపనార్థంబు దైవశక్తి
యుగయుగమ్మున జన్మించుచుండునన్న
యార్య సూక్తికి దార్కాణమైనయట్టు
లవతరించితె గాంధిమహాత్మ నీవు?"[19]

గాంధీజీలో వున్న లక్షణాలు తరతరాలుగా భారత వీరుల్లో వున్న మహత్తరమైన లక్షణాల మేలి కలయికగా పేర్కొంటాడు కవి.

"భీష్మదీక్షయు, చైతన్య ప్రేమరసము
బుద్ధుని యహింస ప్రహ్లాదు పూతభక్తి
యల హరిశ్చంద్రు సత్యవ్రతాఢ్యతయును
గలిసి మూర్తి భవించితే కార్యశూర!"[20]

ఇందులో కవి పేర్కొన్న దీక్ష, ప్రేమ, అహింస, భక్తి, సత్యవ్రతత్వము,—ఇవి అన్ని అంతర్భూతములైన లక్షణాలు. కేవలం వీనిని పుణికిపుచ్చుకోవడంతోనే మహాత్ముడు తృప్తిపడలేదు. వానినన్నింటిని కార్య రూపంలో పెట్టాడని భారత కార్యరంగంలో పై అంతర్భూతములైన లక్షణాలను ప్రయుక్తం చేశాడని "కార్యశూర" అన్న చివరి సంబోధనలో కవి శ్లేషించాడు. ఉప్పుసత్యాగ్రహము మొదటమొదట ఎలా ప్రజల అవహేళనకు గురి అయినదో, రానురాను అదే దేశాన్నంతను ఎలా మహోద్వేగంలో ముంచెత్తిందో చూపుతాడు కవి.

"హేళనపాత్రమై మొదట, నింతగనంతగ మోసులెత్తి
...............సమస్తదేశమున్
మూలము ముట్టనూచెగద మున్ లవణోద్యమతత్వమెట్టిదో?"21

ఇలా వట్టి కార్యశూరత్వమేకాక ఆధ్యాత్మిక తత్వంతో దేశాన్ని ఎలా రక్షణ చేస్తున్నాడో చూపుతాడు :

"చావుంబ్రతుకులు రెంటికి
నావలిమార్గంబు ద్రొక్కు నచలుడవగుటన్
మావలె దలపంగోరవు...............''22

అన్న నిజాన్ని వ్యక్తీకరిస్తాడు. ఈ మాటలలో మామూలు ప్రజలకు మహాత్మునికి వున్న వ్యత్యాసం గోచరమవుతుంది. మహాత్ముడు అచలుడు. చావు బ్రతుకుల కతీతమైన మార్గం త్రొక్కినవాడు. ప్రజలు సామాన్యులు. ఈ వ్యత్యాసాన్ని చక్కగా నిరూపించారు రామిరెడ్డిగారు.

### జాషువా ఖండకావ్యాలు

ఆధునిక కవులలో బాపుజీ జీవితము, ఆయన స్వాతంత్ర్య నాయకత్వములచేత విశేషంగా ప్రభావితులైనవారిలో శ్రీ జాషువా

ఒకరు. ఈయన ఖండకావ్యాలన్నీ చక్కని భాషాపాటవముతోను, మధురమైన భావనతోను నిండి పాఠకుల మనస్సులను ఆకట్టుకో గల్గినట్టివి ఈయన వ్రాసిన "ఫిరదౌసి", "గబ్బిలము", "ముంతాజ మహలు" మొదలైన కావ్యాలకు ఎనలేని కీర్తిప్రచారాలు వచ్చాయి. జాతీయప్రబోధం ప్రత్యక్షంగాను పరోక్షంగాను కూడా ఈనాటికీ చేస్తూనే వున్న కొద్దిమంది కవులలో ఈయన ఒకడు.

గాంధీజీ ప్రసక్తి వున్న ఈయన ఖండకావ్యాలలో "బాపూజీ" అన్నది ముఖ్యమైనది. "మహాత్ముని యకాలమరణమునకు విశ్వంభరా నేత్రము చెమ్మగిల్లినది. భారతస్వేచ్ఛకై వ్యయించక మహాత్ముడు దాచుకొన్న రక్తకణము లేదు. అతడే భరతవర్షము. భరత వర్షమే బాపూజీ."[23] జాషువా చెప్పిన ఈ మాటలను బట్టి ఆయనకు బాపూజీ అంటే వున్న భక్తి భావము వెల్లడి అవుతున్నది.

ఇతర ఖండకావ్యాలలో వలెనే జాషువా ఈ ఖండకావ్యంలో కూడా వినూత్నమైన రచనాశిల్పం ప్రదర్శించాడు. పరస్పర విరుద్ధములైన భావాలను ఒకదాని ప్రక్కన మరొక దానినుంచి ఒక చిత్రమైన శ్లేష[24] రూపొందించాడు.

"గోచిపాతను కట్టుకొని జాతి మానంబు
నిలిపినట్టి ఖదరు నేతగాడు"

అనడంలో మామూలుగా ప్రజలు అవమానంగా భావించే గోచిపాతను తానే కట్టుకొని అంతకన్న గొప్పదైన జాతిమానాన్ని ఖద్దరు ద్వారా నిలిపాడన్న ప్రశంస కన్పిస్తుంది. అలానే

"ఎవడీ యర్థ దిగంబరేశ్వరుడు మా యిండ్లన్ బ్రవేశింప నం
చవమానంబుగ చర్చిలాడగ బకింగ్‌హామ్ సౌధమున్ ద్రొక్కి హైం
దవ జాతీయత లీను మేల్ పిలకనాట్యంబాడ శ్రీ జార్జిభూ
ధవునింటన్ ఫలహారముల్ సలుపు తాతన్ గాంధి నర్చించెదన్."

ప్రధానమంత్రి చర్చిల్ అవమానించాడు, ఆయనకన్న గొప్ప వాడైన చక్రవర్తే తన యింటికి విందుకు పిలిచాడు - అన్న దానిలోనే రెండు విరుద్ధమైన భావాల పోలిక వున్నది. దీనికి తోడు—అంతటి చక్రవర్తి యింటికి హైందవ జాతీయతకు చిహ్నమైన పిలకతో బకింగ్ హామ్ సౌధంలోనే విందును ఆరగించడానికి గాంధీ పోయాడట ఇలా గాంధీజీ ఘనతను "విరుద్ధ సామ్యాల" ద్వారా చమత్కరించాడు కవి.

జాషువా రచనల్లో అటు ప్రత్యక్షంగాను యిటు పరోక్షంగాను కూడా గాంధీజీ ప్రభావాన్ని చూపెట్టే ఖండకావ్యాలు ఎన్నో వున్నాయి. ఆయన ఖండకావ్యాలలోనే మూడు నాలుగు ఇట్టి ప్రభావానికి లోనైనవి. "*గబ్బిలము*", "*స్వయంవరం*" యిందుకు ప్రత్యక్ష నిదర్శనాలు.

"*గబ్బిలము*" రెండు భాగాల ఖండకావ్యము. తెలుగు కావ్యాలలో హంసలు చిలుకలు రాయబారాలు చేయడం కన్పిస్తుంది. కాని గబ్బిలాలు రాయబారాలు చేయటం లేదు. గబ్బిలము అనగానే ఒక విధమైన జుగుప్స మనకు. కాని జాషువా తలపెట్టిన కావ్య సందేశానికి గబ్బిలమే తగిన రాయబారి. దేశంలోని అనేకానేకములైన అన్యాయాలను, అనైక్యతలను గురించి గబ్బిలము కైలాసానికి కబురు తీసుకొనిపోతుంది. "వాని సందేశ ఫలితంగా నాల్గుమూలల నుండి ప్రసన్నవాయువులు వీవసాగినవి. దేవాలయ ప్రవేశము, హరిజనోద్ధరణమని గాంధిదేవుని చరఖా ఝూంకరణము, శ్రవణశుభ ఝూంకరణము, గంగాగానము చేసినది".[25]

ఇంతలో గబ్బిలము మరోసారి దర్శనమిచ్చింది. ఈసారి దేశంలో గల అనైకమత్యము, బహుకులమతావేశవ్యాధిపీడ మొదలైన చింతాసందేశాలను గబ్బిలానికి చెప్పుకుంటాడు పేదమానవుడు.

ఈసారి గబ్బిలము ఏమీ చేయలేక కన్నీరు కారుస్తుంది. భవిష్యత్తులో నైనా ఈ బాధలు నివారింపబడతాయని కవి ఆశిస్తాడు.

ఈ కావ్యంలో హరిజనుల కష్టాలు, బానిసత్వము వివరంగా చిత్రించబడ్డాయి.

"అంటరానితనంబు నంటి భారతజాతి
భువనసభ్యత గోలుపోయెననుచు"[26]

ఆక్రోశిస్తాడు కవి.

సీమవస్త్రాల వల్ల దేశానికి పట్టిన అనర్థము, ఖద్దరువల్ల దేశానికి కలిగిన సౌభాగ్యము ఈ కావ్యంలో మాటిమాటికి ప్రశంసింపబడ్డాయి.

"ముతకబట్టకు మర్యాద పాటమరించె"

అని,

"నెలలో నున్నది వృద్ధురాలొకతె గాంధీ శిష్యురాల్ నిచ్చలుం
జిలుగున్ నూలు తయారు చేసికొనుచుం జీవించు జేజెమ్మ".[27]

అని రాట్నాన్ని ఖద్దరును ప్రశంసిస్తాడు జాషువా. అంతేకాదు. దేశంలో పాదుకొనివున్న అంటరానితనము, హరిజనుల కష్టములు ఇందులో ప్రముఖంగా చిత్రించబడ్డాయి. నాయకుడైన "పేద మానవుడు" పతంగస్వామికి గాంధీజీని గూర్చి తెలియజెప్పి ఆయనను నీ యాత్రలో దర్శించావా ? అని అడుగుతాడు.

"మరచితి నాదిదేవుని సమానుడు బుద్ధుని యంతవాడు భా
సుర దరహాసచంద్రికల శుభ్రతలోనగలట్టివాడు, య
ద్దొరలకుగాదు వారిచెవి దూరినవారిని లక్ష్యపెట్టడ
ప్పరమ మునిన్ సబర్మతి నివాసిని జూచితివే తపస్వినీ".[28]

ఇందులో గాంధీజీని అవతారపురుషునిగా చూపటంతోబాటు ఆతనికి మానవలక్షణాలైన ఎవరినీ లక్ష్యపెట్టకపోవటం కూడా జోడించాడు కవి.

"స్వాయంవరం" అన్న ఖండకావ్యం భారతీయ స్వరాజ్య స్వరూపాన్ని ప్రతీకాత్మకములైన పాత్రల ద్వారా చిత్రిస్తుంది. "ఇందులో వధువు స్వరాజ్యం. పెండ్లి కొడుకులు ప్రజలు. మహాత్ముని సత్యాగ్రహ యజ్ఞంలో స్వరాజ్యబాల జన్మిస్తుంది. ప్రతిఫలంగా బాపూజీ బలవన్మరణాన్ని స్వీకరించి పరమపదిస్తాడు",[29] అంటూ కథ మొదటిభాగాన్ని వివరించారు జాషువా. ఇందులో గాంధీజీ మరణానికి కవి యిచ్చిన నూతన నిర్వచనం పరిశీలింపదగ్గది.

తరువాతి కథను రచయితే యిలా సంగ్రహించాడు. "స్వరాజ్య బాల పెండ్లి కెదుగుతుంది. నీతిమంతులు, అవినీతిమంతులు, ధన వంతులు, దరిద్రులు, దొంగలు, దొరలు, పెండ్లికొడుకులై వస్తారు".[30] ఎంతటి వ్యంగ్యం! స్వరాజ్యం వచ్చాక వున్న దేశస్థితిని ఎంత నగ్నంగా చిత్రించాడు కవి! గాంధీజీ మరణాన్ని గూర్చి చెబుతూ—

"నిసుగున కేడు మాసములు నిండియు నిండకముందె పాపమా
ముసలిని పొట్టబెట్టుకొనిపోయె నొకానొక పుణ్యమూర్తి త
ద్వ్యసనవినీల నీరదమహాంధతమస్సు విశాల విశ్వమున్
ముసరి, చరిత్రలో గరగిపోసె నఖండ కళంకపంకమున్".[31]

బాల యౌవనవతి కాగానే స్వయంవరం చాటింపబడుతుంది. స్వయం వరానికి వచ్చిన పెద్దలను జాషువా యిలా వర్ణిస్తాడు :

"శాసనసభలలో సభ్యత్వ పదవికై
    వింత సంస్థలు స్థాపించువారు
కాలానుసరణంబుగా తొండలనుబోలి
    మాటిమాటికి రంగు మార్చువారు
..............................
నిమ్నజాతుల మీద నిప్పులు చెరగుచు
    విధిలేక కన్నీరు విడచువారు

చిరుత విధవల కన్నీటి వరదలందు
హాయిగా కుమాళ్ళకు పెండ్లి చేయువారు
వచ్చియున్నారు"—.[32]

వారివారి సంగతులను చెలికత్తెల ద్వారా విని "కలకల నవ్వుచు కల్యాణవేదిక నలంకరించిన స్వారాజ్యకన్నిక......... సభారంగం విడిచిపోతుంది దుఃఖంలో" తుదకు ఆమె ఒక మునిపల్లెలో వుండగా "ఒకనాడు స్వప్నంలో మహాత్ముడు దర్శనమిచ్చి సదుపదేశంచేసి బాల నోదారుస్తాడు".[33] గాంధీజీ స్వారాజ్యబాల కిచ్చిన యీ సందేశము ఒక విధంగా కవి దేశానికిచ్చిన సందేశమే! ఆమెకు గాంధీజీ—

"కనులకు గోచరించె నలనాటి మహాత్ముని మూర్తి కళ్లతో
కనకపు కాంతితో, తుహిన కాంతుల కమ్మని హాసరేఖతో".[34]

ఆయన సందేశాన్ని అనుసరించి స్వారాజ్యబాల తగిన వరుణ్ణి గ్రహించి వివాహం చేసుకొని సుఖంగా వుంటుంది. ఆ వరు డెటువంటివాడు?

"కరముచందుగాంధి కత్తివాదరమీది
కఠినతపము చేయ గలుగువాని
హృదయమున్నవాని నీడుజోడగువాని
ప్రేమమీర భామ పెండ్లియాడె".[35]

ఈ మాటలవల్ల కవి దృష్టిలో ఆదర్శమూర్తి అయిన భర్త, స్వారాజ్య బాలకు కాదగిన భర్త—గాంధీజీ ఆశయాలకు ప్రతినిధి అయినవాడు అన్న మాట.

జాషువా పీడిత మానవుల కన్నీటి గాధలకు కావ్యత్వము కలిగించి తద్వారా గాంధీజీ ఆశయాలైన విశ్వమానవ ప్రేమ, సర్వ మానవ సౌభ్రాతృత్వములను చాటి చెప్పాడు. అందుకు ఆయన ఫిరదౌసి, స్వప్నకథ, అనాధ, ఖండకావ్యాలు నిదర్శనాలు. ఈ విధంగా

కవి గాంధీజీని, ఆయన సిద్ధాంతాలనే కాక 1930 ప్రాంతాలనుంచి దేశంలో వస్తున్న వివిధములైన మార్పులను జాతీయభావోత్కర్షను కూడా తన ఖండికలలో చిత్రించాడు. ఈయన ఖండకావ్యాల లోని 5 భాగాలు యిందుకు నిదర్శనాలు. ఇలా తన అన్ని ఖండ కావ్యాలలోను ప్రత్యక్షంగానో పరోక్షంగానో గాంధీజీ సిద్ధాంతాలను కావ్యరూపంలో చిత్రించి ప్రఖ్యాత జాతీయ కవులలో ఒకడైనాడు జాషువా.

## తుమ్మలవారి ఖండకావ్యాలు

గాంధీ సాహిత్యానికి తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు ఎంతటి అజరామరమైన సేవ చేశారో వెనుక కావ్యాలను గూర్చిన చర్చలో కొంత చెప్పబడ్డది. ప్రకృతము ఆయన ఖండకావ్యాల పరిశీలన చేయబడుతుంది.

వీరి ఖండకావ్యాలలో మొట్టమొదటిది ""**మహాత్మగాంధి తారావళి**" (1921). ఇది ఈయన ప్రప్రథమ ఖండకావ్యము. "నే నీ చిన్నిపొత్తమును వ్రాయుటకు గారణము శ్రీమన్నారాయ ణావతారమగు మహాత్మాగాంధీగారి యందలి భక్తియు, వారి యుద్యమమునందు గల విశ్వాసోత్సాహములు దప్ప పాండిత్యబలము వలన గాదు" అని పీఠికలో చెప్పుకున్నారు వినయమూర్తులైన తుమ్మలవారు. ఆనాటినుంచీ ఈనాటి వరకు అదే అచంచలమైన విశ్వాసంతో "బాపూజీ ఆస్థానకవిగా"[36] తమ జీవితాన్ని చరితార్థం చేసుకున్నారు. ఈ తారావళి 27 పద్యాల్లో వ్రాయబడ్డ చిన్న ఖండిక "మహాత్మా గాంధినామప్రభూ !" అన్న మకుటంతో వున్నాయి ఈ పద్యాలన్నీ. ఎక్కువ గాంధీజీ ప్రశంస కనిపిస్తుంది.

"సకల గ్రామములందు నీ భజనలే సాగించుచున్నారు పు
ణ్యాకరంబైన భవచ్చరిత్రములె వ్రాయంబూనె గైసర్లు, బై

ఘకుడున్ బాడె నీ పయిన్ బదము లెచ్చో విన్న 'గాంధీమహా
త్మకుడై' యంచును నట్టిపల్కులె మహాత్మాగాంధినామప్రభూ!"

కాని ఈ తొలి రచనలో కూడ పాండిత్యప్రతిభ, సౌమ్యమైన భావన కన్పిస్తాయి.

"ధరణీనాథులలోన రాఘవుడు గోత్రశ్రేణి శీతాద్రి ని
ర్జర సంఘంబున పాకశాసనుడు దారాకోటి నుద్యత్ సుధా
కరబింబంబు విధంబునన్ భరతలోకంబందు వెల్గొందు ని
న్నరలేకే భజియింతునెప్పుడు మహాత్మా గాంధినామప్రభూ!"

తుమ్మలవారు 1932 లో వ్రాసిన "ఆత్మార్పణము" ఆయన మొట్ట మొదటి ఖండకావ్యము. ఇది బోయవాడు జంటపిట్టలలో ఒకదానిని చంపగా రెండవదాని ఆక్రోశమును చూచి కవి చెందిన వ్యథకు అక్షరరూపము. అహింస, జీవకారుణ్యము అన్న గాంధీజీ సూత్రాలకు ఇందులో కథాత్మక ప్రయోజనం చూపబడ్డది.

"*పఱిగపంట*" ఖండికల సంపుటి (1943). ఇందులో తుమ్మల వారు అనేక సందర్భాలలో చెప్పిన కవితలు సంపుటీకరింపబడ్డాయి. తన కవిత్వధ్యేయాన్ని గూర్చి చెబుతూ

"దేశముకొరకై బ్రతికి ధ
నాశలు దిగద్రావి ఎవ్వడంచిత ధర్మా
వేశుండగు కవి, యతడె ప్ర
జాశంసాపాత్రు డగుట సత్యంబయ్యెన్"[37].

అని చెప్పుకోవటమే కాక

"నాకవనంబు రేకులు తనర్చెడి ప్రొద్దుల భారతావనిన్
నాకవనంబువోలె సుజనప్రియమంజుల సౌరభమ్మునన్
బ్రాకిన గాంధిధర్మ మొకపాటిగ బ్రాక్తన పుణ్యమంటచే
నాకు రుచించి తెల్గులకు నన్నొక విందునొనర్చె భారతీ"[38]

అని తన కావ్యావేశానికి కారణం వివరించుకున్నాడు. ఈఖండ కావ్య సంపుటిలో గాంధీజీ మరణించిన సమయంలో వ్రాసిన "**అమరజ్యోతి**" అన్న కావ్య ఖండిక ఉదాత్తమైన రచన ఇంతటి ఆత్మాశ్రయత, భక్తి భావము, కమ్మని కవిత్వము కూడిన రచనలు తెలుగున బహు కొద్ది విశ్వనాథవారన్నట్లు "సీతారామమూర్తి చౌదరిగారు గాంధీజీ యొక్క సిద్ధాంతానుయాయి. ఇది వారి కవనమునకు పట్టుకొమ్మ. ఈ సిద్ధాంతము వారి సర్వకవిత్వమందును మణులలోని దారమువలె అనుస్యూతముగా వచ్చుచునేయుండును. ఇది వారికవితా సరస్వతికి జయపతాక "[39] ఈ భావమునే కవి స్వయంగా ఇలా చెప్పుకొన్నాడు:

"చేసిన సేవయు ద్యాగము
వీసమయగు గాని - కన్ను విచ్చిన పిదపన్
వ్రాసిన దంతయు నీ కథ
నీ సందేశంబ యని వినీతుడ నగుదున్"[40]

"**అమరజ్యోతి**"లో కవితావేశము దుఃఖానుభూతి మేళవింపబడి కవి హృదయ సాగరంలోని అనంత తరంగాలు ఒకదాని వెంట ఒకటి అక్షరరూపంలో మనముందు సాక్షాత్కరిస్తాయి. "విశ్వకల్యాణలబ్ధి కొరకు నాత్మార్పణ మొనర్చుకొను తపస్వి "విశ్వకల్యాణలబ్ధికొరకు నాత్మార్పణ మొనర్చుకొను తపస్వి ....దుర్మతోన్మాద కుటిలతంత్ర జుష్ట దుష్టచ్చటా మృత్యుముష్టి పాతికి" కూలిన విషాదగాథను భారత దేశంలోని అసంఖ్యాకములైన కవులవలె ఈయన గూడ ఒక కన్నీటి గాథగా వెలువరించారు. గాంధీజీని కృష్ణుడితో, బుద్ధుడితో, క్రీస్తుతో, అబ్రహాం లింకనుతో పోల్చి "మృతివిధిన్ వీరి ననుసరించితివి మహాత్మ" అని ఆక్రోశిస్తాడు. తన సాహసికముద్ర, సత్యాగ్రహము, జాతీయవిధి-వీనిద్వారా ప్రజలకు ఆత్మగౌరవము నేర్పాడట గాంధీ.

"బాపుజీ స్రష్టవీవు నీ చూపు సోకి
ద్రష్టలైనారు కొందరీ తరమువారు"[41]

అంటూ గాంధీ అనుయాయుల వారసత్వాన్ని ప్రశంసిస్తాడు కొంత సేపు

"నశ్వరమైన కాయము వినాయక ఘంస్తుడు కూల్చె గాని నీ
శాశ్వతమైన యాత్మ నెటు చంపగలండతండు"[42]

అంటూ తనకు తాను నచ్చచెప్పుకుంటాడు. కొంతసేపు బాపూ ! నీవు ఒరులు చేయలేని పనులు చేశావు. నీ ప్రాణమే బలిదానము చేశావు. "నీ బాటలో నిలువంజాలిన మానవుండెవడు గాంధీ ! ఖండ ఖండమ్ము లన్" అని తన నాయకుణ్ణి ప్రశంసిస్తాడు.

ఈయన వ్రాసిన తర్వాతి ఖండకావ్య సంపుటి "శబల". ఇందులో ఈయన తొలిరచనలు చాల ముద్రింపబడ్డాయి. ఖద్దరును గూర్చి అస్పృశ్యతనుగూర్చి వ్రాసిన ఖండికలతోబాటు ఇటీవల భావే పై వ్రాసిన ఖండికలు కూడా యిందులో వున్నాయి. ఇందులో వినోబాజీని గూర్చి చెప్పిన శీర్షిక "ఆతడు" అన్న తచ్ఛబ్దమును వాడి ఎంతో హృదయమ్మముగా ప్రశంసించినాడని విశ్వనాధవారి అభిప్రాయము.[43]

1962 మార్చి నెలలో ఆకాశవాణి ద్వారా ప్రసారితమైన "బంగారుభూమి" అన్న ఖండికలో సుబ్బయ్య, రామయ్య అనే ఇద్దరు మారుతున్న దేశాన్ని గూర్చి చర్చిస్తూ

".....లోపములు పెక్కు తీరెగాని
నీతినియమాలు దిగజారె జాతిలోన
పొలము పండిన జాలునా బుద్ధికూడ
బండవలయునుగదా"

అన్న ప్రశ్న వేసుకుంటారు. గాంధీజీ పల్లెలకు చేసిన సేవను ఒకమారు తలుచుకుంటారు.

"ఎంతకాలము తెల్లవాడేలలేదు ?
నాడు మనకిట్టి మేలు లొనగూడెనా ? మ
హాత్ముడౌ గాంధిగారి పుణ్యాన యుగయు
గాల పాపములన్నియు గూలికూలి
జానిసముత్రాడు తెగి పీడ వదలిపచ్చె
దేశమునకు స్వరాజ్యము, దిక్కుమొక్కు
లేని పల్లెల నొక పొంగు కానిపించె"[44].

తుమ్మలవారు ఇటీవల వ్రాసిన "సర్వోదయ గానము" అన్న ఖండకావ్యంలో గూడ గాంధీజీకి అనుంగు శిష్యుడైన వినోబాజీని గురించి ఎంతో అనుభూతితో ఉద్వేగంతో ప్రశంసించడం చూస్తే ఆయన కవిత్వ జీవిత ప్రారంభంనుంచీ ఈనాటి వరకు కూడా గాంధీజీ ఆశయాలనే నమ్మి వానిని దేశంలో నలుగురు తనతోబాటు పంచుకోవా లన్న ఆకాంక్షతో దీక్షతో వ్రాసినట్లు కనిపిస్తోంది. తుమ్మల తన్ను గురించి తాను చెప్పుకున్న మాటలు అక్షరాల నిజం :

"దేశముకొరకై బ్రతికి ధ
నాశలు దిగద్రావి ఎవ్వడంచిత ధర్మా
వేశుండగు కవి, యతడె ప్ర
జాశంసా పాత్రుడనుట సత్యంబయ్యేన్"[45].

### కరుణశ్రీ ఖండకావ్యాలు

ఆధునిక కవులలో రసార్ద్రమైన హృదయము, లలితమైన కావ్యశిల్పనా నైపుణ్యము కలసివున్న కవులు వ్రేళ్ళమీద లెక్కింప తగినంత మంది మాత్రమే వున్నారు. అట్టివారిలో "కరుణశ్రీ" అన్న గుప్తనామము కలిగిన జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు ప్రముఖులు. ఈయన కావ్యాలన్నీ కరుణరసాత్మకాలు. ఏది వ్రాసినా జాతి నుద్బోధిస్తూన్నట్లే వ్రాస్తాడు. లలితలలితమైన పదాల కూర్పు

ఈయన సొత్తు. ఒక శిల్పాన్ని మలుస్తూ ఎక్కడ ఏ గీత తప్పి పోతుందో అన్నంత జాగ్రత్తతో శిల్పాన్ని శిల్పి ఎలా నిర్మిస్తాడో అంత జాగ్రత్తగా మాటలు తూచితూచి ఏరి కూర్చి తన కవితా శిల్పాన్ని నిర్మిస్తాడు. "స్వాతంత్ర్య భారతి"కి విజయ గీతిక పాడుతూ

"లాఠీ పోటులు పూలచెండ్లు చెరసాలల్ పెండ్లివారిండ్లు ఏ
కాఠిన్యం బైనన్ సుఖానుభవమే, గాంధీ కళాశాలలో
పాఠంబుల్ పఠియించు శిష్యులకు"[46]

అంటాడు కవి. ఈ మొదటి ఖండికలలో "**మహాత్ముడు**" అన్న శీర్షిక క్రింద వ్రాసిన పద్యాలలో గాంధీజీని

"అతడొక పవిత్ర ధర్మ దేవాలయంబు"
"అతడొక విచిత్ర విశ్వవిద్యాలయంబు"
"అతడొక పెద్ద హిమాలయంబు"

అంటూ గాంధీజీకి జేజేలు పలుకుతాడు. "**ఉదయశ్రీ**"లోనే మరో మూడు శీర్షికలు గాంధీజీపైన, ఎనిమిది శీర్షికలు గాంధీజీ మరణం పైన వ్రాయబడ్డాయి. "**మా గాంధి తాత**", "**శాంతిదూత**" అన్న శీర్షికల్లో గాంధీజీ ప్రతిభావిశేషాలు ఉగ్గడించబడ్డాయి. గాంధీజీని కృష్ణుడుగాను, జవహర్‌లాల్‌ను అర్జునుడుగాను ఊహించి వర్ణించటం, ఈ కాలంలో కవులు చాలామంది చేసినట్లు కరుణశ్రీ కూడా చేశాడు.

"జవహరుడల్లదే విజయశంఖము నొత్తుచునుండె కేల గాం
డివము ధరించి, గంటలు ఘణిల్లున మ్రోగెను వీరభారతీ
భవనము ముందు పగ్గములు వట్టి ప్రజారథమిం కనాజవం
జవముగ త్రోలు మా విజయసారథివై విజయమ్ము సేయుమా."[47]

గాంధీజీ మరణానంతరము ఈయన వ్రాసిన ఖండికలు దేశం నలుమూలలా వ్యాపించిన కన్నీటి పొంగులకు కావ్యరూపము. "విషః

ఋణమ్ము" అన్న మరొక ఖండికలో గాంధీజీ హత్యచేయబడిన సమయంలో ప్రకృతి మనఃస్థాపాన్ని ఇలా చూపాడు కవి:

"ఉయ్యాలలో నూగుచున్న ముద్దుల బిడ్డ
లేచి కెవ్వున కేకవైచెనేమి?
పాకలో లేగకు పాలిచ్చు గోవు అం
బాయంచు గొంతెత్తి యఱచెనేమి?
జలజల ప్రవహించు జమున నిస్తబ్దయై
నిలచి కన్నుల నీరు నింపునేమి?
చకచక పొలము దున్నుకొని పోయెడి
రైతు నాగలి ముందుకు సాగదేమి?
కోటలో ఆరుగంటలు కొట్టబోవు
వాని హస్తాలు గడగడ వణకునేమి?
ఏ మహాత్ముని గుండెపై కెక్కి చనెనో
కాలపురుషుని రథ రథాంగములు నేడు"48

కరుణశ్రీ వ్రాసిన ఖండ కావ్యాలలో "**విజయశ్రీ**" "**కరుణశ్రీ**" అన్న రెండు ఖండకావ్యాలను గురించి మనం పరిశీలింపక తప్పదు. ఇందులో మొదటిది వీరకావ్యం. రెండవది కరుణ కావ్యం. వీరము, కరుణ విరుద్ధములైన రసాలు. అయినా ఈ విరుద్ధ రసాల సమ్మేళనంలోనే కవి బాపూజీని మానవుడికి ప్రతీకగా నిలబెడతాడు.

"**విజయశ్రీ**" కురుక్షేత్ర వీర కావ్యము. "అత డజాతశత్రుడు మహాత్ముడు శాంతి తపస్వి" అన్నపదాలు ప్రతిధ్వనించిన హృదయ స్పందనానికి ఈ కావ్యం రూపు కూర్చింది. వెనుక ఒక ఖండికలో గాంధీజీని కృష్ణుడితోను, నెహ్రూను అర్జునుడితోను పోల్చిన పోలిక ఇప్పట్ల సార్థకము. కవి దీనిని నర్మగర్భంగా సూచిస్తున్నాడు కూడా.

"ఒకప్రక్క స్వాతంత్ర్యకాంక్ష నాలుకలుచాచుకొని ఆవేశంతో అనర్గళంగా ముందుకు తోసుకొని వస్తుందని"

"పాంచాలిని పరాభవించటం కోసం పైకిలేచిన దుశ్శాసన హస్తాలు పైశాచిక ప్రభుత్వానికి ప్రత్యక్ష నిదర్శనంగా నిలిచిపోయి నయ్" అని

"అడుగో భారత వీరుడు పార్థుడు గాండీవాన్ని ఎక్కుపెడుతున్నాడు. మహాత్ముడు మధుసూదనుడు అశ్వాన్ని అదలిస్తున్నాడు"49 అని వ్రాయటంవల్ల కవి విజయశ్రీ కావ్యాన్ని ఆధునిక "భారత విజయశ్రీ" కావ్యంగా రూపొందించారని తేలుతున్నది. ఇందులో కృష్ణునిపాత్రను జాగ్రత్తగాగమనిస్తే అది మహాత్మునికిమారురూపమే. పాపయ్యశాస్త్రిగారు ఒక ప్రక్క భారత కథను వ్రాస్తూనే ప్రక్క ప్రక్కనే 'భారతీయ' కథను కూడా నడిపించి "**విజయశ్రీ**"కావ్యాన్ని ద్వ్యర్థికావ్యంగా స్ఫురింపజేశారు.

కరుణశ్రీ రచించిన "**కరుణశ్రీ**" కావ్యము కారుణ్యవాదానికి మేలిబంతి. కవి తన నివేదనంలో "బుద్ధ భగవానుడు, క్రీస్తు ప్రభువు, గాంధీ మహాత్ముడు అంధకార బంధురమైన ప్రపంచంలో అహింసా జ్యోతి వెలిగించిన అమరమూర్తులీ ముగ్గురు" అని కరుణాత్మకమైన బుద్ధుని జీవితము తనకు ఆదర్శజ్యోతి అయిందంటాడు. అయిదు భాగాలుగా వ్రాయతలపెట్టిన బుద్ధ జీవితంలో ఇది మొదటి భాగము. ఇందులోని బుద్ధుని అహింసావాదము తర్వాత తర్వాత గాంధీజీ గ్రహించాడని కవి ఉద్దేశ్యము. అందువల్లనే దీనిని "పూజ్య బాపూజీ పుణ్య స్మృతికి" అంకితం చేయడం ఎంతైనా సముచితంగా వుంది. ఈ కావ్యాలన్నింటిలోను పాపయ్యశాస్త్రిగారు బుద్ధ, గాంధీల దయార్ద్ర హృదయాన్ని కారుణ్య భావాన్ని శ్లాఘించారు. దానికి కారణం

కరుణామయి కవికి ఆరాధ్య దైవం కావటమే. అందువల్లనే గాంధీజీ అహింసావాదము ఈయనపై ప్రబలమైన ప్రభావాన్ని చూపింది.

**దాశరథి ఖండకావ్యాలు**

"దాశరథి" తెలంగాణ సాహిత్య సీమలో క్రొత్త పుంతలు త్రొక్కి కొత్త పొలాలు పండించిన ఉత్తమ సాహిత్య కర్షకుడు. ఈయన వ్రాసిన ఖండికలలో "క్షమామూర్తి" అన్న శీర్షికతో వ్రాయబడిన పద్యాలన్నీ మణిపూసలు.

"భారతీయుల కాయువుపట్టువోలె
బుద్ధదేవుని పర్యాయమూర్తి యగుచు
హిమగిరి శిఖరాగ్రమె చేతులెత్తి నడచి
నటుల తోచు గాంధీమూర్తి నర్చసేతు."50

గాంధీజీని అందరివలెనే క్రీస్తుతో, బుద్ధుడితో పోల్చడంతో ఆపక కృష్ణుడితో కూడా పోల్చాడు. కాని ఆ పోలిక వారి జీవితాలతో కాక వారి మరణాలతో;

"క్రీస్తువలె ఆపదంబుజ
మస్తము రక్తాన మునుగ మానవ హృదయాం
తస్త క్రౌర్యపు దాడికి
అస్తంగతుడయ్యె కృష్ణుడటు వ్యాధునిచే"51

ప్రపంచంలోని అందరు మత ప్రవక్తలతోను పోల్చి గాంధీజీ కూడ వారివలె ఒక నూతన మతానికి ప్రవక్త అంటూ సూచిస్తాడు దాశరథి.

"క్రీస్తై, బుద్ధుడునై మహమ్మదయి
మూకీభూత దీన ప్రజా
మస్తంబందు కరంబునుంచి అభయం
బందించి అజ్ఞానతా

గ్రస్తంబైన జగంబు జ్ఞాన రుచితో
లాలించి పాలోపరి
న్యస్తాంభోజ కరాల నవ్వెడి కరంచం
దున్ స్తుతిన్ జేసెదన్."[52]

దాశరథి "మహాబోధి" అన్న కావ్యం పైనపేర్కొన్న బుద్ధ కావ్యాలకు దేనికీ తీసిపో యిందికాదు. వస్తుగావ రచనలలో ఈ కావ్యం చాలవరకు సంప్రదాయ పథంలోనే నడచినా,[53] బుద్ధుని జాతక గాథలను స్వీకరించినా, భావశబలతలో ఏ ఉత్తమ ఆధునిక ఖండకావ్యానికీ తీసిపోని రచన.

**ఇతర ఖండికలు**

ఇప్పుడు ఏ ఖండకావ్య సంపుటిలోనూ వెలువడని కొన్ని ఖండికలను గురించి పరిశీలిద్దాం.[54]

గాంధీజీపై కవితా ఖండికలను వెలయించిన వారిని గురించి పరిశీలించేటప్పుడు చెళ్లపిళ్ల వారిని మరిచిపోకూడదు ఆయన గాంధీజీని "ఈ కాలపు ఋషి" అని చిత్రించడంలో సార్వజనీనమైన ఒక సత్యానికి కావ్యత్వాన్ని ఆపాదించారు.

ఆతడవధూత మార్గమ్ము ననుకరించు
నదియె బోధించు నితరుల కలవియగునె ?
గేస్తులకు దాని తత్వమ్ము, కేవల మొక
గాంధికే చెల్లె నాత డీ కాలపు ఋషి.

తాము చాదస్తం లేని కవిత్వం వ్రాసి ప్రజలకు దగ్గరగా కవిత్వాన్ని తీసుకొని వెళ్ళినట్లుగానె గాంధీజీ చాదస్తంలేని రాజకీయ నేతృత్వం నిర్వహించాడంటారు. "అమ్మనీషి విధ్వస్త సమస్త భిన్నమత వర్తనుడు" అనీ, "ఆస్తికుడయ్యు, గాంధి నాస్తికు భంగిని దోచుచుండు" ననీ, ఆయన గుణగణాలను పొగిడి "గాంధిమహాత్ముకుండనగ గారణ జన్ముడు" అంటారు.

గాంధీజీ సిద్ధాంతాలచేత, వ్యక్తిత్వంచేత ఎంతగానో ప్రభావితులైన కవుల్లో శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, వేంకట పార్వతీశ

కవులు, విశ్వనాథ వంటి వారెందరో వున్నారు శ్రీపాదవారు తిలక్, గాంధీలమీద నాటకాలు వ్రాయడమే కాక, ఆ యా సందర్భాలలో గాంధీజీ నిర్మాణ కార్యక్రమాలమీద కూడా పద్యాలు వ్రాశారు. దేశంలోని ఆబాలగోపాలం అవతారమూర్తి అయిన గాంధీజీని ఎలా కొలిచింది వివరంగా వర్ణించారు శ్రీపాదవారు.

నిద్రపోతున్న జాతిని మేల్కొలిపిన వైతాళికునిగా గాంధీజీని చిత్రించారు విశ్వనాథ. విశ్వనాథలో అంతర్భూతమైన గడుసుదన మంతా, వ్యంగ్యమంతా యీయన గాంధీజీపై వ్రాసిన ఖండికలలో కన్పిస్తుంది. సుతిమెత్తని వ్యంగ్యం, గాంధీజీ వ్యక్తిత్వాన్ని, గుణ గణాలను ఆరాధించి, వ్యక్తి ఆరాధనను విమర్శించే ధైర్యం -- ఇవి ఆయన ఖండికలలో మనకు గోచరిస్తాయి.

ఒకనా డీతడు దేశా
నికి మేలుం జేసిపెట్టి నిద్రాగతి గూ
రుకు పొందుచు నుండిన వా
రికి మెలకువ తెచ్చెఁ గొందఱికి దయ కలిమిన్.

ఈ నాటివారు కొందరు నిద్రపోతూ కూడా గాంధీ నామమే స్మరిస్తా రట -- "అందులో గూడ లాభమున్నట్లు చూచి." ఈ నాటి నిజాన్ని బయలుపరచి చివరకు

"ఒక జయంతి చేయుటకంటె నొక్కమాట
నిజము పలుకుట మేలు"

అన్న హితబోధ చేస్తాడు. దానివలన ఆత్మ పునీతం కావడమేకాదు. గాంధి మొదలుకొని వెనుక వెనుకకు పోగా హరిహరులు కూడా ఒక్క నిజం ధైర్యంగా చెప్పగలిగితే సంతసిస్తారంటాడు. నిజం చెబితే

"గుండియ పవిత్ర
మగును గాంధియు బుద్ధుడు హరిహరులును
సంతసింతురు జీవుని సంస్కృతికిని."

నాళము కృష్ణారావుగారు "*మధురకవి*". ఆయన గాంధీజీపై వ్రాసిన పద్యాలు – నిడివికి కొద్దివే అయినా మధుర భావ స్ఫోరకాలు. "భువన 'మోహన'మైన నీ ముద్దు పేరు" అంటూ 'మోహన' శబ్దంపైద శ్లేషించి,

సర్వసారస్వత ప్రపంచంబునందు
'గాంధి' యనియెడి వర్ణయుగంబుతోడ
సాటివచ్చెడు వేఱొక్క మాటగలదె
మార్దవంబున, మధురిమ, మంజులతను !

అంటూ ఆయన నామ మాహాత్మ్యాన్ని కొనియాడారు. "బాపు అను పేరు వీనుల బడినయంత, నిలువునను నాదు మేనెల్ల పులకరించున"ని అందరు భక్తులు పరమోత్కృష్టమైన దశలో చాటుకొనే అనుభవాన్ని ఆత్మపరంగా చెప్పుకొన్నారు.

మాధవపెద్ది బుచ్చిసుందర రామశాస్త్రి వ్యుత్పన్నుడైన కవి. ఆయన గాంధీజీని "ఆర్తరక్షామణీ!" అంటూ సంబోధించి ఆయన మహిమను కొనియాడాడు. ఈయన గాంధీజీ యెడ ప్రయుక్తం చేసిన విశేషణాలు సత్యములు. అతిశయోక్తులు కానివి. కవి ప్రతిభ చేత గాంధీజీ పరమోత్కృష్టుడైన భగవత్స్వరూపుడుగా చూపబడ్డాడు యీాయన కవితా ఖండికలలో.

ఇటీవల శతజయంతి కోసం కవితలు వ్రాసిన కవులలో ఆచార్య దివాకర్ల వేంకటావధాని, నాయని సుబ్బారావు, దాశరథి, వేదుల గారల పద్యకవిత, వరవరరావు, మాదిరాజు రంగారావు, కుందుర్తి, కాళోజీ మొదలైనవారి గేయకవిత మెచ్చుకోదగ్గవి.

"భరత భూమికి స్వాతంత్ర్య వరమొసగి" నందువల్ల "భవదీయ పుణ్యజన్మమహ మగును చైత్రనవమియు శ్రావణాష్టమియు మాకు"

అంటూ దేశం నిన్ను కలకాలం గుర్తుంచుకొని పూజలు సలుపుతూనే వుంటుందన్న ఆశాభావాన్ని వ్యక్తం చేశారు డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు.

గాంధీజీలో విభిన్నమైన శక్తుల 'మేలుకలయిక' ఎలాజరిగిందో వర్ణించిన కవులు ఎందరో వున్నారు. "కత్తులులేవు, గాండివముల్ మొదలే పులకిక్క" అన్న దామరాజువారి పద్యంలోను, "ఉపకార వహ్నిచే అపకారి గుండెల బూదిసేయు" నన్న దాశరథి మాటలలోను "అతడు సామాన్యవ్యక్తి అతడసామాన్య వ్యక్తి" అన్న శ్రీశ్రీ గేయంలోను యీ విధానమే అనుసరించబడ్డది.

హింస నంటక రణము జయించు యోద్ధ
స్వార్థ మెరుగని సంపన్న వైశ్య వరుడు
మతము గల్గియు సర్వసమ్మత వివేకి
చావుచే చిక్కిపోయిన దేవుడతడు

అన్నారు డాక్టర్ రామరాజు గారు.

శ్రీ వేలూరిపాటి అనంతరామయ్య వ్రాసిన "గాంధీ ఉదాహరణము" ప్రత్యేకంగా ఎన్నిక చేయదగిన రచన. ఇది ఉదాహరణ వాఙ్మయంలో చేరే రచన. "ఉదాహరణం" అన్నది ఒక కవితా ప్రక్రియ. ఇందులో ప్రథమావిభక్తితో ప్రారంభించి, అన్ని విభక్తుల తోను ఒక్కొక్క పద్యం, ప్రతి పద్యం తరువాత ఒక కళిక, ఉత్కళిక ఉంటాయి. చివరకు సార్వవిభక్తము అన్న అన్ని విభక్తులతో కూడిన పద్యం ఒకటి, అంకితాంక పద్యం ఒకటి వుంటాయి. ఇది ముఖ్యంగా ఏదో ఒక వ్యక్తిని సంబోధించి, స్తుతిస్తూ వ్రాయబడే రచన. ఈ ఖండికలోని అంకితాంక పద్యంలో కవి

ధరగల యెల్ల భాషలవిధంబున దెల్గున సర్వకావ్య భే
ద రచితమైన నీ గుణవితానము మాకె విశిష్టమౌ నుదా
హరణము రూపమందమి ననంతుడు నాకొఱ దీర్చ జేతుసే
హరువున గూర్చనందుదె యుపాయన మీ శతవత్సరోద్గృతిన్ ?

అంటూ యీ శతజయంతి సంవత్సరంలో తనదైన ఉపాయనం సమర్పించాడు గాంధీజీకి.

గాంధీజీ మరణానికి దేశం అంతా విలపించింది ఉద్విగ్నులైన కవులు కూడా కవితాశ్రువులు రాల్చారు. గాంధీజీ చనిపోయినప్పుడు వ్రాయబడినన్ని ఖండికలు, శతకాలు మరి యే ఇతర నాయకుడు చనిపోయినప్పుడు కాని వ్రాయబడలేదు. బహుశః ఇది మరే దేశంలోను యింత విలాప కావ్యసాహిత్యం – ఒకే సంఘటనను ఆలంబనంగా చేసుకొని సృష్టింపబడలేదనుకొంటాను.

ఈ ఖండికల ద్వారా తమ సంతాపాన్ని వెలిబుచ్చినవారిలో ప్రాచీన సంప్రదాయం తెలిసిన పండితకవు లున్నారు. కేవలం ఉద్వేగం ఆపుకోలేని భక్తకవు లున్నారు. అత్యాధునిక కవులున్నారు. కొండా వెంకటప్పయ్య పంతులుగారు 'దేహామర్పించె శాంతికై ధీరుడతడు' అందువల్ల ఆయనకు 'దీపపూజ' చేస్తున్నా మన్నారు.

వేలూరి శివరామశాస్త్రిగారు పితృహత్య గావించిన గోడ్సేను విమర్శిస్తూ దాని వలన సర్వ ప్రజాసమూహంలో కానవచ్చిన విచారభారాన్ని వర్ణించారు. అంతేకాక ఈ తరుణంలో గాంధీజీ గుణగణాలను కూడా అభివర్ణించారు. విశ్వమానవ కల్యాణం కోసం పాటుపడిన నీవు "స్వజాతి కోటిలో వాని తుపాకి గుండు" తో మరణించడం ఆ భగవానుని లీలలలోని రహస్యం అంటారు. "అవతారంబు సమాప్తి చెందినది" అని వాపోతూ "నీదు నవ్వులు పండు

వెన్నెలల యందు, నీదు పలుకులు హృద్గుహా నిలయమందు" చూస్తూనే ఉంటామన్న ఆశతో తమ ఖండికను ముగిస్తారు వేలూరివారు.

ఈ సందర్భంలోనే వ్రాయబడిన చెళ్లపిళ్ల దుర్గేశ్వరశాస్త్రిగారి "అశ్రుతర్పణం" నుంచి ఖండిక. "పిడుగువంటి వార్త వినిపించె - నెవడురా గాంధిదేవు జంపగలిగినవాడు - అంటూ ఎంతో కోపంతో కూడిన బాధతో ప్రారంభించి "ఏడుపు రాక మానదవి యేడ్చి యేమి ప్రయోజనమ్ము?" అని తన్ను తాను సంబాళించుకొని గాంధీజీ 'ప్రాణదీపాన్ని' వర్ణించారు శాస్త్రిగారు.

మొండితనమ్ములోన - కొడివోని యహింసను వత్తిజేసి - బ్ర
హ్మాండపు - సత్యపుంబ్రమిదెయందున నిర్మల శాంతితైలమున్
నిండుగబోసి సర్వధరణీ తమమున్ విడజిల్చు - ఆసియా
ఖండపు జ్యోతి యాఱినది గాంధిమహాత్ముని ప్రాణదీపమై.

ఇలా సంతాపం వెలిబుచ్చిన కవులెందరో ఉన్నారు. శ్రీ ఏటుకూరి వెంకటనర్సయ్య, జాస్తి వెంకటనర్సయ్య, జంధ్యాల పాపయ్యశాస్త్రి, నండూరి రామకృష్ణమాచార్య, ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి వంటి కవులందరూ ఉత్తమ కవితను వెలయించినవారే !

ఇక గాంధీజీ మరణానంతరం నుంచి నేటివరకు వ్రాయబడిన ఖండికలలో ఎక్కువ భాగం గాంధీజీ కాలంలో కన్న కలలకూ యీనాడు మనముందు వ్యక్తమౌతున్న సత్యానికి గల తారతమ్యాన్ని చూపే కవితలే ఎక్కువ. అటు ఆ రోజులను గాంధీజీని అతి సన్నిహితంగా ఎరిగిన కవులూ, ఇటు గాంధీజీని చూడకుండా కూడా ఆయనను గురించి విని, ఆయన భావించిన రామరాజ్యాన్ని ఊహించుకొని దాని ధ్వనంలో ఈనాడు ఉన్న స్థితిగతులను విమర్శించే ఆధునిక యువకులూ వున్నారు.

కొడాలి ఆంజనేయులుగారు తమ ఖండికలో ఆనాటి మహాత్ముని సందేశాలకు యీనాడు అవి ఆచరింపబడుతున్న విధానాలకు గల అంతరాన్ని ఎంతో వ్యంగ్యపూరితంగా వర్ణించారు. "ఖాదీ గట్టిన వాని పుణ్యచరితుంగా నెంచి రానాడు, నేడేదో పాపముచేసిన ట్లతని నిందింప గతంబేమి ?" అనీ "ఊహాపోహాలు లేక వట్టి అధికారోన్మత్తులం జేరి దాసోహమ్మంచు భజించు టొక్కటియె దేశారాధనంబయ్యె" ననీ తమ బాధను వెలిబుచ్చారు.

ఇంతకన్న ప్రత్యక్షంగానే విమర్శించారు శ్రీ అంబటిపూడి వెంకటరత్నం.

"భువి విడనాడి పోతివి తపోమహితా భవదీయ నామమున్
జవనిక ముందు బెట్టుకొని స్వార్థపరుల్ పదవీ ధనాశలన్
దవిలి మహా వినాశములు ధారుణి గూర్చెడి దొంగశిష్యులై
భువి నొనగూర్చు ఘోరముల ముమ్మరమున్, భరియింపకుంటివే"

అంటూ "ఖద్దరు వేషధారుల" నాటకాన్ని గుర్తించి నిశితంగా విమర్శించారు.

శ్రీ దామరాజు పుండరీకాక్షుడు వ్రాసిన "ఇదా స్వారాజ్యం" అన్న ఖండకావ్యమంతా యిట్టి నిశిత విమర్శలతోనే నిండి ఉంది. ఇలాంటి వ్యత్యాసాలను చూపడంలో గేయకవులు చూపిన అభ్యుదయ పద్ధతిని వచ్చే అధ్యాయంలో పరిశీలించడం జరుగుతుంది.

### ఇతర కవులు

గాంధీజీని గురించి చిన్నచిన్న ఖండికలు ఖండకావ్యాలు వ్రాసిన కవులు లెక్కకు మిక్కిలి వున్నారు. వారిలో పేర్కొనతగిన వారి కవితలూ వున్నాయి ఎన్నో. స్థాలీపులకన్యాయంగా మరికొన్ని ఖండికలను ఈ క్రింద పేర్కొంటున్నాను.

శ్రీ బూదురు రామానుజులరెడ్డి గొప్ప దేశసేవకుడు. కవిత్వం మీద ఆయన కెంత పక్షపాతమో దేశసేవ మీద కూడా ఆయనకల్లే. ఆయన "పూలదండ" ధారాశుద్ధి గల కవిత్వాన్ని ప్రయోజనాత్మకమైన పద్ధతిద్వారా దేశసేవకు వినియోగించిన ఖండికల సంపుటి.

శ్రీ వానమామలై వరదాచార్యులు పండిత కవి. చెప్పదలచుకొన్నది సూటిగా ఘాటుగా చెప్పగల్గినవాడు. ఆయన గాంధీమీద గాంధీజీ సిద్ధాంతాలమీద ఎన్నో ఖండికలను వ్రాశారు. "*కర్మ చంద్రుడు గంధి*" అన్న ఖండికలో

"ఒక్క నాలుకగల నీదు నిక్కపు కథ
కలమదెటు వ్రాయు రెండు నాల్కల మొగాన"

అంటూ ప్రారంభించి హరిజనులకు ఆయన చేసిన సేవను ప్రస్తుతించి ఆయన దేశంలో భారతీయుల కష్టాలను బాపటానికి మరొక అవతారం దాల్చిన విష్ణుమూర్తిగా ఊహిస్తాడు.

"దివినె కలడో భారతీయ భాగ్యవిధాత
యని హిమాలయ హస్తమంటి మఱియు
రత్నాకరంబునుండి రాడుగదాయని
జాహ్నవిన్ గొంగుగా జాపి యురక
వడికెడి భారతావని నుద్ధరింపగ
సర్వాత్మకుడె ఎదం జాలినొంది
రాటంబు చక్రంబు రహి మీరగా సుద
ర్శన మొచు గుడి హస్తమున వెలుంగ
.........................
నవతరించె సత్యాహింస లాత్మగాగ
శాంతరూపాన నిల గర్మచంద్రుడగుచు"[55]

గాంధీజీ నిర్యాణము తిరిగి తెలుగు కవులలో ఒక వినూత్నమైన సంచలనాన్ని కలుగజేసింది. అంతవరకు గాంధీజీ ఆశయాలను వస్తువుగా స్వీకరించి కావ్యాలు వ్రాయడం జరిగినా ఏ దుర్ముహూర్తాన మహాత్ముడు బలి అయినాడో ఆనాటినుంచీ, దాదాపు పది సంవత్సరాల వరకు గాంధీజీపై వచ్చిన సాహిత్యం అంతా ఆయన అవతార తత్త్వాన్ని వూహించి ఆయన మరణంవల్ల భారతీయులు ఎంతటి అనాథలైనారో తెలియచెప్పే కవిత్వాలే. ఇట్టి వాటిలో జ్ఞానానంద కవి వ్రాసిన "*గాంధి*" (అమర గీత) ఒకటి (1950). "స్వేచ్ఛాసమర ప్రాంగణమున హింసాఖడ్గము పట్టి శాంతిభేరి మ్రోగించిన... జగద్విఖ్యాతకరుండగు గాంధీ రాజర్షి హఠాన్మరణము విని పరితాపము నాపుకోలేక వెలార్చిన భావాశ్రుకణ బిందు సందోహ మీయమర గీత"56

సాంప్రదాయిక కవితా మార్గాన్ని అనుసరించి పటిష్ఠమైన రచన చేయగలవాడు జ్ఞానానందకవి. మనసులోని ఆవేశం వెల్లుబకగా గోడ్సేను ప్రశ్నిస్తాడు కవి.

"పోనీ నీ వనుకొన్న రీతిని మహాపూజ్యుండు శ్రీబాపుజీ
పోనీగాని వినాయకా! సమసెనే పోట్లాట స్నేహంబదే
మైనన్ గల్గెనే భిన్న భిన్న మత విద్యా సంస్థలందిప్డు నీ
ప్రాణం బింతకు గాచెనే? మతము చెప్పన్ సిగ్గుచేటే గదా!"

గాంధీజీ ప్రశంసల్లో గూడ అంతే శక్తివంతమైన రచన చేశాడు కవి.

"జగతీ చక్రము సన్నుతింపగ నహింసా ఖడ్గరాజంబు గే
ల్దగ మన్నించి పరాయి గర్భముల నిద్రంబోయి యస్వేచ్ఛపుం
బొగలందూరు పవిత్ర భారతి యశంబుందేల రాటాన నీ

దగు శారీరము ధారపోసితివి గాదా! గాంధి మున్యగ్రణీ" అంటూ నతులు సలుపుతాడు.

ఈ సందర్భంలో వచ్చిన ఖండకావ్యాలలో పేర్కొనతగినది పుట్టపర్తి నారాయణాచార్యులు, వారి శ్రీమతి కనకమ్మగారలు వ్రాసిన "*గాంధీజీ మహా ప్రస్థానము*" అన్నది పేర్కొనదగిన రచన. "ఆ గతించిన మహనీయమణికి ఒక కావ్యంకాదు — వేయి వ్రాసినా చంద్రునికి నూలుపోగే అవుతుంది. ఇందులో "**మొదటి మజిలీ**" శ్రీమతి కనకమ్మగారి రచన. ఇందులో అన్నీ గీత పద్యాలు చక్కని భావాన్ని సూటిగా నీటుగా చెప్పగల కవిత్వం యీమెది.

"ఒక్క బుద్ధునితో భారతోర్వి వేయి
వత్సరంబులు మానవత్వము ధరించె
ఇంక జీవింపదేమి వేయేసి వత్స
రాలు నవయుగ బుద్ధు తీవ్రంబుతపసు"

దేశప్రజలమీద ఆమెకున్న అనుమానాన్నంతా ఈ గీతికలో అన్యాపదేశంగా చెప్పింది.

"నేడు మరునాడు కొన్ని కన్నీరు విడిచి
మరచిపోరాదు సముదితాత్మలను మనము
వారు చూపిన వెల్గులబాట నడచి
దివ్యభూమిగా దేశంబు దిద్దవలయు."

రెండవ మజిలీ శ్రీ నారాయణాచార్యులవారిది. ఇందులో "హే గాంధి దేవా", "బాపూ" అన్న రెండు శీర్షికలున్నాయి. ముందు "హే గాంధి దేవా! శిశిరీకురులోచనంమే" అన్న మకుటంతో శ్లోకాలు వ్రాశారు. ఇవి సుప్రభాతాలలో భగవంతుడికి పట్టే నీరాజనంలా తోస్తాయి.

"సాయం ప్రఫుల్ల నవకుంద సమాన హాస
రోచిస్సుధా స్నపిత మంధర కమ్రమూర్తే
నిర్వాణలోక తరుణారుణ! దీనబంధో!
హే గాంధిదేవా............".

వీని తర్వాత కొన్ని గేయాలు కూడా వ్రాయబడ్డాయి.[58]

ఈ మజిలీలోని రెండవ శీర్షిక "బాపు". ఇందులో పుట్టపర్తి వారి కవితావేశము మనకు ద్యోతకమవుతుంది. "నలువదికోట్ల తండ్రి! చనినావా" అంటూ వ్రాసిన పద్యాలు నలువదికోట్ల భారతీయులు ఆయన మరణం పట్ల పొందిన సంతాపాన్ని కావ్యరూపంలో చెప్పినట్లు తోస్తాయి.

"ఎంతో చెప్పుదమన్న యూహా కలదోయి!
చిత్రమే భావమొ
యంతఃస్రోతసి నడ్డుకట్టినద"

అంటూ ప్రారంభించి

"లోలోననే చింతావీణ నందించుచున్నయది—
నిర్జీవంబులే రాగముల్"

అంటూ తన అశక్తతను, బాధను వెలిబుచ్చుతాడు. ఈ బాధల అంచున గాంధీజీ వంటి మహత్తరమైన వ్యక్తి ఈ దేశాన జన్మించడం పవిత్రంగా భావిస్తాడు. గాంధీజీని అజరామరుడ వంటాడు.

"చావుపుట్టుకలే ప్రపంచంబు - దాని
కెంత విలపించినా లాభ మింతలేదు
బ్రతికి చచ్చినవారు కోల్లలకు గలరు
చచ్చి బ్రతికినవారు నిజాని కొకరు"

అన్న మాట గాంధీజీ ఎడ ఎంతైనా నిజం.

వీరుగాక జాస్తి వెంకటనరసయ్య, పటుకూరి వెంకటనరసయ్య, కుసుమ ధర్మన్నకవి మొదలగువారి ఖండకావ్య కృతులలో ఎన్నో గాంధీజీ పైన ఆయన సిద్ధాంతాలైన అస్పృశ్యత, ఖద్దరు ధారణ వంటి విషయాలపైన ఎన్నో ఖండికలు కానవస్తాయి. వీని అన్నింటిలోను కావ్యరచనా చమత్కారంతో పాటు, గాంధీజీపై భక్తిప్రపత్తులు కానవస్తాయి.

ప్రత్యేకమైన ఖండికలు మాత్రమే వ్రాసినవారు అసంఖ్యాకము వారిని గూర్చి పేర్కొనడం వారి రచనలను గూర్చి చర్చించడం బృహత్ప్రయత్నమే.[59] అయినా ముఖ్యమైన కొన్నిటిని యిక్కడ ప్రస్తావిస్తాను.

1921 లోనే జంధ్యాల అయ్యవారు శాస్త్రిగారు వ్రాసిన "దేశభక్తుడు" అన్న ఖండకృతిలో ముఖ్యంగా కొండా వేంకటప్పయ్య గారి ప్రశంసలే వున్నా గాంధీజీ ప్రశంస లేకుండా మరి యే యితర దేశభక్తుని ప్రశంస కూడా వుండదు. ఇందులో గాంధీజీపై మూడు పద్యాలు వ్రాయబడ్డాయి. జాతీయోద్యమ ప్రథమ దినాల్లో వ్రాయ బడడం వల్ల ఆ పద్యాలలో ఒకదానిని యిక్కడ పేర్కొనటం జరుగుతున్నది.

"సురలన్ జెంగట దైత్యబృంద మొకచో శోభిల్లగా జేసి తా
పరమోత్కృష్ట సుధాన్వితంబయిన సత్పాత్రంబు చేబూని స
త్వరతన్ నిర్జనకోటినిం దనిపి దైత్యశ్రేణి కంపింప నం
బరవీథిన్ వడి నేగు మోహనస్వరూపా ! గాంధి కేల్మోడ్చెదన్."

శ్రీ గాంధిమహాత్ముడు (1931) అన్న పేరుతో శ్రీ ఆది పూడి సోమనాథరావు వ్రాసిన ఖండికలు కూడా యిప్పట్లో పేర్కొన వలసినవే !

"వందిమాగధ పాఠక ప్రతతిలేదు
తనువుపై గవచాదులు దాల్పలేదు
ఆయుధముబట్టి యెఱుగడు హస్తమందు
.................................
అఖిల సద్గుణకంధి మహాత్మగాంధి."

ఈ ఖండికలలో మిగిలినవి "శాంతిసమరము" (1930), "గాంధి యిర్వినుల ఒడంబడిక" (5-3-1931). "మహాత్ముని సందేశ సుభాషితములు" అన్న విషయాల ప్రస్తావన కూడ వున్నది.

1948 లో కోటసోదరకవులు వ్రాసిన "*గాంధితాత*" అన్న ఖండకావ్యం 64 కంద పద్యాలతో కూడినది. గాంధీజీ చనిపోయిన వెంటనే వ్రాయబడ్డ వీ పద్యాలు :

భారత భాగ్య విధాతా !
వారిధి గంభీర ! రాజవై భవ ! దేశో
ద్ధారక ! మా వందనమిదె !
కారుణ్యాసమేత ! నేత ! గాంధీ తాతా !

"***గాంధీజీ పాదధూళి***" అన్న లఘుకావ్యం (1959) లో పిళ్ళా వేంకటరత్నకవిగారు గాంధీజీ సాహచర్యంతో ఒకానొక కోటీశునిలో కలిగిన హృదయ పరివర్తనాన్ని కథావస్తువుగా గ్రహించి వ్రాశారు. ఈ గ్రంథంలో పద్యాల మధ్య గేయాలు కూర్చారు.

ఇవిగాక "***పరంజ్యోతి***" "***స్వారాజ్యోదయము***" వంటి ఖండ కావ్యాలలో నేమి, విడిగా పత్రికలలో నేమి పరశ్శతంగా గాంధీజీపై ఖండికలు వెలువడ్డాయి.

ముఖ్యంగా కుందుర్తి ఆంజనేయులు వంటి ఆధునికులు కూడా యీ విషయంపై ఖండికలు వ్రాశారు. అవి వచన గీతాలు గనుక

6

వానిని *"గేయాలు—పాటలు"* అన్న శీర్షిక క్రింద పరామర్శించడం జరుగుతుంది.

ఈ సందర్భంలో పేర్కొనదగిన యితర రచనలలో శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు వ్రాసిన *"స్వారాజ్యోదయము"* అన్న కావ్యంలో గాంధీజీని గూర్చి వ్రాసిన పద్యాలు "అవతారమూర్తి యీ యనఘ మోహనదాసు కరమచందకు భక్తిగ నెడువారు" అంటూ ఆయనను ప్రజలు కీర్తించడాన్ని పేర్కొన్నారు శ్రీపాదవారు.

ప్రౌఢకవివతంసులు శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారి ఖండకావ్యాలయిన *"పౌలస్త్య హృదయము"*, *"గుడిగంటలు"* లో దేశభక్తిభావం ప్రచ్ఛన్నంగా వున్నదని, సి. నారాయణరెడ్డిగారి అభిప్రాయం.[60] ఇవిగాక కాటూరివారి ఖండికలలో రెండు గాంధీజీపై వ్రాయబడినవి వున్నాయి. అందులో ఒకటి *"గాంధీ ఉవాచ"* అన్నది. "గాంధిపలుకు ధర్మగంధ మొలుకు" అన్న మకుటంతో రెండు పద్యాలు :

"హరి సృజించె నరుని అచ్చమ్ము తనపోల్కి
నరుడు తన్నుబోల హరి సృజించె
ఇనుము వెండి జేయ నీశ్వరుండే నేర్చు
గాంధిపలుకు ధర్మగంధ మొలుకు".[61]

రెండవది *"అవభృథోత్సవము"* అన్న ఖండిక. 28-3-1931 నాడు గాంధీ-ఇర్విన్ ఒడంబడిక జరిగిన పిమ్మట వ్రాయబడిన ఖండిక యిది :

అల్పకాయమ్ము బోసి నవ్వంగ వస్త్ర
మూతకోలయు నౌచు నుట్టూతలూచె
చూడ్కిలోన త్రివిక్రము స్ఫూర్తిదాల్చి
మూడు జగములు నెవ్వడీ ముదుకతపసి !

అని గాంధీజీని ప్రశంసించి ఆయన వ్రేల్చిన యజ్ఞకుండాన సమిధలై దూకినవారందరికి కూడా అభినందనలు తెలుపుతాడు కవి.

"జన్మభూమిని ప్రేమింపజాల డెవడు
వాడు మఱి దేని ప్రేమించువాడుగాడు"

అంటూ జన్మభూమిని ప్రశంసించిన కాళ్ళకూరి నారాయణరావుగారు కేవలం నాటకాల ద్వారా మాత్రమే కాక, ఖండికల ద్వారా నవల ద్వారా కూడా జాతీయాభిమానాన్ని పురికొల్పారు. "*రుద్రమదేవి*" అన్న వారి నవల ఆంధ్రదేశానికి సంబంధించిన చరిత్రాత్మక నవలే అయినా భారతజాతీయోద్యమ ప్రభావితమైనదే!

ఇక ఖండికలలో "***జాతీయగీతము***"[62] అన్న పేరున వెలువడిన "చతుర్థాంధ్ర మహాజన సభాసముద్దిష్టము" ముఖ్యంగా ఆంధ్రుల ఔన్న త్యాన్ని గూర్చి గానం చేసినా గాంధీజీపై కూడ కొంత ప్రశంసను కలిగివుంది.

# 5

# గేయాలు - పాటలు

ఖండకావ్యము భావకవిత్వానికి ఎలా సాధనమైందో అలానే జాతీయ కవిత్వానికి గేయం ఆలంబనమైంది. జాతీయోద్యమం అనగానే కొంతలో కొంత ప్రచారపు పాలు కలిసివుండటం, ప్రచారానికి గేయం అత్యుత్తమ సాధనం కావటం, దీనికి కారణమై ఉండవచ్చు. గాంధీజీపై వ్రాయబడిన ఖండకావ్యాలే శతాధికంగా వున్నాయనుకుంటే ఆయనపై వచ్చిన గేయాలు-పాటలు సహస్రాధికంగా వున్నాయనవచ్చు. ఉదాత్తమైన కవిత్వం వ్రాసిన ఉత్తమ కవులదగ్గరనుంచి, జాతీయ భావాలు వెల్లుబికే ఆవేశమూర్తియైన సామాన్య పౌరుడి వరకు ప్రతివానికి గేయమో-పాటో వ్యక్తీకరణ సాధనంగా రూపొందింది. ఈ గేయాలను వ్రాసిన వారిలో చాలా మంది జైళ్లకు పోయినవారే. అట్టివారిలో బలిజేపల్లి లక్ష్మీకాంతకవి, గరిమెళ్ల సత్యనారాయణ. మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రివంటి ప్రముఖులున్నారు. జాతిపితను గూర్చిన గేయాలను గూర్చి పరామర్శిస్తున్నప్పుడు మొట్టమొదట జ్ఞప్తికి వచ్చే రచయిత శ్రీ గరిమెళ్ల సత్యనారాయణగారు. ఈయనకు పూర్వమే అయ్యంకి వెంకట

రమణయ్యగారి వంటి దేశభక్తులు గేయాలు రచించినా అప్పటికింకా ఉద్యమం ఉధృతం కాలేదు కనుక ఆ గేయాలకు రావలసినంత ప్రఖ్యాతి వచ్చినట్లు లేదు. శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణ 1921 లో వ్రాసిన "మా కొద్దీ తెల్లదొరతనము" అనే పాట ప్రతి యువకుడి నోటిలోను స్మరింపబడి ఆవేశపరచిన గేయం. ఈ తెల్లదొరల దమన నీతి, నిరంకుశత్వాన్ని ప్రబలంగా ఖండిస్తారు కవి :

"నూటనలుబదినాలుగు నోటికి తగిలించి
మాటలాడవద్దంటాడు; నుమ్ము
పాట పాడవద్దంటాడు;
టోపి
తీసి వీపున బాదుతాడు"

ఈయన వ్రాసిన "*స్వారాజ్య గీతములు*" రెండు, మూడు భాగములు కూడ ప్రసిద్ధములైనవే. ఇందులో కేవలము గాంధీజీని గురించే గాక—"సీమగుడ్డలు వీడి మీరిక క్షేమమందండి" అని విదేశ వస్తుబహిష్కారాన్ని బలపరుస్తాడు. ఈ పరదేశ వస్త్రాల వ్యామోహాన్ని నశింపజేయటానికి

"దాని నరకెడి ఖడ్గధార రాట్నమే"

అంటాడు. ఈ గేయ సంపుటులు మూడింటిలోను గరిమెళ్ళవారి దేశాభిమానం వ్యక్తమవుతుంది.

ఈయన వ్రాసిన ఈ పాట మూడు దశాబ్దాల పాటు జాతికి అతి ప్రియమైన గేయమైంది. "ఆంధ్రుల హృదయ క్షేత్రాలలో శాశ్వత స్థానం, ఆంధ్ర సారస్వతంలో మృతిరహితమైన పేరు సంపాదించుకున్నాడు... .. ధన్యజీవి! సమస్త ఆంధ్రుల జిహ్వాగ్రాలలో వున్న గీతానికి నిర్మాత! భావి ఆంధ్రులు గీత గోవింద కర్తనువలె నిరంతరం గానం చేస్తూవుంటారు"[1]

మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు కూడా గొప్ప ప్రచార గీతాలను వ్రాసినవాడే. తాను వ్రాసిన పాటలను స్వయంగా మధురమైన గళంతో పాడటం ఈయన ప్రత్యేకత.

"అంటరానివారెవరో కారు మా
వెంటరానివారె"

అన్న ఈయన వ్రాసిన చరణం చాలా కాలం కాంగ్రెసు సభల్లో పాడ బడింది.

గాంధీజీని గురించిన గేయాలు రాకముందే దేశభక్తిని గురించి స్వాతంత్ర్యోద్యమాన్ని గురించి ఎన్నో పద్యాలు వెలువడ్డ సంగతి వెనుకనే పేర్కొనబడ్డది. ఇట్టి గేయాలలో రాయప్రోలువారి దేశ భక్తి గేయము ప్రముఖమైంది; తెలుగు జాతి వున్నంతకాలం నిలిచేదీను.

"ఏ దేశమేగినా ఎందుకాలిడినా
నిలుపరా నీ జాతి నిండు గౌరవము"

అంటూ జాతి నుద్బోధిస్తూ వ్రాసిన ఈయన గేయం ప్రసిద్ధమైనది అలాగే గురజాడ అప్పారావు హరిజనులను గురించి

"మంచి యన్నది మాలయైతే మాలనేనగుదున్" (లవణరాజు కల) అన్న గేయం కూడా గాంధీజీ హరిజనోద్ధరణాన్ని ప్రారంభించక ముందే వ్రాయబడ్డది.

కొందరు కవులు గాంధీజీ ఎలుగెత్తి చాటిన హిందూ ముస్లిమ్ ఐక్యతను గూర్చి గానం చేశారు.

"మనసా నీ భాగ్యమేమందు
హిందూ మహమ్మదీయుల పొందు

ఘనతర ధైర్యము గల్గించు నాథుడు
గాంధి మహాత్ముడు కైదండ యైనాడు"[2]

ఈ సందర్భంలో పేర్కొనవలసినవే రెండు ముఖ్యమైన గేయాలున్నాయి. మొదటిది గాంధేయ సాహిత్యాన్ని గురించి నాటకాలు వ్రాసి అజరామరుడైన దామరాజు పుండరీకాక్షుడు గారిది. రెండవది కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారిది. దామరాజు వారిది కేవలం గాంధీజీని ప్రశంసించే గేయం. "గాంధీనామం మరువాం మరువాం" అన్న పల్లవితో వ్రాయబడిన దీ గేయం.

కవిరాజు "వీరగంధము" - "పిలుపు" అన్న రెండు పాటలు 1930 లో ఉప్పు సత్యాగ్రహము జరిగినప్పుడు వ్రాశారు. అప్పుడు ఆయన తెనాలి పురపాలక సంఘాని కధ్యక్షులుగా వుండేవారు. ఈ సత్యాగ్రహ సమరానికి కొన్ని వేల రూపాయలు విరాళంగా పోగుచేసి దానిని ఉన్నవ లక్ష్మీనారాయణగారి అధ్యక్షతన జరిగిన సభలో ఆయన నాయకత్వం వహిస్తున్న దళానికి ఈ గీతాలతో బాటు ఇచ్చినారని తెలుస్తున్నది."[3]

"వీరగంధము తెచ్చినారము
వీరుడెవ్వడో తెల్పుడీ!
పూసిపోదుము మెడను వైతుము
పూలదండలు భక్తితో"[4]

అన్న గేయంలో తెల్గు వారిని అభినందిస్తూ

"నడుము కట్టిన తెలుగు బాలుడు
వెనుక తిరుగం డెన్నడున్"[5]

అంటూ ఆంధ్రుల తరఫున దేశానికి హామీ వుంటాను. వీరిదే మరొక గేయం "పిలుపు". ఇది కూడా ఆ సందర్భంలో వ్రాసినదే :

"ఊరకుండీ యుండలేక
యూరువిడిచీ వచ్చినాము
పొట్ట కూడూ లేక కాదు
కాని డబ్బుకొరకు కాదు
పేరుకోసరంబు గాదు
పేరు పెన్మికొరకు గాదు
ప్రాలుమాలక బద్ధకింపక
యాలకింపుడు తెలియబరతుము"

అంటూ పికెటింగ్ చేయుటానికి గల కారణాలను వివరిస్తాడు.

దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగార్ని గురించి వారి చాటువులను గురించి వెనుకనే చెప్పబడ్డది. పద్యాలతో పాటు ఆయన ఎన్నో ప్రచార గీతాలను కూడా రచించారు. అందులో "రాంభజన కీర్తనలు" సత్యాగ్రహోద్యమంలో పాల్గొనే స్వచ్ఛంధసేవకులు పాడుతూ తిరుగుతూ వుండేవారు.

"ముప్పయి కోట్ల ప్రజలు రాంభజన—
పంజరబంధమైనారు
బంధాలు త్రెంపుకొని రాంభజన
అవతలా పడాలి
గంధి మంత్ర మిదేను రాంభజన
స్వరాజ్య మంత్రం
ఒక్కటే మంత్రం రాంభజన
మేలైన మంత్రం"[6]

## బసవరాజు అప్పారావు గేయాలు

భావకవులందరు ప్రణయకవిత్వంలో మునిగిపోయిన తరుణంలో బసవరాజు అప్పారావు ఒక్కడు తన చుట్టూ ఏం జరుగుతున్నదో

గ్రహించి ఆ మహోద్యమాన్ని మనసుకు పట్టించుకొని దాన్ని గురించి ఆవేగమైన గేయాలు అల్లాడు - పాడాడు. "నాకెప్పుడూ అప్పారావు ఎంతకూ చల్లారని కోరికలాగ కనపడతాడు" అన్న కృష్ణశాస్త్రిగారి మాటలు ఎంతో నిజం. ఆవేశాలు అలజడులు అతన్ని నిరంతరం కదల్చివేశాయి. ముఖ్యంగా ప్రచారమే ఉద్దేశ్యంగా కలిగినా ఈయన అన్ని గేయఖండికల్లోను కళాభిజ్ఞత కొట్టివచ్చినట్లు కనిపిస్తుంది. ఈయన గేయాలలో మకుటాయమైనది "మా గాంధి" అన్నది.

"కొల్లాయి గట్టితేనేమి
మా గాంధి
కోమటై పుట్టితేనేమి! కొల్లాయి.........
వెన్నపూసా మనసు
కన్నతల్లి ప్రేమ
పండంటి మోముపై
బ్రహ్మతేజస్సు".[7]

ఈ గీతం అంతటిలో గాంధీజీ బాహ్యరూప వర్ణనం ఏదో ఒక ఆధ్యాత్మిక భావానికి ముడివేయబడ్డది. మొదటి రెండు పంక్తులు గాంధీజీ లక్షణాన్ని ప్రదర్శిస్తూ చివరి రెండు పాదాలలోను ఆ లక్షణాన్ని మరో మహత్తరమైన ఆధ్యాత్మిక భావానికి జోడించడం జరిగింది.

"నాల్గు పరకల పిలక
నాట్యమాడే పిలక
నాలుగూ వేదాల
నాణ్యమెరిగిన పిలక".[8]

అలాగే గాంధీజీని గూర్చి "బాపూజీ-మా బాపూ" అన్న మరొక గేయం కూడా కళాత్మకంగా ఉత్తమమైన సృష్టి.

"పోర్ బందర్ కోమటింట పుట్టినాడోయ్
పురుషోత్తముడు జగతి మెట్టినాడోయ్
కొత్త ఏసుక్రీస్తు అవతరించినాడోయ్
కొట్టక పగవాళ్ళ పొగరు దించినాడోయ్".[9]

ఇందులోనే హిందూముస్లింల సఖ్యతను సూచించటానికి

"హిందూ పైగంబర్ జన్మించినాడోయ్
అల్లాహో అక్బరంటూ అరచినాడోయ్".[10]

అంటూ ప్రశంసిస్తాడు. అంతేకాదు ఆయన్ని ప్రపంచపు "మా బాప నండోయ్" అని, శ్రీరాముడితో పోలుస్తాడు :

"చీమను సింహాసన మెక్కించాడోయ్
రాతి నాతి జేసిన శ్రీరాముడేనోయ్".[11]

"ఈ జన్మము" అన్న ఖండికలో "ఈ జన్మమిక దుర్లభమురా" అన్న వేదాంతపరమైన గీతాన్ని సమకాలీన జీవితానికి సమన్వయించి గాంధీజీ పుట్టిన ఈ కాలంలో పుట్టడంవల్ల ఈతని జన్మ చరితార్థమైనదంటాడు.

"ఈశ్వరుడె గాంధిగా ఇల నవతరించాడు
అందులో మముగన్న హిందూమాత కడుపున"
"ధర్మదేవతమూర్తి దాల్చింది గాంధిగా
కళ్లార మనమతని గాంచి ధన్యులమైతి".[12]

ఈయన తన భావనాప్రపంచంలో స్వరాజ్యలక్ష్మికి పెండ్లి చేయించాడు.

"పోదాము స్వరాజ్యలక్ష్మి పెండ్లి జూడ
రారే రమణులారా"

అంటూ "స్వరాజ్యలక్ష్మి పెండ్లి" కి పెండ్లి పాట పాడుతాడు. ఈ పెళ్ళికి

"సంద్రమే పెళ్లిలంట, సదస్యులు దేవతలంట
ఉప్పే తలంబ్రాలటా
మన లక్ష్మి పెండ్లికి"[13]

అంటూ ఉప్పు సత్యాగ్రహాన్ని అన్యాపదేశంగా పొగుడుతాడు. చివరకు

"గాంధీవశిష్టంట, కస్తురమ్మ ముత్తైదంట
పరమాత్ముడే సాక్షిటా
మన లక్ష్మి పెండ్లికి".[14]

గాంధీజీ దేశం నలుమూలలా పర్యటించి ప్రజల్ని ఉద్బోధించిన తరుణంలో "*గాంధీ ప్రభ*" ఎలా బయలుదేరిందీ ఎంతో అందంగా చెప్పారు బసవరాజు అప్పారావుగారు.

"గాంధిమహాత్ముడు బయలుదేరగా కలకల నవ్వింది,
జగత్తూ, కలకల నవ్వింది
గాంధిమహాత్ముడు చకచక నడువగ కంపించిపోయింది
భూదేవి కంపించిపోయింది
గాంధిమహాత్ముడు కన్ను విప్పగా గడగడ వణకింది,
అధర్మము గడగడ వణకింది,
గాంధిమహాత్ముడు నవ్వునవ్వగా కన్నులగట్టింది
స్వరాజ్యం కన్నులగట్టింది
గాంధిమహాత్ముడు గొంతు విప్పగా గణగణ మ్రోగింది
ప్రణవము గణగణ మ్రోగింది
గాంధిమహాత్ముడు స్వస్తి పాడగా కరముల దొరికింది
మోక్షము కరముల దొరికింది".[15]

గాంధీజీ వలెనే అప్పారావుగారు కూడా రాజకీయాలకు ఆధ్యాత్మికతకు ఉన్న సంబంధాన్ని చాటి చెప్పారు. అది గాంధీజీకి స్వాతంత్ర్యం ద్వారా దొరికితే, అప్పారావుగారికి గాంధీజీ ద్వారా దొరికినట్లు కనబడుతుంది.

ఈ గేయాలు కాక అప్పారావుగారు అస్పృశ్యతను గురించీ, రాట్నమహిమను గురించీ కూడా గేయాలు వ్రాశారు. మాల లందరు కూడి తమకు జరుగుతున్న అన్యాయాలను గురించి గాంధీజీకి మొరపెట్టుకోవడం ఒక గేయంలో చూపించారు ఆయన. "మాల మాదిగల మొర" అన్న ఈ గేయంలో వారి భాషలోనే తమ మొరను ఆలకించమంటారు. "మత్తుమందు" అన్న శీర్షికలో చాలా రకాల మత్తుమందు లున్నాయి. ఇవి అన్నీ తాత్కాలికంగా మత్తును తెప్పించేవే, కాని

"గాంధీమహాత్ముడు, కనిపెట్టినట్టి యీ
సత్యాగ్రహ మంత్రముతో, మత్తు వదిలేనేమో"

అంటాడు. అలాగే "రాట్నము" అన్న గేయంలో విదేశ వస్త్రాలను ధరించడం గురించి వెక్కిరిస్తాడు.

గేయ రచయితల్లో[6] కవికొండల వేంకటరావుగారు పేర్కొనదగినవారు. ఆయన గాంధీ సిద్ధాంతా లన్నిటిమీద గేయరచన చేసినవారు. గాంధీజీ మరణించిన వెంటనే "ఆవేదన" అన్న శీర్షికతో ఆయన వెలువరించిన గేయం కవి ఆవేదనను తెలియచెప్పుతున్నది.

"ఓ మహాత్మాగాంధీజీ – నిన్ పునఃప్రతిష్ఠ జేతుమోయ్
ఆ దాకా చేతులెత్తి మ్రొక్కనీయ్"[16]

అన్నది కవి ఆశావాదానికి నిదర్శనం.

"పాకీవాడు" అన్న ఖండికలో

జనవంద్యాత్మకథావిధానుడు
సదా సత్యాగ్రహాన్వేషి వా
హిని సేనాపతి మహాత్ముడున్ గొసరుచుండీ
తట్టనే తాల్పగన్

అంటాడు.

ఈ సందర్భంలో "మాతృపూజ" అన్న ఒక ఖండకావ్య సంపుటిని పేర్కొనక తప్పదు. ఇది 1932లో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారి జ్ఞాపకార్థము ప్రచురించబడ్డది. ఇందులో రాయప్రోలు, అబ్బూరి, విశ్వనాథ, దువ్వూరి రామిరెడ్డి, పురిపండా అప్పలస్వామి, కవికొండల వేంకటరావు, తురగా వేంకటరామయ్య, బసవరాజు అప్పారావు, వేంకటపార్వతీశ కవుల రచనలున్నాయి. ఇందులో గోపాలకృష్ణయ్యగారి అభిమానపాత్రమైన దేశభక్తి ముఖ్యమైన వస్తువు.

దువ్వూరి రామిరెడ్డిగారు 'సేవ' అన్న గేయంలో
మముగన్న భారతమాత మందిరమున
దివ్వెలై మన ముందామా పైడి
దివ్వెలై మన ముందామా॥
..............................
కదన వీరుల చేతి ఖడ్గ ధారలలోని
మెఱుపులై మన ముందామా కాఱు
మెఱుపులై మన ముందామా॥

అంటూ జాతీయోత్సాహాన్ని కదనవీరులతో పంచుకున్నారు.

కవికొండల గేయాల్లో "ఉయ్యాలా! దంపాలా" అన్నది మన జానపదగేయాల్లోని దంపుడు పాటల రీతిని ఉన్నది.

పాశ్చాత్యమ్ మోహాంధమ్
ప్రాచీనమ్ ప్రియ బంధమ్
ఆధ్యాత్మమ్ కల్యాణమ్
స్వాతంత్ర్యమ్ శతమానమ్

అంటూ "శతమానమ్ భవతి" అన్న రీతిలో ఆశీస్సులు పలికారు.

తుమ్మల వెంకటరామయ్య వ్రాసిన "నా జన్మభూమి" అన్న శీర్షికతో ఉన్న గేయంలో కవి బాపూజీని సంబోధిస్తూ తన ఆశయాన్ని, అది నెరవేరకపోవడాన్ని వివరిస్తాడు.

నా జన్మభూ మేదిరా
బాపూజీ
నా ముద్దు తోటేదిరా ?
నా కోకిలమ్మేది, నా పూలమేటేది
నా రాణి వీణేది, నా వలపు పాటేది
కలలోని సిరులాయెరా
బాపూజీ
కారడవి పాలైతివా !

అంటూ గాంధీజీని ప్రశ్నిస్తాడు కవి.

పురిపండా అప్పలస్వామి పద్య ఖండికలు ఇందులో ఉన్నాయి ఇంతకు పూర్వమే "*భారతి*" లో "*సత్యాగ్రహి*" అన్న పేరుతో ఈయన సత్యాగ్రహులను అభినందించే ఖండిక వెలువడ్డది.

"*జాతీయ గీతములు*" అన్న పేరుతో దాదాపు ఇరవై పుస్తకాలు నా ఎరుకకు వచ్చాయి. అందులో కొన్ని ఒక్క కవి మాత్రమే వ్రాసినవి. కొన్ని వివిధ రచయితల రచనల సంపుటీకరణాలు. శ్రీ మైనేని రామకోటయ్య సంగ్రహకర్తగా వెలువడ్డ "*జాతీయ గీత*

ములు" అన్న సంపుటిలో రెండు ముఖ్యమైన రచనలను గురించి యిక్కడ పేర్కొనాలి. ఒకటి శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు వ్రాసిన "స్వేచ్ఛ" అన్నది.

స్వేచ్ఛకొరకే మేము బ్రతికాము
స్వేచ్ఛకొరకే ప్రాణమిచ్చేము

........................

స్వాతంత్ర్యమే తల్లి మనకెల్ల
అరుణోదయమె తండ్రి మనకెల్ల॥

అన్న గేయంలో అలతి అలతి మాటలతో నలుగురూ పాడుకునే విధంగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలంటే అర్థం చెప్పారు కాటూరివారు.

ఇందులోని రెండవ ఖండిక "ప్రబోధము" అన్నది. రచన శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్య. బలరామకృష్ణయ్యగారు గాంధీజీ వ్రాసిన గద్య గ్రంథాలను చాలావాటిని అనువదించినట్లు కన్పిస్తున్నది. కాని పద్యాలు, పాటలు కనిపించడంలేదు-ఇది ఒక్కటి తప్ప-

గాంధిదేవుడు కన్నతల్లిని
గాచుకొరకయి ఘనత కంకణ
ధీరయగుచును దరలుచున్నాడు
నిద్ర వలర తమ్ముడా!

అంటూ తోటి సోదరులను ప్రబోధిస్తాడాయన.

1921-24 మధ్య కనికొండల వెంకటరావుగారు వ్రాసిన గేయాలన్నింటిని "**మాతృదేశ సంకీర్తనము**" అన్న పేరిట ప్రచురించారు. ఇందులో 20 గీతాలు వున్నాయి. దేశీయ మహాజనసభ స్ఫురణలో వ్రాయబడిన

నమో నమో జయ! భరత మహాశయ!
సఫలోదయ మంజుల హాసీ![17]

అన్నది భారతీయ యువకుని స్వాతంత్ర్యోద్యమంలోకి ఆహ్వానించే గేయం. "మాతృదేశమునకది ఏనాడో" (23-6-21) అన్న గేయంలో తిలక్ చెప్పిన "స్వరాజ్యం నా జన్మహక్కు" అన్నదానిని "ఆ జన్మాంతపు హక్కు స్వతంత్రము" అంటూ ఎలుగెత్తి చాటారు. ఇందులో హోమ్‌రూల్ ఉద్యమాన్ని గురించిన "స్వరాజ్య స్వాగతము"[18] అన్న గేయం కూడా పేర్కొన దగినదే !

శ్రీ శిష్టా సత్యనారాయణ రాజశేఖరం జాతీయ గేయాలు వ్రాసిన ప్రసిద్ధ కవులలో ఒకరు. ఆయన "జాతీయ గీతములు" (1948) గాంధీజీ హత్యజరిగిన వెంటనే ప్రచురింపబడిన గేయసంపుటి. అందు మూడు శీర్షికల క్రింద ఆ హత్యను గురించి గేయాలు ఉన్నాయి.

అతిదీన భారతి
అతిదీన భారతి-దీ
నాతి దీన జగతి
మతిలేని మహోన్మత్తతకు-మ
హాత్ముని బలియొసగె॥

అంటూనే మహాత్మునికి భారతీయుల తరఫునుంచి హామీ ఇచ్చాడు.

ధర్మ జీవితము
తప్పమిక తప్పమిక తప్పము - శ్రీ గాంధీ
చెప్పిపోయిన ధర్మజీవితపు బాటలను॥

### కృష్ణశాస్త్రి గేయాలు

భావ కవిత్వానికి భావనాత్మకమైన కవిత్వమన్న నిర్వచనం చెప్పుకుంటే ఆధునిక ఆంధ్రదేశంలో కృష్ణశాస్త్రిని మించిన భావకవి లేడని చెప్పటం అతిశయోక్తి కాదు. చిన్న చిన్న గేయాలలో,

అలతి అలతి పదాలలో నిగూఢమైన కవితాత్మను వెలయింపచేసే శక్తి కృష్ణశాస్త్రి కవిత్వానికి ఉన్నది.

ఆయన వ్రాసిన అశేషమైన గేయాల్లోను అతిపరిచితమై అందరూ పాడుకొనే రెండు పాటలను యిక్కడ చెప్పుకోవాలి. ఈ రెండూ రేడియోలో, సంగీత సభల్లో పెద్దపెద్ద విద్వాంసుల దగ్గరి నుంచి అందరిచేత గానం చెయ్యబడ్డాయి. అందులో ఒకటి "*గాంధీ యుగం*" అన్నది. కృష్ణశాస్త్రి గాంధీయుగమంటే చేసిన నిర్వచనం యీ గేయం :

"కమ్మగా బతికితే గాంధీయుగం
మనిషి
కడుపునిండా తింటె గాంధీజగం"

అని పల్లవి పాడి అనుపల్లవిలో భోగలాలసత విడవాలని, మనిషిని మనిషిగా గుర్తించాలని చెప్పి – గాంధీని శివుని అవతారంగా చూపి, గాంధీజీయే కాదు; ప్రతి మనిషీ శివుడు కావడమే గాంధీయుగ ధ్యేయం అంటాడు :

"తన కంఠమున దాచె హాలాహలం
తలనుండి కురిపించె గంగాజలం
మనిషి శివుడవడమే గాంధీయుగం
బాపు ననుసరిస్తే చాలు మనమందరం"

సాహిత్యాన్ని సంగీతానికి జోడించి వ్రాసిన ప్రతి పాటను ఒక అమృతమయమైన ఖండంగా చేయగల కృష్ణశాస్త్రిదే మరో ప్రఖ్యాతమైన పాట :

"నారాయణ నారాయణ అల్లా అల్లా
మా పాలిటి తండ్రీ నీ పిల్లల మేమెల్లా"

గాంధీజీ కలలుకన్న సర్వమానవ సౌభ్రాతృత్వాన్నే కవి కూడా గానం చేశాడు ఈ పాటలో.

శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి (కరుణశ్రీ) వ్రాసిన ఖండ కావ్యాలను గురించి యిదివరకే పరామర్శించడం జరిగింది ఆయన "**అరుణకిరణాలు**" అన్న గేయ కావ్యసంపుటి (1951) లో "**బాపూజీ**" అనే శీర్షిక క్రింద చక్కని గేయం వ్రాశారు :

మా
నవాభ్యుదయ సంకేతం
నీ జన్మదినమహోత్సవ జయగీతం—
నీ నిత్యోజ్జ్వలవదనంలో
నీ సత్యాగ్రహ కదనంలో
బుద్ధదేవు కారుణ్యంవలె
శ్రద్ధామయ కర్తవ్యంవలె
ప్రవహించిన
ప్రతిధ్వనించిన
ప్రశాంత జయ ఘంటాధ్వానం
ప్రపంచ నవయుగాహ్వానం—
........................

## నారాయణరెడ్డి గేయాలు

అత్యాధునికులలో జాతీయ గేయాలు - ముఖ్యంగా జాతిపిత బాపూజీని సంస్మరిస్తూ గేయాలు వ్రాసిన వారిలో డాక్టర్॥ సి. నారాయణరెడ్డి ఒకరు. "*సమదర్శనం*" అన్న ముక్తక కావ్యంలో సత్యాన్ని గురించి చెబుతూ

చరమ విజయము నాడు నేడును
సత్యమూర్తులనే వరించెను

గాంధి చూపిన బాట సాత్త్విక
గంధబంధురమైనదే కద![19]

అంటాడు. అంతేకాదు. గాంధీజీ చూపిన ధర్మవీరాన్ని శ్లాఘిస్తాడు కవి :

మూర్తిగట్టిన ధర్మవీరము
మొన్న మొన్నటి మన మహాత్ముడు
పులులు సయితము అతనిపసి న
వ్వులకు లేళ్లుగ మారిపోయెను.[20]

ప్రపంచంలో త్యాగమూర్తుల కందరికీ దుర్మరణమే ప్రాప్తిస్తుందని చెబుతూ

మట్టిముద్దలవంటివారిని
మానవులుగా తీర్చిదిద్దిన
జాతిపిత మరణమ్ము భారత
జాతి నుదుటన్ నెత్రుచారిక.[21]

అని అంటారు నారాయణరెడ్డి.

ఇటీవల శ్రీ నారాయణరెడ్డి వ్రాసిన గేయాలలో "జ్యోతి వెలగాలి"[22] అన్నది సాహిత్యం దృష్ట్యా ఉత్తమమైన రచన.

ఈ గేయాన్ని విశ్లేషించి చూస్తే ముందు గాంధీజీని పరిచయం చేయడం ఆ తరువాత ఆయన చేసిన ఘనకార్యాల వర్ణన, తరువాత ఆయన సూత్రధారిత్వం, ఆయన పేరు చెప్పుకొని యీనాడు దేశంలో చలామణి అవుతున్న అవినీతి, చివరకు గాంధీజీ ఆశయాలు కల కాలం అలానే ఆమోదింపబడి ఆచరింపబడాలన్న ఆశావాదం దీనిలో క్రమవికాసం పొందాయి.

హిమాద్రి ఎంత ఎత్తు ?
హేమాద్రి ఎవరి సొత్తు ?

అంటూ ప్రశ్నించుకొని, దానికి తానే సమాధానం చెబుతాడు. మొదటి ప్రశ్నకు సమాధానం—

మహాత్మా నీ స్వరూపం
మంచుకొండకు సంతీ ప్తరూపం

రెండవ ప్రశ్నకు

బాపూ ! నీ చిత్తం
ప్రపంచానికి దొరికిన విత్తం

అని సమాధానం చెబుతాడు. గాంధీజీ తన దేశంలో చేసిన లీలలు ఒక దాని తరువాత ఒకటి పేర్కొంటాడు :

నరకంలో నందనాలు నాటి
ఇరుకు గుండెల్లో స్వరతరంగాలు మీటి
పుట్టు బానిసలను పులిపిల్లలుగా మార్చి
మట్టిబెడ్డలను మణిబింబాలుగా తీర్చి—

ఈ తయారీకి

సామ్రాజ్యాలు గడగడలాడగ
చల్లగా నవ్విన మహర్షీ !

అంటూ సంబోధించి, ఈ శతవార్షిక జయంతినాడు ఆయనను ఉద్దేశించి—

మువ్వుపుట్టి నూరేళ్లయింది—

.......................

అయినా చావుపుట్టుకలు నీకెక్కడివి ?

మా వంటి సామాన్యులకవి అంటాడు.

మూలుగుతున్న ధర్మదేవతను
నాలుగు కాళ్లతో నడిపిన దూతవు నీవు

అంటూనే, ఆయనను ఈనాటి నాయకమ్మన్యులు ఎలా దుర్వినియోగం చేస్తున్నారో చెప్పి, చివరకు

వద్దు బాపూ, వద్దు
నీ ఇచ్చిన మామిడిపండు
మేడిపండుగా మారొద్దు
నీవు తెచ్చిన తేనెకుండలో
కాలకూటం కలవొద్దు.

అలా జరగకుండా వుండాలంటే

జ్యోతి అఖండంగా వెలగాలి
జాతి అనంతంగా నిలవాలి
పాతరవై పోయిన నీతి
ప్రభాతంలా నడవగలగాలి

అంటూ కవి తన క్రాంతదర్శిత్వం ప్రదర్శిస్తాడు.

నారాయణరెడ్డి అనువదించిన గాంధీ సూక్తులను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు "*గాంధీయం*" అన్న పేరుతో ఇటీవలనే వెలువరించారు.[23] ఈ అనువాద గేయాలకు ముందు నారాయణరెడ్డి గారు "ఘజల్" పద్ధతిలో వ్రాసిన "*గాంధీ నీ పుట్టిన రోజు*"[24] అన్న గేయం కూడా చేర్చబడ్డది.

**ఇతర గేయ కవులు**

గాంధీజీపై వ్రాయబడిన ఖండికల వలెనే గేయాలు కూడా అసంఖ్యాకాలు. పత్రికలలోను, రేడియోలోను, పుస్తక రూపాన వెలువడిన వందలాది గేయాలను పరామర్శించడం ఇక్కడ సంభవంకాదు. అయినా ఈ గేయాలన్నింటిలో ఒక్క సమాన ధర్మాన్ని మాత్రం పేర్కొనక తప్పదు : అది గేయకవులందరికీ గాంధీజీ అంటే ఉన్న భక్తిభావం. ఇందులో కొన్ని కాం[illegible] ఇంకా అనేక ఉద్యమ ఉత్సవాలలోను పాడబడి ఉండటంవల్ల ప్రజలకు ఎంతో సన్ని

హితం అయ్యాయి. ఇవికాక ఇటీవల వచ్చిన గేయాలు కొంత నూతనత్వాన్ని ప్రదర్శించేవిగా ఉన్నాయి అట్టి వానిలో కొన్నింటిని ఇక్కడ పరిశీలించడం జరుగుతుంది.[25] ఈ గేయాలలో మొదట పేర్కొనదగినది శ్రీశ్రీ రచన.

అతడు సామాన్యవ్యక్తి
అతడసామాన్య వ్యక్తి

అంటూ ప్రారంభమైన ఈ గేయంలో శ్రీశ్రీ పరస్పర విరుద్ధాలైన రెండు లక్షణాలకు గాంధీజీని ప్రతీకగా చూపుతాడు.

తృణంకన్నా తేలిక
మేరువుకంటె ధీరుడు
ఆగర్భ శ్రీమంతుడు
నిత్య దరిద్రనారాయణుడు—

ఇలా అతని "మహోదగ్రమూర్తి"ని, మార్గదర్శకత్వాన్ని పేర్కొంటాడు.

అతడిప్పుడు లేడు
అతడెప్పుడూ ఉన్నాడు

అనడంలో మహామహుల విలువల్ని గ్రహించేటప్పుడు కాలానికి ఉన్న అర్థరాహిత్యాన్ని చూపుతూ

అమరత్వం అందుకొన్న
అతనికి మా నతులు

అంటూ ముగిస్తాడు. రచన పరిధికి చిన్నదైనా గుణానికి చెప్పుకోతగ్గది.

పురిపండా అప్పలస్వామి "ఓహో, నా సేనానీ !" అని సంబోధిస్తూ వ్రాసిన గేయం ఉత్తేజం కలిగించే రచన. ఇందులో పదాల

కూర్పుతోపాటు లయ, తాళాలు రంగస్థలానికి సేనలు నడిచేటప్పుడు పాడే "మార్చింగ్ సాంగ్" లా గోచరిస్తాయి.

నేనూ నీ రణోన్మత్త
గానం విని పులకరించి
రణోన్మత్త రణ డిండిమ
ధ్వానం విని జలదరించి
జలదరించి
కళవళించి
రణభూమికి పరిగెత్తాను.
.... ..... ... .........
......... . .. .. .......
నీ శంఖం నినదిస్తే
నీ కను లాదేశిస్తే
నీ తర్జని గర్జిస్తే
నేనూ ఒక ప్రళయాన్నై
ప్రళయాన్నై
విలయాన్నై
బలిపీఠ ప్రాంగణాన నిలబడ్డాను.

ఇలా సాగుతూ వచ్చిన ఈ రచన

మా కోసం, నా కోసం
ఓహో నా సేనానీ
నా కోసం
ఈ నా తల్లుల కోసం
ఈ నా తమ్ముల కోసం
.......................

రథివై
సారథివై వచ్చావా

అంటూ ఆవేశంతో తన "విప్లవ సేనానికి" స్వాగతం పలుకుతాడు. గాంధీజీ సాధించే నవయుగోదయాన్ని గురించి గానం చేసి, ఈ "సర్వ సేనాని......సర్వ సర్వం సహా పరిత్రాణ కీర్తి" అంటూ గాంధీజీని విప్లవ వీరుడిగా సమాశ్వాసిస్తాడు. ఇది గేయ రచనల్లో మేలుబంతి.

గాంధీజీపై వ్రాయబడిన ఇతర రచనలనువలెనే ఈ గేయ సాహిత్యాన్ని కూడా రెండు ముఖ్యమైన విభాగాలుగా విశ్లేషించ వచ్చు. అందులో మొదటిది గాంధీజీని భగవంతునిగా ఆరాధించే రచనలు. ఆయనను కృష్ణునితో, రామునితో పోల్చి ఆయన దేశానికి కూర్చిన నేతృత్వాన్ని ఆంగ్లేయులనే దుష్టులను శిక్షించడానికి ఎత్తిన మరొక అవతారంగా కొనియాడిన భక్తి గీతాలు అవి. రెండవ తరగతికి చెందిన రచనలు గాంధిజీ ఆశయాలను పేర్కొంటూ, ఆనాడు గాంధీజీ భావించి, ప్రవచించిన ఆశయాలకు, ఈనాడు ఆయన అనుయాయులు అనుసరిస్తున్న విధానాలకుగల అంతరాన్ని చూపుతాయి. ఇట్టి రచనలన్నీ ఇటీవల వెలువడ్డవి. ఇందులో చాలా భాగం వచన కవితలో వ్రాయబడ్డవి. ఈ కవులలో చాలమంది గాంధీజీని చూడని వాళ్ళు! కనీసం ఆయన దేశస్వాతంత్ర్యంకోసం నడిపిన ఏ ఉద్యమంతోను ప్రత్యక్షంగా పరిచయం లేనివారు. ఈ రకం రచనల్లో వ్యంగ్యం పాలు ఎక్కువ.

మొదటి విభాగానికి చెందిన భక్తి రచనలలో చాల భాగం గాంధీజీ జీవించి వుండగా వ్రాయబడ్డవి. తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు తమ గేయంలో

గాందికన్నను ఘనుడు లేడుగా వాని
కథలు విన్నను ముదము కల్గుగా ॥గాం॥

అన్న పల్లవితో ప్రారంభించి, ఆయన గుణగణాలను ప్రస్తుతించి, తుదకు ఆయనను "జీసస్ మహమ్మదు కృష్ణుల"తో పోలుస్తుంది.

ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు అన్యాపదేశంగా - చీకటి ఆవరించి వున్న అంధకారంలో గాంధీజీ "చిన్నదివ్వె" అన్నారు.

"ఒక్క చిన్నదివ్వె
చుక్కవోలె మెఱసింది
శూన్యమందు శుభ్రకాంతి
ధారలను కురిసింది
ఒక్క చిన్న దివ్వె."

ఈ చిన్న దివ్వె ఎంత వెలుగును ప్రసరింప చేసిందీ అనేక విధాల స్తుతించి, చివరకు

"అహింసాజ్యోతి యగుచు
కాంతుల నెగజిమ్మింది
హింసకు బలియగుచును దా
తను వర్పణం జేసింది
ఒక్క చిన్న దివ్వె."

అంటూ ప్రస్తుతించింది గాంధీజీని.

శ్రీ శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం కూడా దాదాపు ఇట్టి కవితలు వెలువరించిన కవే !

"అశరీరి మా గాంధి - అడుగో
ఆకాశమంతటా ఆవరించిన శాంతి"

అంటూ గాంధీజీ మరణానంతరం "విశ్వశరీరు" డై ఎలా తన ప్రేమామృతాన్ని పైనుంచి తన ప్రజలకు పంచియిస్తున్నాడో చూపారు ఈ కవి,

గాంధీజీని భగవంతునిగా కాకపోయినా మానవోత్తమునిగా భావించి వ్రాయబడ్డది శ్రీ హరి ఆదిశేషువు గేయం.

ఓ మానవోత్తమా !
ఓ వీరమూర్ధన్యా !
ఓ శాంతివీరుడా !
జోహారు !

అంటూ సాగింది ఈ రచన !

ఆరుద్ర కూడా ఇటువంటి భక్తిగీతాన్నే ఒకదానిని వ్రాశాడు:

"నిరంతరం మా హృదంతరంలో
నిండి వెలుగు జ్యోతీ
అంజలి చేకొనుమా బాపూ
శ్రద్ధాంజలి గైకొనుమా"

ఈ గేయం అచ్చమైన సినిమా కవిత్వం !

మల్లవరపు విశ్వేశ్వరరావుగారి గేయం కూడా పై గేయానికి దీటైనదే !

"మరువకుడీ జనులారా
మన గాంధీమహాత్ముణ్ణి
మరువకుడీ ప్రజలారా
చిరంజీవి మహాత్ముణ్ణి !

అని మొదలైన ఈ గేయంలో గాంధీజీ లక్షణాలను కొన్నింటిని గేయ రూపంలో వెలువరించారు ఈయన.

సాధారణంగా ఎంతో పదునైన వ్యంగ్య కవిత్వం వ్రాయడానికి పేరుబడ్డ కాళోజీ కూడా

"ఓ బాపూ, జాతిపితా, ఓ మహాత్మా" అంటూ ఆయన గుణ గణాలనే గానం చేశాడు. కాని ఇందులో కవిత్వం ఉంది.

బాపూ, నీ వ్యవహారం మానవతకు
మణిహారం.
బాపూ, నీ జీవితమే సత్యంతో
ప్రయోగాలు

అంటాడు. చివరకు ఈనాటివారి తక్కువతనాన్ని గుర్తించి చెబుతూ—

నీవు కనిన స్వరాజ్యపు భవ్యదివ్య
స్వప్నాలను నిజం చేయి
మేము సాధించిన చిన్నపాటి విజయాలకు
ప్రతీకలుగా ఎవరెస్టు శిఖరంపై పతాకలెత్తి
నిన్ను తలుచుకుంటూ దిగుతుంటే
అడుగడుగున మా అపరాధ హిమాలయాలు
గోచరిస్తాయి బాపూ గోచరిస్తాయి

అంటూ ఆయనకు ఈనాటివారికి గల తారతమ్యాన్ని సాక్షాత్కరింప చేశాడు కాళోజీ.

ఈ రకం రచనలలో పరాకాష్ఠకు చెందిన గేయం చిన్నం కనకయ్యశాస్త్రి వ్రాసిన "నమో గాంధిదేవా! దేవా! జ్ఞానప్రభో!" అన్న పల్లవిలో వ్రాసినది. ఇందులో భగవదారాధనకు అవసరం అయిన అన్ని విధాల పదాలు ఉపయోగింపబడ్డాయి.

పైన పేర్కొన్న రచనలన్నీ కేవలం భక్తి గేయాలని చెప్పాను. ఈ పద్ధతి గేయాల్లో కొన్ని గాంధీజీ లక్షణాలను మాత్రమే పేర్కొని పరాశ్రయ పద్ధతిలో వానిని తులనాత్మకంగా వర్ణించినవి ఉన్నాయి. ఇందులో కావ్య గౌరవం పొందగల రచనలు కుందుర్తి ఆంజనేయులు, శశాంక, మాదిరాజు రంగారావు గార్లవి.

ఒకానొక వృద్ధ భారతీయుడు కొల్లాయికట్టుకొని వచ్చి "పరిపాలకుడు పరమాత్ముడైనా" ప్రజలచేత ఊడిగం చేయించుకొనే హక్కు లేదని కేకలువేశాడట! "ఆయన పేరు సత్యం" అంటాడు కుందుర్తి తన గేయంలో. సంక్లిష్టమైన పదచిత్రాలలో సాగిన ఈ "దండయాత్ర" అనే గేయంలో మహాత్ముడు సాగించిన "విచిత్రమైన దండయాత్ర"ను అన్యాపదేశంగా వర్ణించారు కుందుర్తి. ఈ కోవకు చెందిన రచనే శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తిది.

ఇక రెండవ తరగతికి చెందిన రచనలు - వ్యంగ్యాత్మకమైనవి—కోకొల్లలు. ఈనాడు రచన చేస్తున్న ప్రతి కవీ ఇట్టి రచనలు చేసినవాడే! ఇందులో కొంతైనా కావ్యత్వం ఉండి మామూలు ప్రచార గేయాలకు ఎంతో ఉన్నతంగా ఉన్న రచనలు చేసిన రచయితలలో అమరేంద్ర, అరిపిరాల విశ్వం, వరవరరావు, పేర్వారం జగన్నాధం గార్ల రచనలను పేర్కొనవచ్చు.

బాపూ మరొక్కసారి తిరిగివచ్చి కరుణచూపు—
నూరేడులు మనసీయని
క్రూరాత్ముల మన్నింపుము

అవి వర్తమాన భారతీయుల పక్షాన క్షమాపణలు చెప్పుకొని

నిన్ను రాతిబొమ్మ చేసి
నీ మాటనె మరచినాము

అంటూ వాపోయారు అమరేంద్ర.

శ్రీ పేర్వారం జగన్నాధం గేయం మరికొంత తీవ్రమైనది :

ఇరువదేండ్ల క్రితం నీవు
బ్రతికున్న భారతం కాదిది

నీవలె బ్రతకడం నీకే సాధ్యమైంది
మావలె బ్రతకడం మాకే సాధ్యమౌతున్నది

అంటూ తన అసహ్యాన్ని వెల్లడి చేశాడు. అయినా ఈయన కూడా ఆశావాదే !

"మా జాతి భవతవ్యం కోసం
మా దేశ సౌభాగ్యం కోసం
ధర్మసంస్థాపనార్థాయ
మళ్లీ ఆవాహన చేస్తున్నాను"

శతజయంత్యుత్సవాన్ని దేశమంతటా జరుపుతూ, ఆ రోజుతో గాంధీజీకి ప్రజలకు గల సంబంధానికి తర్పణం వదులుకోవడం వర్ణించాడు శ్రీ వరవరరావు.

ఇరవయ్యేళ్లనాడు యిరు శతాబ్దాల
ఇరుల నెట్లా పారదోలావో కాని
ఇప్పుడు మాత్రం నీ అబ్బతరం కూడ కాదు
ఈ ఇరవయ్యేళ్ల బానిసత్వాన్ని పారదోలడం.

అందువల్లనే

ఈనాడు నీకు కడపటి వీడ్కోలు చెప్తున్నాము
నిన్ను మరచిపోదల్చుకున్న మమ్మల్ని
విడిచిపో
క్విట్ యిండియా !

అంటూ తన రోషాన్ని వెలువరించాడు.

గాంధీజీ శిష్యుల్ని గురించి, ఆయన వారసుల్ని గురించి ఎంతో తీవ్రమైన విమర్శతో సాగిన రచన శ్రీ అరిపిరాల విశ్వానిది.

"నిన్ను మేము మందిరాల్లో
విగ్రహాల్లో, పుస్తకాల్లో తప్ప
పూజించటంలేదు"

దానికి కారణం వివరిస్తాడు.

"మా కందనంత పెద్దవాణ్ణిచేసి
మాకు చేతనైనంత చిన్నవాళ్ళుగా
మారిపోదామని –"

నీ శిష్యులందరూ నీకు సమాధిని కట్టారు. వాళ్ళు మాకేం మిగిల్చారు–

నీవు మాలో పుట్టావని చెప్పుకొనే
గొప్ప తప్ప – నీ శిష్యులు
మాకేమి మిగిల్చారు!

అంటూ తన కసిని వెల్లడించాడు విశ్వం.

కొందరు కవులు గాంధీజీకి ఈనాటి ప్రజలకుగల అంతరాన్ని సూచించి, గాంధీజీని ప్రజలు మరచిపోవడాన్ని గురించి వ్రాస్తే, మరికొందరు రచయితలు గాంధీజీనే ప్రార్థించారు – మహాత్మా, మమ్మల్ని మరచిపో – అని.

శ్రీ వేలూరి సహజానంద తన గేయంలో
మరచిపో మహాత్మా
మమ్మల్ని మరచిపో!
మరచిపోయాం నిన్ను
మరచిపో నువ్వూ మమ్మల్ని
అదే మాకు పదివేలు.

అని ఆయనను ప్రార్థిస్తూ, నువ్వు మా జోలికి రాకు, అంతమాత్రాన మేము కృతఘ్నులమని అనుకోకు -

కృతజ్ఞులం కాకపోతే
చేస్తామా శతజయంతి !

అంటూ ఎత్తిపోస్తాడు. ఈనాటివారి గొప్పతనం చెబుతూ

మనలో మాట
మేం ఏంచేసినా
నీ పేరు చెప్పుకునే చేస్తున్నాం
నీకు పుణ్యముంటుంది కరుణామయా !
కలలో కూడ కన్పించకు మాకు ! !

అంటూ ఈ నాటి భారతీయునికి ప్రతినిధిగా గాంధీజీని వేడుకుంటాడు!

ఈ రచనలలో రెండు గేయాలను గురించి ఇక్కడ చెప్పాలి. అందులో ఒకటి పెండ్యాల వేంకట రామారావు వ్రాసిన గేయం. నిజాం పాలించిన హైదరాబాదు రాష్ట్రంలోని ఒక జైలులో వుండగా గాంధీజీ మరణవార్త విన్నప్పుడు ఆయనకు కలిగిన ఆవేశం ఈ కవిత :

"గాంధీజీ నెవరు హత్య చేస్తారు
అజాతశత్రువతని కెవరు
విరోధులు ?"

నేను ఈ హత్కడీ, టికిటికీలతో
ఏ బలంతో ఉంటున్నా నీ చీకటి గంధిలో !
గాంధీజీ లేకుంటే ఇక మా గతి ఏమి ?

అంటూ అతి దీనంగా ప్రశ్నిస్తాడు.

మరొక గేయం శ్రీ చుక్కభొట్ల సత్యనారాయణమూర్తి "గాంధీజీ కన్న సామ్యవాదు లెవరు" అని ప్రశ్నిస్తూ వ్రాసినది.

గాంధీజీ గుణాలను ఒక్కొక్కదానిని పేర్కొంటూ "ఇట్టి గుణాలు గలవానికన్న సామ్యవాదులున్నారా ?" అని ప్రశ్నిస్తాడు కవి.

కట్టుకొన్నది యంగవస్త్రము
పట్టుకొన్నది రాట్నచక్రము
పట్టుమని పది మెతుకులైనా
పట్టకుండు కృశోదరము గల
గాంధి కంటెను సామ్యవాదులు
గలరె లోకములో.

అంటూ సామ్యవాదంలో ఉన్న ఉన్నత ధర్మాలన్నీ గాంధీజీలోనే ఉన్నాయంటాడాయన :

ఇలా వివిధ పద్ధతులలో వ్రాసిన గేయకవులందరి రచనలూ పేర్కొనడం ఇక్కడ సాధ్యంకానందువల్ల, ఆయా రచనలలో ఉండే సామాన్య గుణాలు, వానిలోని సామ్యాలు అంతరాలు మాత్రమే ఇక్కడ చర్చించబడ్డాయి.

## 6

# కీర్తనలు - భజనలు మొదలైనవి

జాతీయోద్యమం ముమ్మరంగా సాగిన రోజుల్లో సామాన్య ప్రజల్ని ఉద్బుద్ధం చేయటానికి ఎన్నో కీర్తనలు, మంగళహారతులు, లాలిపాటలు వ్రాయబడ్డాయి. వీనిలో ఎన్నో ప్రసిద్ధములై ప్రతి మనిషి నోటా వెలిశాయి. వీనిలో చాలా కీర్తనలకు రచయితలు అజ్ఞాతంగానే వుండిపోయారు. దానికి కారణం కవులమన్న కీర్తిపతాక కన్న ఉద్యమంలో తాము కూడా ఉడతాభక్తిగా పాల్గొన్నామన్న ఆనందమే ఆకవులందరికి ముఖ్యం కనుక.వీనిలో చాలా గేయాలు సత్యాగ్రహంలో పాల్గొనవలసిందిగా ప్రజలకుచేసే హితబోధగా ఉద్దేశింపబడ్డాయి. మొట్టమొదట "*దేశీయకీర్తనలు*" (1908) అన్న పేరుతో ఒక గ్రంథం వచ్చింది. కర్త ఎవ్వరో తెలియదు. కాని వందేమాతరోద్యమం వల్ల ఈ కీర్తనలు ప్రేరేపింపబడ్డవని తెలుస్తున్నది.

"స్వరాజ్య సౌఖ్యం మన కెన్నటికో
సురాజ్య సామ్రాజ్య సుభోజ్యమెన్నటికో"

ఈ గేయం తర్వాత ఒక పద్యం :

"వందేమాతర మంత్రం
సందేహాము మాని జపము సలుపుడు భయముల్

డిందు పడగలవు మీ కా
నందంబగు నిండియా కనల్ప జయమగున్"

"స్వారాజ్యనవనీతము" అన్న పేర కొండపల్లి జగన్నాథదాసు వ్రాసిన పద్యాలు గేయాలు రెండు సంపుటాలు వున్నాయి.

"గాంధిమహాత్ముని
స్మరణమొనర్చుడి జనులారా"

అని

"సందేహాములేదు గాంధి చక్రియ వినుమీ"

అని కీర్తనల్లోను పద్యాలలోను గాంధీజీ ఈ "స్వారాజ్యా నవనీతము"లో ప్రశంసింపబడ్డాడు.

కవికొండలవారు వ్రాసిన "మాతృదేశ సంకీర్తనల"ను గురించి ఇంతకు పూర్వమే చెప్పబడ్డది. కొన్ని జాతీయగీతాల్లో

"జగద్రక్షకుడు గాంధి మహాత్ముడు - జనులం
దరు మీ రెరుగండీ-జగతిని ధర్మస్థాపన జేయగ
జన్మించిన హరియతడండీ"

అని అవతార కీర్తనలు,

"మహాత్మా గాంధీ దర్శనము
పావనము, కలుషహారము
కలుగు ముదము"

అంటూ స్తవం చేయబడ్డవి. వీనిలో మరికొన్ని ప్రఖ్యాతములైన కీర్తనలు వున్నాయి.

"మమ్ము బ్రోవ మహిని వెలసితివా ?
మహాత్మ గాంధి" మమ్ము—

ఇట్టి కీర్తనలు ప్రతి జాతీయ సభావేదికమీద పాడడానికి ప్రత్యేకంగా కళాకారు లుండేవారట ! కొన్ని కీర్తనలలో ఒక పృచ్ఛకుడు ప్రశ్నించడం మిగిలినవారు సమాధానం చెప్పటం కనిపిస్తుంది. "*శ్రీ గాంధి*" అన్న కీర్తనలో

"ఏడిరా నీ గాంధి ఎక్కడున్నాడు
దాసుల హృదయాల దగిలి యున్నాడు
ఎక్కడకు పోయినా డేమిచేశాడు
ఉప్పుపన్నట్టుకొని ఊడదీశాడు"

ఇలా సాగుతుంది రచన. కొందరు కవులు ఉప్పు పన్నును గూర్చి వ్యంగ్యంగా గేయాలు వ్రాశారు.

"పన్నెండు దేశాలు పండుతున్నా గాని
పట్టెడన్నమె లోపమండీ
ఉప్పు ముట్టుకుంటే దోషమండీ"

కొందరు దీన్నే చమత్కరించి

"దండాలండోయ్, మే ముండలేమండోయ్ బాబు
ఉప్పుకును పన్నుబాబు
కొప్పుకా_స్త దేముడికి
ఒప్పుకుంటే పన్నుబాబు"

ఇట్టి తరహాకు చెందిన పాటలలో గరిమెళ్లవారు వ్రాసిన "*కల్లుపాట*"[1], ఉన్నవవారి "*సమతా ధర్మము*" అన్న తక్కెళ్ళ జగ్గని పాట ప్రసిద్ధములు. జాతీయోద్యమం ముమ్మరంగా సాగిన రోజుల్లో మేలుకొలుపులు, మంగళహారతులు కూడా ఎన్నో వచ్చాయి.

"మేలుకొనుమీ భరత పుత్రుడ
మేలుకొనుమీ సుజన మిత్రుడ

మేలుకొనుమీ సచ్చరిత్రుడ
మేలుకొనవయ్యా! వత్సా! మేలుకో"

అంటూ మేలుకొలుపులు పాడారు. అంతేకాదు

"జయ గాంధిదేవా మంగళం
జయ మంగళంబు
సత్యాగ్రహాశ్రమ తాపసా
శాంతస్వభావ మానసా
. ......... . . . . . . .
కస్తూరి సాధ్వీ వల్లభా" ॥జయ॥

ఇందులో చాల కీర్తనలు ప్రభాతభేరీల్లో స్వచ్ఛంద సేవకులు భూపాల రాగంలో, 'చాపు' తాళంలో తెల్లవారుఝామున పాడుతూ ఉండే వారు. ఇట్టి కీర్తనలు, గేయాలు అన్నీ 1920-1935 మధ్యకాలంలో ఎక్కువగా వచ్చినట్లు తోస్తున్నది.

ఇదేకాలంలో "*స్వారాజ్య గోవిందములు*"[2] అని ఎన్నో రకాల దేశ సంకీర్తనలు వెలువడ్డాయి. సుబ్రహ్మణ్య భాగవతులు అన్న రచయిత "*శ్రీ భారతమాత దండకము*" వ్రాస్తూ అందులో

"మా పూర్వ పుణ్యంబునన్ జేసియో లేక చల్లనౌ
కాన్పు భాగ్యంబునన్ జేసియొ, సత్యవాక్యా
వలంబుండు, సద్ధర్మమార్గ ప్రచారుండు
శాంతి స్వభావుండహింసా మహాతత్త్వబోధ
ప్రభావాత్త విజ్ఞాన చక్షుండు...
లోకంబునన్ కార్యదీక్షా రతిన్...
నీ ముద్దు పుత్రుండు గాంధీ మహాత్ముండు . . .
ప్రబోధంబు కల్పించె"

అంటూ సుదీర్ఘమైన ప్రశంస చేశాడు. ఈ దండకంలోనే భారతమాతకు ఆరు రకాల ప్రమాణాలు చేస్తాడు, భారతీయుల తరఫున ఈయన. ఇవి అన్నీ గాంధీజీ నిర్మాణ కార్యక్రమంలోని సూత్రాలే.

ముద్దా రామదాసు అన్న ఆయన *"గాంధీ విజయము"* (1921) అన్న హరికథను వ్రాశాడు ఈయనే ***"బాలగంగాధర తిలక విజయము"*** అన్న మరొక హరికథలో-తిలక్ మరణ సమయంలో ఆయన గాంధీజీని కౌగలించుకొన్నట్లు అప్పుడు తిలక్‌లో నుండి ఒక జ్యోతి గాంధీ హృత్కమలంలో ప్రవేశించినట్లు చూపుతాడు[3].

పైన పేర్కొన్న గాంధీజీ స్తుతులతోపాటు గాంధీజీ ప్రచారం చేసిన నిర్మాణ సూత్రాలను గురించి కూడా ఎన్నో కీర్తనలు-పాటలు వెలువడ్డాయి. ఇందులో ముఖ్యంగా అస్పృశ్యతా నివారణ గురించి, విదేశ వస్త్ర బహిష్కారము, దానితోపాటు రాట్నమును వాడవలసిన ఆవశ్యకతను గూర్చి ఎన్నో కీర్తనలు వెలిశాయి. మాధవపెద్ది వంటి విద్వత్కవులు, దువ్వూరి రామిరెడ్డి వంటి ప్రసిద్ధ పండిత కవులు, బసవరాజు అప్పారావు వంటి గేయ కవులు కూడా ఇట్టి గేయాలు రచించిన వారిలో వున్నారు.

ఉద్యమం ప్రారంభమైన మొదటి రోజుల్లోనే శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య ***"జాతీయ కీర్తనలు"*** అంటూ ఒక గేయాల సంపుటిని వెలువరించారు. *"గాంధీ సుభాషితములు"* (1958) అన్న దేవులపల్లి సీతారామశాస్త్రి రచనలో గాంధీ బోధల్ని పేర్కొన్నారు జాస్తి వేంకటనరసయ్య *"నవ గీతాలు"* అన్న పేరుతో గ్రంథాలయం, ప్రయోజన విద్య, స్వాతంత్ర్యదినోత్సవం అన్న శీర్షికల క్రింద గాంధీజీ ప్రభావాన్ని కొనియాడారు. "స్వాతంత్ర్య దినోత్సవం" అన్న ఖండికలో

"శ్రీ గాంధీ ఋషి సత్తపోమహిమ
చెన్నుమీరి వెలిగె
స్వాతంత్ర్యోత్సవములు చెలగె
దాస్య పిశాచంబు వైదొలగె"

అంటూ గాంధీజీ నాయకత్వాన దేశం ఏ విధంగా స్వాతంత్ర్య సముపార్జన చేసిందీ లయబద్ధమైన, పాడుకోవడానికి అనువైన పాటల్లో పాడారు. ఈయనే "గాంధీ నిర్యాణము" అన్న గేయంలో కూడా గాంధీ ప్రతిభావిశేషాలను ఆయన దైవత్వాన్ని కొనియాడుతూ ఆయన మరణానికి సానుతాపం ప్రకటించారు.

పాడుకోవడానికి అనువుగా ఉద్దేశించిన గేయాలలో సబ్నవీసు గురునాథరావుగారి గేయాలను తప్పక పేర్కొనాలి. ఈయన స్వయంగా గేయకర్త కావటమేగాక గొప్ప గాయకుడు కూడా కావటంవల్ల 1930-40 ల మధ్య కాలంలో అవి ఎంతో ప్రశస్తికి వచ్చాయి. "మీరు అవి పాడుతుండగా వినే భాగ్యము నాకు కలగలేదని చింతిస్తూవున్నాను"[4] అని గిడుగు రామమూర్తి పంతులుగారు ఈయన గానాన్ని శ్లాఘించారు.

"గాంధీ యుగమున నుత్తమాశయము లెన్నో చుక్కల గుంపువలె భారత మానస దిగ్వలయమున కాంతి వీచినది. ఈ కాంతి నాత్మజీవనములందు నింపుకొని నవజీవన సందేశమును కీర్తించిన ప్రతిభాశాలురు కొందరు మన నేలయందు తోచిరి. వీరిలో నీ గ్రంథకర్త యొకరు"[5] అన్న శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారి మాటలు ఎంతైనా సత్యాలు. "గాంధి" అన్న గేయంలో

"జీవితమంటే నీదే గాంధీ
నిన్ను
జీవన్ముక్తుడవనగ చను కరుణా గాంధీ"[6]

అన్న పల్లవితో అయిదు చరణాలు గాంధీ మాహాత్మ్యాన్ని చూపుతూ వ్రాయబడ్డాయి. అంటరానితనంమీద "పశ్చాత్తాపము" అన్న వీరి ఖండిక ఉత్తమమైన రచన. ఇందులో తన కోటివారందరిని కోటప్ప కొండకు పోదామని పురికొల్పుతూ ఇన్నాళ్లు అంటరానివారిని దూరంగా వుంచిన పాపానికి స్వామి దగ్గర పశ్చాత్తాపం వెల్లడించు కుందాము రండి అంటాడు.

"కోడెలను మేపుకొని
గ్రామప్రభ కట్టుకొని
భక్ష్యాలు చేసుకొని
బాజాలు గూర్చుకొని
కోటప్పకొండకు వెడదామా!
... . ... . . ....

2

"హరిజనులందరిని
హరిగుడికి తోడుకొని
పాలలో నీళ్ళవలె
కలిసిమెలిసి మనము
శివరాత్రి జాగరణ చేద్దామా!

3

"పుట్టినప్పటినుండి
పట్టుబట్టి మనము
అంటరానితనము
వెంటాడినందులకు

వగచి పాదాలపై పడదామా!
పాపాలు మన్నించమందామా!"[7]

ఈయన మహాత్ముని సందేశము అన్న సుదీర్ఘమైన గేయంలో జముకుల కథ పద్ధతిలో

"వినుడివినుడి జనులారా
విని ధన్యతనొందుడి జనులారా!
పతితపావనుడు, పురుషోత్తముడగు
గాంధిమహాత్ముని ఘనసందేశము"[8]

అంటూ, గాంధీజీ నిర్మాణ కార్యక్రమాలలోని సూత్రాలను పాడుకోవటానికి చాలా అనువుగా గేయ రూపంలో నిబద్ధం చేశారు. ఖద్దరును గురించి, పంచమజాతి, గ్రామోద్ధరణ, చేతి పనులు, మానవ ప్రేమ, సత్యాహింసలు అన్న ఆరు గాంధేయ సూత్రాలను ఆరు చరణాల ద్వారా ప్రజలకు అందించారు. వీని అన్నిటిలో లయ, దాని కనువైన సాహిత్యగతి - రెండూ సమంగా మేళవింపబడి ఈ గేయాలను కేవలము ప్రచార గేయాల స్థాయినుండి వేరుపరుస్తున్నవి.

ఈయన వ్రాసిన మరో గేయం "మహాత్ముడు" అన్నది బసవరాజువారి "కొల్లాయి గట్టితేనేమి" అన్న గేయానికి అనుకరణ రూపంగా తోస్తుంది.

"ఎవరు దూషించితే నేమి?
మహాత్ము
నెవరు భూషించితే నేమి?
.. ......... ....... ..
చూపు చూచేడంటె
సమ్మోహనాస్త్రమే
కరము చాచేడంటె
కనకమయవర్షమే"[9]

అనుకరణము గేయరచనా పద్ధతిలోనే. మిగిలినదంతా కవి ప్రతిభకు నిదర్శనమే. ఇందులోని చివరి చరణం—

"మంచుగడ్డావంటి
మచ్చలేనీ మనసు
సూర్యకిరణము వలెన్
సూటితప్పని నడత"[10].

పరోక్షంగా గాంధీజీ రాకను అరుణోదయ రాగంతో పోల్చి గాంధీజీని జాతికి వెలుగునిచ్చే సూర్యదేవునిగా భావించాడు కవి.

ఇటీవలి కాలంలో జాతీయ గేయాలు వ్రాసినవారిలో పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారు ఒకరు. ఈయన గేయాలు "జయభారతి" (1942) అన్న పేరుతో సంపుటీకరింపబడ్డాయి. ఇందులో జాతీయ నాయకులపైన, అనేక జాతీయ సంఘటనలపైన గేయాలు వున్నాయి. ఇందులో మెచ్చుకోతగిన పాట ప్రఖ్యాత జాతీయకవి - దేశభక్తుడు అయిన గరిమెళ్ళ సత్యనారాయణగారిని గురించి :

"మాకొద్దీ తెల్లదొరతనము
వాకొన్నావీవంచు
పట్టి నిన్ను దొరలు
బందిచేశారూ"

"పాట వ్రాసి జనుల
బాటను దిర్చావు
పాటనీ జీవితమె
కాటువేసింది"

అంటూ గరిమెళ్ళవారు దేశానికి చేసిన సేవను ప్రస్తుతిస్తూనే అట్టి దేశభక్తుల్ని ప్రజలు, ప్రభుత్వము కూడా నిరాదరించడంపై తన బాధను వ్యక్తం చేస్తాడు.

వీరు కాక ప్రసిద్దులు అప్రసిద్ధులు అయిన ఎందరో కవిపుంగవులు వందలకొద్దీ గేయాలు వ్రాసి వేలకొద్దీ స్వచ్ఛంద సేవకులచే పాడించి తద్వారా ఉద్యమ ప్రచారాన్ని మారుమూల గ్రామాలకు కూడా విస్తరించటానికి తోడ్పడ్డారు.

# 7

# గాంధీజీ: నాటక సాహిత్యం

1920 లో గాంధీజీ భారత స్వాతంత్ర్య సమరానికి నాయకత్వం చేబట్టి దేశం నలుమూలలూ సంచరిస్తూ ఆంధ్ర దేశానికి కూడా వచ్చారు. ఆయన పూరించిన స్వాతంత్ర్య శంఖారావము విని వేల కొలది ప్రజలు ఈ సమరంలో పాల్గొనడానికి, ప్రాణాలు సైతం త్యాగం చేయడానికి సన్నద్ధులైనారు. అందులో కవులు, గాయకులు, నాటకకర్తలు కూడ వున్నారు. వెనుకటి అధ్యాయాల్లో దేశభక్తిని ప్రేరేపించి ప్రచారం చేయటానికి పూనుకున్న కవిగాయకులను గూర్చి పరామర్శించటం జరిగింది. ఈ అధ్యాయంలో అట్టి నాటక కర్తలను గూర్చి, గాంధేయ సాహిత్యానికి వారు కూర్చిన క్రొత్త సొంపులను గూర్చి వివరించటం జరుగుతుంది.

దేశభక్తి నాటకాలను మూడు వర్గాలుగా విభజింపవచ్చునని విమర్శకులు చెప్పారు.[1] ఇందు పౌరాణిక నాటకాలు, చారిత్రక నాటకాలు, రాజకీయ నాటకాలు అన్న విభజన చేయబడ్డది. నిజానికి నిజమైన దేశభక్తి ప్రబోధితములైన నాటకాలు 1920 తర్వాతనే వెలువడ్డాయని చెప్పవచ్చు. అంతకుపూర్వం వెలువడ్డ పౌరాణిక

చారిత్రక నాటకాలలో క్వాచిత్కంగా దేశాన్ని గురించి దేశసేవను గురించి ఉల్లేఖించటం జరిగింది. అట్టి నాటికలలో కవికొండల వేంకట రావుగారు వ్రాసిన "*భారతీయ సందేశము*" (1912) పేర్కొనతగిన రచన. ఇతర దేశాలనుంచి మాతృదేశానికి తిరిగి వచ్చిన ఒక భారతీయుని ఆర్తి ఇందులో చూపించబడ్డది. దాదాపు ఏకపాత్రాత్మకము (dramatic monologue). ముఖ్యపాత్ర 'భారతీయులు'. మొదటి రంగంలో భారతీయులు తమ దేశంలోని అనైక్యతకు దురపిల్లుతూ "ఆహా ! ఆ పాశ్చాత్యదేశము లేమి ? వారి దేశభక్తియు నైకమత్యంబును మన దేశమున కెన్నడైన పుట్టునే ?"[2] అతడే మరొకచోట "తోడి మానవులకు సేవచేయుటయే మాతృదేశమునకు సేవచేయుట. మాతృదేశ సేవ ఒనర్చుటచేతనే మన జన్మము సాఫల్యంబగును"[3] అనుకుంటాడు.

రాజకీయ నాటకాలను చారిత్రక నాటకాలలో ప్రబోధ నాటకాలుగా పేర్కొనవచ్చును.[4] స్వాతంత్ర్యాన్ని వుద్బోధించే పౌరాణిక నాటకాలు గాని, చారిత్రక రాజకీయ నాటకాలు గాని, 1921-35 ల మధ్య కాలంలో ఎక్కువగా వచ్చాయని చెప్పవచ్చు. మరీ ముఖ్యంగా 1921 నుంచీ 1927 వరకు ప్రబోధ నాటకాలు లేదా ప్రచార నాటకాలు అత్యధిక సంఖ్యలో వెలువడ్డాయి.

1921 సంవత్సరం తెలుగు నాటక చరిత్రలో ఒక ప్రత్యేక స్థానం కలిగివుంది. ఆ సంవత్సరంలో రసపుత్రులను గురించిన నాటకాలు 5, శివాజీని గురించిన నాటకాలు 5, కృష్ణదేవరాయలను గురించిన నాటకాలు 4, గాంధీజీ ప్రభృతులను గూర్చి వచ్చిన నాటకాలు 4.[5] ఇన్ని నాటకాలు ఒక్క సంవత్సరంలో వెలువడ్డాయంటే దానికి కారణం ఆనాడు దేశంలో వున్న రాజకీయ పరిస్థితులే. పైన పేర్కొన్న వివిధ నాటకాలలో ముందు రాజకీయ నాటకాలను గురించి పేర్కొనటం జరుగుతుంది.

ఈ కాలంలో వ్రాయబడ్డ రాజకీయ నాటకాలు ఎంతో గొప్ప ప్రచారాన్ని పొంది పలుతావుల్లో ప్రదర్శింపబడి ఆనాటి ఆంగ్ల ప్రభుత్వంచేత నిషేధింపబడ్డాయి. అందువల్ల కూడా ఆ నాటకాలకు బహుళప్రచారం లభించింది. ఈ నాటకాలు వ్రాసినవారిలో శ్రీ దామరాజు పుండరీకాక్షుడు, జంధ్యాల అయ్యవారిశాస్త్రి, పండిత సీతారామ, శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి ప్రభృతులు ముఖ్యులు. వీరిలో చాలమంది తమ ఉద్యోగాలను కూడా కాలదన్ని స్వాతంత్ర్య సమరంలోకి దూకిన యోధులే.

### దామరాజువారి నాటకాలు

దామరాజు పుండరీకాక్షుడుగారు గొప్ప దేశభక్తుడు. గాంధేయ సిద్ధాంతాల యెడ అవిరళబద్ధమూర్తి. తెలుగులో మొట్టమొదట రాజకీయ నాటకాలకు నాంది పలికినవాడు ఆయనే. ఈయన రెండు రాజకీయ నాటకాలు వ్రాశారు. "*నవయుగారంభము*" లేదా గాంధీ మహోదయము, "*గాంధీ విజయము*" లేదా నవయుగము.[6] ఈ రెండు నాటకాలకు నాయకుడు గాంధీజీయే. "ప్రస్తుత రాజకీయ విషయములు పామర జనులకు కూడా అర్థమగునట్లు నాటక రూపమున వ్రాయనెంచి" ఈ ప్రయత్నం చేసినట్లు కవి చెప్పుకున్నారు.[7]

*నవయుగారంభము :* ఇది దామరాజువారి మొదటి నాటకము. స్వరాజ్యసాధనకోసం మహాత్ముడు దృఢప్రయత్నం ప్రారంభించిన రోజుల్లో "ఆ నూతనోద్యమ రహస్యములను ఆంధ్రదేశంలో వెదజల్లుటకు వ్రాయబడిన ఈ నాటకాన్ని అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఎంతో ప్రశంసించారు.

"తగిన పాండిత్యము, ఉత్సాహము, దేశభక్తి, ధైర్యసాహసములు గల నాటకవేత్త నేడు బయలుదేరి ముందు రాబోవువారికి మార్గదర్శకుడైనాడు.............ఇది వ్రాసిన గ్రంథకర్త ధన్యుడు.

అన్న అయ్యదేవరవారి మాటలు ఈనాటికీ చెరగని సత్యాలు. ఇది మూడంకాల నాటకము. మొదటి అంకానికి ముందు విష్కంభము వంటి "ఉపోద్ఘాతము" వున్నది. ఇందులో దేశభక్తుడు, దేశ సేవకుడు అన్న ఇరువురు వ్యక్తులు ఆనాటి పరిస్థితులను గూర్చి చర్చించు కుంటారు. "విష్కంభము" లో చెప్పినట్లు దేశకాల సంఘటనల వర్ణన, "ప్రస్తావన"లో చెప్పించినట్లు రచయితను గురించి, నాటకాన్ని గురించి పరిచయము చూపబడ్డాయి.

దేశభక్తుడు: ఇదివర కిట్టి నాటకము లేమి యున్నట్లు లేవే!

దేశసేవకుడు: మన భాషలో ఇదియే మొదటి నాటకము. ఇదివరకు రాజకీయ సంబంధములైన నాటకము లేమియును లేవు.[8] ఈ నాటకం "సులభ శైలిలో నుండునా? పెద్ద ప్రబంధ శైలిలో నుండునా?" అన్న ప్రశ్నకు దేశసేవకుడు "రాజకీయ విషయములలో ప్రబోధము కలిగించుటయే ముఖ్యాభిప్రాయము కావున, సామాన్య జనులకు అనగా ఏమీ చదువురానివాళ్ళకు కూడా అర్థమగునట్లు సంభాషణయోగ్యమైన శైలిలో వ్రాసినారని నేను విన్నాను.[9] అని సమాధానం చెబుతాడు.

ప్రథమాంకం ప్రథమ రంగంలో ఇంగ్లీషురావు, నారదుని మరపించుతాడేమో అన్నట్లు గొప్ప త్రిలోకసంచారి అయిన అరవిందస్వాములవారు-ప్రపంచంలో ఇంతవరకు వచ్చిన అవతారములను గూర్చి చర్చిస్తారు. అరవిందస్వామి పురాణాల్లో చెప్పబడిన దశావ తారాలు గాక, క్రీస్తును, మహమ్మదును చేర్చుకొని పన్నెండు అవతారాలు చేస్తాడు. అంతేకాదు, దేవుడు వీరినందరినీ శాసనసభగా నేర్పరచి ఆ సభాసమ్మతముగా రాజ్యము చేయుచుండును" అంటాడు. ఆయన మాటల ప్రకారము దేవుడు అంతవరకు వచ్చిన పదకొండు అవతార పురుషులతో కూడి సమావేశం చేస్తూవుండటం పన్నెండవ

అవతార పురుషుడు తిలక్ ఆయన మరణానంతరం స్వర్గానికి రావటం రెండు మూడు రంగాల్లో చూపబడ్డది. పదకొండు అవతారాల జన్మావశ్యకతను నిరూపించిన తర్వాత

"కలియుగంబున జన్మింపవలయునింక
కలికినై కొన్నిరూపంబు లిల వెలుంగ
నందు ప్రథమాంశగా తిలక్ నయితినింక
గాంధిగావలె ధర్మంబు గాచుకొరకు"[10]

అని దేవుడు పలికి తన్నిర్వహణార్థము గాంధిగా అవతరిస్తాడు.

మూడవ రంగంలో దేవుని అవతారరూపాలైన రామ, కృష్ణ, పరశురామాదులందరు భారతదేశ పరిస్థితిపై ఆందోళన చెంది దేశమున కెలానైనా స్వతంత్రము సాధించిపెట్టవలసిందిగా దేవుణ్ణి కోరుతారు.

"మర్త్యలోకంబునకు శిరోమణిగ నెంచబడెడు
భరతదేశంబున హానిసత్వ మేలసాగెడును"

అని కృష్ణుడు,

"సత్యలోకానగూడ ప్రజాప్రభుత్వ మిటుల కొనసాగు
చుండగా, పృథ్వియందు హైందవుల భూమిని
నిరంకుశాధికార మేల సాగించుచుంటివో
ఎఱుగజెపుమ"

అని రాముడు ఆయనను కోరుతారు. వీరి విన్నపములన్నీ విని దేవుడు కలియుగంలో ధర్మాన్ని కాపాడటానికి కొన్ని అవతారాలు "తిలకునై నాడ గాంధి గాదలంచుచుంటి" అంటాడు. సర్వజనాంగీకారంతో దేవసభ ముగుస్తుంది.

ద్వితీయాంకంలో ముఖ్యమైన సంఘటనలు – లోకమాన్యుని మరణం, గాంధీలో తిలక్ చైతన్య శక్తి ప్రసరించటం చూపబడ్డవి.

తృతీయాంకంలో తిరిగి దైవసభ, లోకమాన్యుని స్వర్గారోహణ, ముఖ్యమైన సంఘటనలు. తిలక్‌కు స్వాగతం యిచ్చిన దేవసభ గాంధీ అవతారాన్ని గూడ చూచి దీవనలిచ్చి పంపిన బాగుండునని తలుస్తుంది. అందువల్ల గాంధీ స్వర్గసభకు వేంచేస్తాడు.—"పరాత్పరుండవు వరాలకొండవు ధరాధినాయక శ్రీహరీ" అనే పాట పాడుకొంటూ స్వర్గసభకు వస్తాడు. సభాసదులందరు గాంధీకి అభినందనలు తెల్పుతారు. చివరిరంగంలో గాంధీ మహోదయం, నవయుగారంభం చూపబడ్డది. తిరిగి అరవిందస్వామి ప్రవేశించి ప్రశ్నాత్మకులైన దేశసేవకాది జనులకు గాంధీజీ నూతనావతారంగా జన్మించిన సంగతి చెబుతాడు. "నిన్నటినుంచీ అసలు ప్రపంచక తత్వమే మారిపోయింది. అది యొక యుగం. ఇది యొక యుగం..... .....గాంధీ మహాత్ముని మార్గమున దేశము సత్వర విముక్తి గాంచనున్నది" అన్న హామీనిస్తాడు.

"గాంధిమహాత్ముడిక్కలియుగాన దురంతము
రూపుమాపి మూ
ఢాంధుల మేలుకొలుపుచు దురాత్ముల చెండుచు
భారతీయ మా
తన్ ధర లేవనెత్త నవతారము దాల్చెను"

అంటూ శ్రవణానందంగా గాంధీమహాత్ముని చరిత్రను వినిపిస్తాడు చివరి రంగంలో జ్యేష్ఠపుత్రుడైన తిలక్ మరణించడంతో మూర్ఛనొందిన భరతమాతను గాంధీజీ సేదతీర్చి తన్ను గూర్చి చెప్పుకుంటాడు. "జననీ ధన్యుడనైతి దీవన సహస్రంబుల్ ప్రసాదించి పావనుగా జేసితివమ్మ" అంటూ ఆమె పాదాలకు నమస్కరిస్తాడు. తుదకు భారతమాత సేదదీరి,

"నవయుగారంభ సమయ మానందభరిత
మై చిరునగవులన్ దేల నహహా నేడు
నూతన వికాస మనెడు భానుండిదే మ
హోదయంబందె జయ జయ నాదములను
గాంచినారలె గాంధియుగంబువచ్చె"[11]

అంటూ సంతోషచిత్త అవుతుంది. గాంధీజీని అందరూ తమ నాయకుణ్ణిగా స్వీకరిస్తారు. గాంధీజీ మరొక సంవత్సరంలో స్వరాజ్యాన్ని సంపాదించాలంటాడు. తుదకు సత్యాగ్రహమన్న వ్రతాన్ని గూర్చి భరతమాత పొగడ్తలతో నాటకం మంగళాంతమవుతుంది. "పరమ పావనమైన అహింసా మార్గమును నమ్మి మిమ్ముల సామర్థ్యముతో నడుపగల మహాత్మా గాంధీ నాయకత్వమున మీరెల్లరును జయము గాంచుదురుగాత. మీకు శుభమగుగాత. సత్వర స్వరాజ్య ప్రాప్తి కలుగుగాత" అన్నది భరతమాత చివరి దీవన.

ఈ నాటకంలో కవి సామాన్య ప్రజలకు నచ్చే పౌరాణిక భావాలనే స్వీకరించి దేవుని నూతనావతార సిద్ధాంతాన్ని - ప్రతిపాదిస్తాడు.

*గాంధీ విజయము :* ఇది దామరాజువారి రెండవ నాటకము. "ఇందు గాంధీగారి యుగ మారంభమైనప్పటి నుండియు నాగపుర సభానంతరము వరకు నున్నవి యున్నట్లు దేశీయ పరిస్థితులు వరుసగా వర్ణింపబడినవి .... రాజకీయ చరిత్ర నెప్పటికప్పుడు వర్ణించుటయే ముఖోద్దేశము". గాంధీజీ నాగపూర్ సభల్లో దేశానికి నేతగా స్వాతంత్ర్య సమరానికి నాయకుడుగా అన్ని వర్గాల వారిచేత ఆమోదింప బడ్డాడు. ఆ విజయాన్ని యిందులో నాటకీకరించారు రచయిత.

"*గాంధీ మహోదయము*"లో నాందీ పద్యములో భరతమాత స్తవము ఉన్నది. ఈ నాటకంలోని నాందిలోని రెండు పద్యములు

గాంధీజీనే స్మరిస్తాయి. అందులోని రెండవ పద్యం ఆంధ్రదేశం నలుమూలలా మారుమ్రోగింది.

"కత్తులు లేవు, శూలములు గాండివమున్
మొదలే వహిశక్కి నో
రెత్తి ప్రచండ వాక్పటిమ నేనియు
జాటడు, వైరిమీద దం
డెత్తగ సేనలేదు, బలహీనము కాయము,
కోపతాపముల్
బొత్తుగ సున్న, అట్టి ఘనమూర్తి మనో
బలశాలి గాంధి జే
యెత్తి నమస్కరించి స్మరియించెద నెప్డు
స్వరాజ్య సిద్ధికిన్."[12]

ఈ నాటకంలో కూడా ప్రస్తావనాదికములను దేశభక్తుడు దేశసేవకుడు పూరిస్తారు. తిరిగి యిక్కడ కూడా దేశభక్తుడు దేశభవిష్యత్తును గూర్చి విచారిస్తూంటే దేశసేవకుడు అతనిని పూరడిస్తూ

రండు స్వరాజ్యపు రథములాగ
నవస్యము రండటంచు, ను
ద్దండ మనోబలంబు ప్రదితంబుగ
శాంతము బూని దైవపు
త్రుండనివార్య బుద్ధి బలధుర్యుడు
గాంధి మహాత్ముడి ద్ధరా
మండలమెల్ల మ్రోగ వరమంత్రము
నూత్న మతంబు జెప్పెడున్"[13]

అని మహాత్ముడు ప్రారంభించిన యీ సత్యాగ్రహమనే వరమంత్ర

మును ఆయన క్రొత్తగా ప్రారంభించలేదని అదివరకే దాని మాహాత్మ్యాన్ని దక్షిణాఫ్రికాలోనే పరీక్షించారని నచ్చచెబుతాడు.

ఈ నాటకంలో ప్రథమాంకంలోని ఒకటవ రంగం గాంధి-అరవింద ఘోషుల మధ్య సంభాషణతో ప్రారంభమవుతుంది. ఈ సంభాషణ ద్వారా నాటక కర్త ఒక వినూత్నమైన సత్యాన్ని వెల్లడిస్తున్నారు. గాంధీజీ క్రొత్తగా రాజకీయాలలో ప్రవేశించినవాడు, అరవిందుడు రాజకీయాలనుంచి విరమించినవాడు. అరవిందుడు ఆధ్యాత్మిక తత్త్వవేత్త, గాంధీ రాజకీయాలను ఆధ్యాత్మికతను సమ్మిళితం చేయడానికి ఉత్సుకత చూపుతున్నవాడు. ఈ పరిస్థితుల్లో వారి సంభాషణ-రచయితకు గాంధీజీ ఆధ్యాత్మిక వాదం, రాజకీయాలలో దానిని ప్రయుక్తం చేయడం - వీనిపట్ల నమ్మకాన్ని తెలియజేస్తుంది.

అరవిందుడు తన వద్దకు వచ్చిన దేశీయులకు గాంధీ మాహాత్మ్యాన్ని వక్కాణించి వారిని గాంధీజీని అనుసరించండని హితవు చెప్పడంతో వారందరు గాంధీని కీర్తిస్తూ కీర్తనలు పాడుకుంటూ నిష్క్రమిస్తారు. ఇలా గాంధీజీ నాయకత్వానికి మిగిలిన నాయకులు కూడా చేదోడువాదోడై నిలుస్తారని చెప్పడానికి యీ పూర్వ రంగం ఎంతో పనికివస్తుంది.

ఈ అంకంలోనే రామయ్య, బాపిరెడ్డి అన్న రైతులు పర ప్రభుత్వం తమపైన విధిస్తున్న పన్నుల బాధకు తట్టుకోలేక ఏనాటికి తామీ నిరంకుశత్వంనుంచి విముక్తులమౌతామా అని తలపోస్తూ వ్యాజ్యాలను గురించి, డబ్బులన్నీ విదేశీ కోర్టులకు అర్పించడాన్ని గురించి హేయంగా భావించుకొని-తమ బాధలను తీర్చండని చెప్పడానికి మహాత్ముని వద్దకు పోవడానికి సిద్ధమౌతారు.

ఇదే అంకంలో కలకత్తా కాంగ్రెసు సభలకు ముందున్న రాజకీయ పరిస్థితిని యిరువురు విద్యార్థుల ద్వారా చెప్పిస్తాడు రచయిత.

1 వ విద్యార్థి : ". ఇప్పుడు గాంధీ ఒక్కడే అయినాడు. మాలవ్యా అటూ యిటూ వూగుతున్నాడనివిన్నాము. పాలు, దాసులు వ్యతిరేకంగా వున్నారట. మన మద రాసు అయ్యంగార్లు కూడా వారిలో కలసినారట. ఇక తీర్మానం నెగ్గటం ఎలా చెప్పండి."[14]

కాని దీనిని రెండవ విద్యార్థి పూర్వాపస్తం చేస్తాడు.

2 వ విద్యార్థి : ఇవన్నీ ఆగుతవండీ! గాంధీ అంటే పూర్వపు గాంధీ అనుకున్నారా యేమి? తిలకు మూర్తి అవతారము చాలించి గాంధీలో ప్రవేశించినాడట! మొన్న ఆయన మరణ కాలంలో జరిగిన సంగతి మీరు వినలేదా?[15]

తుదకు కలకత్తా కాంగ్రెసుకు పోవలసిందేనన్న తీర్మానంతో వారు విడిపోతారు.

రెండవ అంకంలో షౌకతలీ ద్వారా హిందూ మహమ్మదీయుల సమ్మేళనం గురించిన ఆవశ్యకతను వివరిస్తాడు నాటకకర్త. షౌకతాలి "కోపావేశంతో యిక ఆంగ్లేయులతో యిలా ప్రవర్తించిన లాభ ముండదు, హింసయే వారిని దారికి త్రిప్పగలద"న్న భావాన్ని వెల్ల డించినప్పుడు గాంధీ అతనిని వారించి అహింసా ధర్మాన్ని వుపదేశి స్తాడు. "శాంతి మార్గమే జయమునకు రూఢి అయిన పథము గాని నీ వంటి తేజోవంతు లాగ్రహులగుచో విప్లవము వాటిల్లదా?" అని ఊరడిస్తాడు. "శాంతము వీడి యాగ్రహము సల్పిన కార్యము సిద్ధి జెందునే"[16] అని కోపగిస్తాడు.

కలకత్తాలో జరిగిన కాంగ్రెసు సమావేశాలు యిందులో అతి వివరంగా వర్ణించబడ్డాయి. కాంగ్రెసు సభలను అలంకరించడంనుంచి, నాయకుల సమావేశాలవరకు ప్రతి అంశము యిందు చూపించబడ్డది.

"స్వదేశమాత నీ పదారవిందముల్
సదా మదిన్ భజించెదన్ సుగంధు గూర్చుమా"[17]

అంటూ బాలభటులు పాడుకొనే పాటలు.

మేలుకొనుమీ భరతపుత్రుడ
మేలుకొనుమీ సుజనమిత్రుడ
మేలుకొనుమీ సచ్చరిత్రుడ
మేలుకొనుమయ్యా వత్సా మేలుకో"[18]

అన్న మేలుకొలుపు పాటలు ఆనాటి ప్రజలు సమధికోత్సాహంతో పాడుకొనేవారు.

లాలా లజపతిరాయ్ అధ్యక్షతన జరిగిన యీ సభావిశేషాలు యిందులో యథార్థతకు అతి దగ్గరగా చిత్రించబడ్డాయి. నాయకులు అసహాయోద్యమ సిద్ధాంతాల చర్చలలో వుండగా, "స్వాభిలాషి", "సగర్వి" అన్న యిరువురు కాంగ్రెసు వాదులు "ఎంతసేపు జూచినను లోకమాన్యుడు, మహాత్ముడు అని పడిచచ్చేవారేగాని మా పేరు, ఊరు తలచువారెవ్వరూ లేరు" అన్న ఈర్ష్యతో ఏదో ఒక పదవి రావాలన్న స్వాభిలాషతో కుతంత్రాలు పన్నడానికి ఆలోచిస్తూ వుంటారు. 1920-21 లలో స్వాతంత్ర్య భావాలు దేశ ప్రజలను ముంచెత్తుతున్న రోజుల్లో, యీ స్వార్థపరత్వం యిలా మొలకలెత్తి వుండగా-యిక యీ నాటి స్వార్థపరత్వాన్ని గురించి మనం విచారించే పనిలేదనుకుంటాను.

తృతీయాంకంలో కాంగ్రెసు సభలో, గాంధీజీ సిద్ధాంత ప్రతిపాదన, వాదోపవాదాల అనంతరం దానిని ఆమోదించడం చూపబడ్డాయి.

" ..ప్రహ్లాదు సత్యాగ్రహ వ్రతంబె
రాజమార్గంబు హైందవ నైజమునకు"[19]

అనీ

"...స్వేచ్ఛగాంచు
నాశలేదు పూర్వపు దారులందు జనిన"

అనీ

"అరయుడి ఒక్క వత్సర సహాయ
నిరాకరణంబు వింతలన్
జరుపు స్వరాజ్య మప్పుడె వశంబు..."

అనీ గాంధీజీ చెప్పిన మాటలు సర్వజన ఆమోదయోగ్యాలవుతాయి. కాని ఆ ఆమోదానికి ముందు నాయకులలోని వైరుధ్య భావాలు కూడా యిందులో చక్కగా చూపబడ్డాయి.

గాంధీజీ తన తుది ఉపన్యాసంలో శాసనసభలలో చేరడంవల్ల ప్రయోజనం లేదని, శాసనసభలను బహిష్కరించాలని, న్యాయ స్థానాలను, ప్రభుత్వవిద్యాలయాలను బహిష్కరించాలని ఆదేశిస్తాడు. రంగంమీదనే గాంధీ తిలక్‌ను ధ్యానించడం[20] తెరలో ఆతడు ప్రత్యక్షమై "గాంధీ మహాత్ముని ధైర్యము వీడనీయకుడు" అని చెప్పడం-యీ నాటి ప్రేక్షకులకు వింతగా వుండవచ్చు. అంతేకాదు. "ఆవేశుడు" అన్న పాత్రను ప్రవేశపెట్టి తిలక్‌ను గూర్చి తలచుకొన్నప్పుడు ఆతనికి ఒళ్ళు పెరగడం చూపుతాడు రచయిత. ఆ ఆవేశంలో "ఆవేశుడు"

"మీలో మీరు పోరుచుంటకిదియా
మేలైన కాలంబు ?......
........................
మేలున్ గీడును గుర్తెరింగి మనుడీ మీ
రైకమత్యంబునన్."[21]

అని అందరినీ హెచ్చరిస్తాడు. అందరూ అతనినే తిలక్‌గా భావించి ఐకమత్యాన్ని సంధానించుకొని గాంధీజీ తీర్మానాన్ని ఆమోదిస్తారు.

చతుర్థాంకంలో కలకత్తా కాంగ్రెసు తర్వాత రాజకీయ వర్గాలలో కలిగిన వైమనస్యం, ఒక ప్రక్క శాసనసభలకు పోవడమే మేలని వాదించే మాలవ్యా మొదలైన వారు, రెండవ ప్రక్క గాంధీజీ అసహాయోద్యమాన్ని ఆమోదించిన వారు - ఈ యిరువర్గాల మధ్య కొంత వ్యతిరేకత చూపబడ్డది. నిజానికి ఈ వైమనస్యపు చీకట్లలోనే నాగపూర్ కాంగ్రెసు ప్రారంభమవుతుంది.

ఈ మధ్యలో శాసనసభలకు ఓట్లకోసం కొట్లాటను చూపే "ఓట్ల హాస్యము" అన్న రంగమొకటి సృష్టింపబడ్డది. ఓట్ల పెట్టెలో ఓట్లు పడకపోవడాన్ని ఆఫీసరు విచారంగా నెమరువేసుకోవడం యిందులో చూపబడ్డది.

నాగపూర్ మహాసభలో గాంధీజీ తిరిగి తన అసహాయోద్యమ ప్రణాళికను ప్రజలముందుంచి దానిని ఆమోదించి, త్యాగం చేయడానికి ప్రజలందరూ సిద్ధపడాలని కోరడం పంచమాంకంలో చూపబడ్డది. తుదకు పాల్, మాలవ్యాలు కూడా గాంధీజీ పంథానే అనుసరించడానికి నిర్ణయించడం కూడా యిందు చూపబడ్డది.

పంచమాంకము చివర గాంధీజీ తన అసహాయోద్యమంతో పాటు యితర నిర్మాణ కార్యక్రమాలను, సూత్రాలను కూడా ప్రజల కెరుకపరుస్తాడు.

మరువకండి మీరు మాతృదేశపు సేవ
ప్రప్రథమమని స్వప్నముననైన
.. ...... .. .. .....

అంటూ ప్రజలు వేనిని వేనిని మరువకూడదో బోధిస్తాడు. తుదకు

"మరిమరి వచింతు శాంతము మరువకండి"

అని చెప్పడం గాంధీజీ పాత్రకు న్యాయంచేకూర్చినట్లే.

ఈ నాటకం ఆంధ్రదేశం నలుమూలలా విజయధ్వానం చేసింది. కొన్ని వేలసార్లు ప్రదర్శించబడ్డ యీ నాటకం ఆనాటి కాంగ్రెసు సభలన్నింటికీ ఒక వినూత్నమైన ఆభరణమని పేర్కొనడం సత్య దూరంకాదు.

ఈయన వ్రాసిన మరొక రాజకీయ నాటకం **"పాంచాల పరాభవము"**. ఇందు పంజాబు హత్యలు జరిగినవి జరిగినట్లు చూపబడ్డాయి. పాంచాలి వస్త్రాపహరణము, డయ్యరు దుర్యోధనుని పరిపాలనం చిత్రించబడ్డాయి. వర్తమానాన్ని చూపడానికి వెనుకటి పౌరాణికతను ధ్వనింపజేయడంవల్ల పామరులకు కూడా యీ నాటకం హృద్యమైనది.

దామరాజు వారి నాటకాల తర్వాత పేర్కొనవలసినది పండిత సీతరామ విరచితమైన **"స్వారాజ్య ధ్వజము"**. దీనిని సమవాకారము-3 అంకముల నాటకము అన్నారు నాటకకర్త. బహుళః ప్రఖ్యాతమైన ఇతివృత్తం, 3 అంకాలు వుండి, వీరరసం ప్రధానంగా వున్నది కనుక దీనిని సమవాకారము అనివుండవచ్చు. ఈ నాటకం 1921 లోనే రెండు సార్లు ముద్రింపబడ్డది.

నాటక ప్రారంభంలో విష్ణుశర్మ, రామవర్మ అన్న ఇరువురి సంభాషణ దేశంలోని స్థితిగతులను గూర్చి చర్చిస్తుంది.

విష్ణు : ధర్మసంరక్షణార్థమై యుద్భవించి గాంధీ మహాత్మ్ముం డాచంద్రార్కతారావనీశరధి స్థాయిగ నుండుగాక. భారతీయులు సత్వరస్వారాజ్య సిద్ధిని బడయుదురుగాక.

రామ : ... ఎక్కడ చూచినా గాంధి నామమే. ఏమిటో వెఱ్ఱిగోల.

విష్ణు : ఇది వెఱ్ఱిగోలకాదు. గాంధీ మహాత్మ్ముని యాధ్యాత్మిక శక్తియే యిందులకు కారణము.

రామవర్మ హూణరాజుల ప్రతిభను కొనియాడుతాడు. అప్పుడు విష్ణుశర్మ దక్షిణాఫ్రికా, చాంపరాన్, కైరా మొదలైన చోట్ల గాంధీజీ చేసిన అద్భుతమైన పనులను లీలలుగా వర్ణించి

"ధర్మసంస్థాపనార్థమై ధరను జనన
మందినాడట్టి గాంధి ప్రయత్నములు స
ఫలితములు గాకయుండునె భారతీయు
లందకుందురె మోదంబు నాత్మలందు."

అంటూ మహాత్ముణ్ణి భగవంతుని అవతారంగా సూచిస్తాడు. ఈ విష్కంభమయ్యాక ప్రథమాంకంలో రత్నకుమారి - భారతపుత్రుల మధ్య సంభాషణ జరుగుతుంది. రత్నకుమారి భారతపుత్రునికి జలియన్‌వాలాబాగ్ దురంతాలను ఎరిగించి అతణ్ణి సత్యాగ్రహోన్ముఖుణ్ణి చేస్తుంది.

ద్వితీయాంకంలో భారతమాత భారతపుత్రుడితో తన బాధలు చెప్పుకుంటుంది. అందులోనే మరో రంగంలో తిలకు మరణానికి పూర్వము తిలకు గాంధీల సమావేశం జరుగుతుంది. తిలక్ గాంధీజీకి అతని కర్తవ్య నిర్వహణం బోధిస్తాడు. అప్పుడు

తిలక్ : ఒక్కసారి కన్నుమూసి తెరువుము.

గాంధి : . లోకమాన్యా! ఈ యద్భుతమేమి ? నా చిత్తమంతయు మారిపోయినది. ఒక నూతన శక్తి నాలో ప్రవేశించినది అంటాడు.[22]

తృతీయాంకంలో భారతమాత పాంచాలిని ఓదారుస్తుంది.

భరతమాత : (పాంచాలిని చూచి) అమ్మా పాంచాలి, నీవు చింతింపకుము. సాక్షాత్ శ్రీకృష్ణరూపుడైన గాంధీ మహాత్ముడు

సమస్త భారతజన సంతాప నివారణార్థమై సహాయనిరాకరణ మహాస్త్రమును సంధించాడు. ఈ గాంధీ యవతార పురుషుడని ఎరుంగుము.

"ఒర సుధర్మముల్ నశియించి బరగుచున్న
భరత భూమికి దొల్లింటి వైభవంబు
వెలుగజేసి ధర్మంబు స్థాపించుకొరకు
వాసుదేవుండె గాంధియై వరలినాడు"[23]

తుదకు దేశభక్తుడు అసహాయోద్యమ గీతాలు పాడుతాడు. ఈ గీతాల చివర "తిరునగరి వెంకటసరససూరి బోధ వినరండీ" అని వుండటంవల్ల ఈ గేయాలు తిరునగరి వేంకటసూరి వ్రాసినవై వుండవచ్చు.

ఊరూరా ప్రదర్శింపబడిన ఈ నాటకాలలోని నటులను గురించి డాక్టర్ పి. యస్. ఆర్. అప్పారావుగారు తమ "ఆంధ్ర నాటక వికాసము" అన్న గ్రంథంలో వ్రాసిన విషయాలు ఇక్కడ పేర్కొనదగినవి :

"ఆనాడు పత్రి శీనప్ప (గుంటూరు) గారి బృందము ఈ నాటకములను బహుళముగా ప్రదర్శించెడిది. శీనప్పగారి గాంధీ వేషము అత్యద్భుతముగా నుండెడిదట. ఈ బృందమునందలి ఇతర నటులు : శ్రీయుతులు జగర్లపూడి లక్ష్మీనరసింహారావు (భరతమాత), ఏకా ఆంజనేయులు (దేశభక్తుడు), వింజమూరి శ్రీనివాసాచారి (అనిబిసెంటమ్మ), సింగు (డయ్యరు) ప్రభృతులు" (పుట 388-89).

## ఆలీ ప్రభృతుల నిర్బంధము

శ్రీ జంధ్యాల అయ్యావారి శాస్త్రి వ్రాసిన ఆలీ ప్రభృతుల నిర్బంధము (1921) కూడా 3 అంకముల నాటకమే. ఖిలాఫత్ ఉద్యమ నాయకుడైన ఆలీ సోదరుల విచారణలను గురించి వారి నిర్బం

ధనులను గురించి విపులంగా వ్రాయబడిన నాటకమిది ఇందులో గాంధీజీ ఒక పాత్ర. ఈ నాటకానికి ముందుమాట వ్రాస్తూ "దేశభాషయందు పెక్కు నాటకములు వెలువడుచున్నవి. ప్రస్తుత పరిస్థితుల ననుసరించి రాజకీయ విషయములను ప్రజాసామాన్యమునకు నాటక రూపముగా సులభశైలిని తెలియునట్లుగ జేయనెంచిన వారిలో నే నొక్కడను" అని చెప్పుకొన్నాడు రచయిత.

ఈ నాటకము నాందీ ప్రస్తావనాదులతో వుండి గాంధీ స్తవంతో ప్రారంభమవుతుంది.

"శ్రీకరభారతక్షితిని జెన్నువహించిన మేటిశత్రు కో
టీకరముల్ యహింసయని డీకొని కొట్టినజట్టి దీవరా
నీకము సంతసిల్ల భువి నేర్పున తత్త్వము బోధజేయు భా
షా కమనీయుడైన మన సాత్వికగాంధికి కేలుమోడ్చెదన్"

ఇందులో కూడ ప్రథమాంకం విష్కంభంతో ప్రారంభమవుతుంది - కరాచి వీథిలో రామయ్య, హుమయూన్ అన్న ఇరువురి సంభాషణతో—

రామ : మన కేకీభావం కలుగజేసిన నాయకులలో నగ్రగణ్యుడెవరో ఎరుగుదువా ?

హుమ : అతడు మహాత్మాగాంధి యని ఎరుగుదును గాని వాని ప్రభావ మంతగా నాకు తెలియదు.

రామ : అయితే చెప్పెద వినుము-అంటూ గాంధీజీ గుణగణాలను కీర్తించి

"గాంధి ఋషివర్యు డాతడు కమలనాభు
డనగ గీర్తిని వడసిన ననఘమూర్తి"

అని ప్రశంసిస్తాడు. ప్రథమాంకంలోనే గాంధీజీ ఖద్దరు, స్వదేశీ వ్రతం, అహింసా వ్రతం, హిందూ ముస్లిము సఖ్యత, మొదలైనవాని గూర్చి విశాఖపట్టణంలో వుపన్యాసం చెప్పినట్లు చూపింపబడుతుంది.

ఈ అంకంలోనే మరో రంగంలో "మద్యాసురుడు" అన్న ఒకడు తప్పత్రాగి తూలుతూ వస్తే ప్రచారకులు అతన్ని నిందించటం చూపింపబడ్డది. కాని అహింసా పద్ధతుల్లో కాక ఈ ప్రచారకులు ఆ మద్యాసురుని మీద చేయి చేసుకుంటారు.

1 వ ప్ర. : రే నీచాధమా! ఎక్కడకు పోయెదవురా? మా సోదరుల రక్త మెంతవరకు గ్రోలెదవురా? (అని కొట్టును).

ద్వితీయాంకంలో భారతమాత సుదీర్ఘమైన స్వగతం చొప్పించ బడ్డది. అందులో ఆమె గాంధీని కీర్తిస్తూ పోతున్న గంధర్వుల మాటలు విని ఆనందిస్తుంది.

భరత : (పైకిచూచి) ఆ పోవు గంధర్వు లేదో సందర్భమున నా చిన్ని గాంధీని మహాత్మునిగ బోల్చి వాని సద్గుణములను సన్నుతించుచున్నవారలు. ధన్యురాలనైతిని.

మూడవ అంకంలో కోర్టు వ్యవహారాలు, న్యాయవిచారణ, జైలు శిక్షలు వివరంగా చూపబడ్డాయి. ఈ నాటకంలో నాటకీయత కన్న, కథోపకథనం ఎక్కువగా వుండటంవల్ల రంగస్థలం మీద అంతగా రక్తికట్టినట్లు కన్పించదు.

### తిలకమహారాజ నాటకము

ఈ నాటకానికి కర్త శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు. ఇది తిలక్ చనిపోయిన వెంటనే వ్రాయబడ్డ నాటకం. పది అంకాలు గల ఈ నాటకానికి కథానాయకుడు తిలకమహారాజు. గాంధీ, కేల్కార్,

లజపతిరాయ్ కథానాయకుని మిత్రులు. ఈ నాటకంలో గాంధీ దశమాంకంలో మాత్రమే ప్రవేశిస్తాడు.

తిలక్ : (వారందరినీ అల్లేడ్వవద్దని చెప్పి గాంధిం బిలచి) "గాంధీ నీవు మహాత్ముడవు. నీ వొక్కమారు నన్నుం గౌగలించుకొని నా హృదయంబున నీ శిరంబు జేర్చియుంచుము."

గాంధి : (చెప్పినట్లు చేసి కొంతలో) లోకమాన్యా! నా కిప్పుడేదియో మహాజ్యోతి యొకటి కనంబడి నన్నలముకొన్నది.

తిలక్ : (గాంధీ వీపుపై చరచుచు) నీకు విజయం బగుగాక ! పోయిరమ్ము.[24]

తిలక్ మరణానంతరం గాంధీ వుపన్యసించడంతో నాటకం ముగుస్తుంది.

## గాంధీ విజయధ్వజ నాటకము

గాంధీజీ జీవితాన్ని గూర్చి శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు వ్రాసిన నాటకమిది. ఇందులో సమగ్రమైన మహాత్ముని కథ చూపింపబడ్డది (1921). శ్రీపాదవారు ఈ నాటకానికి పీఠిక వ్రాస్తూ గాంధీ "శంకరరామానుజమధ్వబుద్ధాది మతకర్తలుంబోలె సర్వజనైకమత్య మతోద్ధారకుడై యవతరించిన మహాపురుషుడు గాని సామాన్యుడు గాదు" అని పేర్కొని దానికి కారణాలను సుదీర్ఘంగా వివరించారు.

"అతని శాంతియను పాశుపతాస్త్రము ధర్మయుద్ధమున విద్వేషులనెల్ల నిరాయుధుల జేసి విజయం బాపాదించుచున్నయది".

ఇంతటి లోకోత్తర గుణవిరాజితుడైన మహాత్ముని చరిత్ర నాటకీకరించడం తనవంటి అల్పులకు అశక్యమని చెబుతూ "భక్తిభావనయందు గౌరవలాభంబులు లేవు. ఆశకు మేరయును లేదు. కావుననే నేని

ట్లుద్యమించితిని గాని సామర్థ్యమున గాదు" అంటూ వినయం ప్రకటించారు.

తొమ్మిది అంకములున్న ఈ నాటకంలో మహాత్ముడు దక్షిణాఫ్రికాలో భారతీయులకు చేసిన సేవ దగ్గరనుంచీ నాగపూర్ కాంగ్రెసు వరకుగల అన్ని విషయాలు ప్రవేశపెట్టబడ్డాయి. చివరి అంకంలో ప్రజలు గాంధీజీని పూజించటం, విజయధ్వజప్రతిష్ఠ మున్నగు విషయాలున్నాయి. ఇందులో గూడ 6 వ అంకంలో తిలకు నిర్యాణ సమయంలో తన శక్తిని గాంధీజీకి ఇవ్వడం చూపింపబడ్డది. మహాత్ముని జీవితంతో పాటు ఆయన నిర్మాణ కార్యకలాపాలు, ఆయన విదేశ వస్తుబహిష్కరణ, రాట్నము, హిందూమహమ్మదీయుల సఖ్యత, మద్యపాన నిషేధము, న్యాయవాదులు న్యాయసభలను బహిష్కరించటం మొదలైనవి చేర్చబడ్డవి. దీనికి వ్రాసిన పీఠికలో "దీనికి మొదట నేను గాంధీవిజయ మని పేరు పెట్టితిని గాని ఈలోగా నొకరా నామమున[25] గ్రంథము ప్రకటించుటం జేసి విజయమునకు నామరూపంబు లుండవనియు, దాని వెలయింప జేయునది ధ్వజమనియు, సహాయనిరాకరణోద్యమ విజయ కాలంబున స్వరాజ్యధ్వజము ప్రతిష్టించుటయుం జేసియు దీనికి గాంధీ విజయధ్వజంబని నామకరణం బొనర్చి ప్రకటించితిని" అంటారు. అంటే ఒకటి రెండు మాసాల వ్యత్యాసంలో ఇదే విషయంపై నాలుగైదు నాటకాలు వ్రాయబడ్డాయన్నమాట. ఈ నాటకము వీరి తిలకమహారాజ నాటకానికి తరువాత వ్రాయబడ్డది.

ఇదిగాక రాజకీయ నాటకాలలో చేర్చతగినవెన్నో అముద్రితాలుగానే వుండిపోయినవి.[26] ఇట్టి నాటకాలలో ఒకటి పాతూరి అంజయ్యగారు వ్రాసిన "**భారత దివ్యాదర్శనము**" అన్నది. రచనా కాలం 1923-24. ఈ నాటకంలో రచయిత ఆంధ్రదేశంలో రాజకీయ

వాతావరణాన్ని ముఖ్యంగా సత్యాగ్రహోద్యమాన్ని గురించి పేర్కొంటూ అందులో ఆంధ్ర నాయకులకు గాంధీజీ హితబోధలు చేసినట్లు చూపారు.

ముద్రితములైన రాజకీయ నాటకాలలో ముద్దా విశ్వనాథం గారి[27] **జన్మభూమి** మంచి రచన. జాస్తి వేంకటనరసయ్య, ధూళిపాళ వేంకటసుబ్రహ్మణ్యముగారలు కలసి వ్రాసిన "*కాంగ్రెసు విజయము*" (1945) అన్న నాటకంలో 60 ఏళ్ళ కాంగ్రెసు చరిత్ర సంగ్రహంగా చెప్పబడ్డది. ఇందులో మూడు అంకాలు వున్నాయి.

| | | |
|---|---|---|
| 1. | సంస్కరణాంకము | 1885 - 1929 |
| 2. | సంపూర్ణ స్వరాజ్యాంకము | 1929 - 1940 |
| 3. | ప్రజావిప్లవాంకము | 1940 - 1945 |

ఇందులోని ప్రతి రంగములో కూడ ఆ రంగములోని సంఘటన జరిగిన సంవత్సరం చూపబడ్డది. ఉదాహరణకు

| | |
|---|---|
| 1 వ రంగము | 1904 - 1905 |
| 2 వ రంగము | 1910 |
| 3 వ రంగము | 1918 |
| 4 వ రంగము | 1921 |

ఇది ఒక అంకములోని విభజన.

ఈ నాటకంలో గాంధీజీని 1918 లో జవహర్ లాల్ ఆయన భార్య కమలాదేవిల సంభాషణలో ప్రవేశపెట్టారు రచయితలు. 1921లో ప్రకాశం పంతులుగారు గాంధీజీ ప్రతిభను ఇలా శ్లాఘిస్తారు.

ప్రకాశం :— ఆహా ! గాంధీజీ ప్రతిభ ఎంతని కీర్తింతును ? అతడు సేవాసత్యముల అపరావతారమే. నిస్సంశయము.

1922 లో పెదపూడిలో శ్రీ తుమ్మల బసవయ్య గాంధీగారి ఆశయముల ప్రచారం చేస్తూ స్వదేశీవ్రతంవల్ల వచ్చే లాభాలను

ప్రజలకు వివరిస్తాడు. శ్రీ తుమ్మల బసవయ్య అకలంకమైన దేశ భక్తుడు. గాంధీవాది. గుంటూరు జిల్లాలో స్వామి సీతారాంతో బాటు స్వాతంత్ర్యోద్యమ నాయకుడైనాడు. ఇలా ఈ నాటకంలో భారతీయ ఆంధ్ర రంగాలలో జరిగిన రాజకీయ పరిణామాన్ని, సత్యాగ్రహోద్యమ వ్యాప్తిని సంభాషణల ద్వారా సూచించారు. వీనితో పాటు భారతీరంగా, వున్నవ లక్ష్మీబాయమ్మ వంటి సంఘ సేవికలు విదేశవస్తుబహిష్కారము, మద్యనిషేధము, అస్పృశ్యతా నివారణ మొదలైన గాంధీ నిర్మాణ కార్యకలాపాలను ప్రజల్లో ప్రచారం చేయడం చూపబడ్డది. ఇందులో గాంధీజీనుంచి అందరు రాజకీయ నాయకులు పాత్రలుగా ప్రవేశపెట్టబడ్డారు.

ఇలా ఎన్నో రాజకీయ నాటకాలు ఆనాటి ప్రజల్లో గాంధీగారి వుద్యమ విషయాలు కథావస్తువుగా స్వీకరించి ప్రదర్శింపబడి ప్రజల మన్ననలకు పాత్రమైనాయి. ఇందులో కొన్ని సాహిత్యము దృష్ట్యా కూడా వున్నతమైన స్థానం అలంకరించతగినవి. అట్టివానిలో దువ్వూరి రామిరెడ్డిగారు వ్రాసిన **"కాంగ్రెసువాలా"** (1935) పేర్కొనతగిన రచన. ఇందులో ముగ్గురు ప్రధాన పాత్రలు వున్నారు. రమణాశ్రమ వాసి కల్యాణరెడ్డి, శాంతినికేతనవాసి రంగారావు, కాంగ్రెసువాది వెంకటరెడ్డి. వీరిలో వెంకటరెడ్డి నాయకుడుగాను మిగిలిన ఇద్దరు ప్రతినాయకులుగాను వుద్దేశించబడ్డారు. శాంతినికేతన రమణాశ్రమ వాసుల ఆంగ్లేయ భాషాభావాల వ్యామోహాన్ని స్వదేశవాది అయిన వెంకటరెడ్డి ఎదుర్కొని దేశభక్తిని, మానవత్వాన్ని ప్రముఖంగా చూపటమే ఈ నాటకం యొక్క ముఖ్యమైన వుద్దేశ్యము.

రంగా : మిష్టర్ వెంకటరెడ్డి! గాంధి వుద్యమము ప్రబలమైనప్పటి నుండి మన దేశంలో చాల అల్లకల్లోలం బయలుదేరింది. కవిత్వం పైన, ఆర్టుపైన వుత్సాహం తగ్గింది...ఇదంతా గాంధీకి

ఈ స్త్రటిక్సు ఆర్టు తెలియని లోపం. గాంధీ ఆర్టును మర్డరు చేశాడు.[28]

వెంక : మీరు తెలుసుకోదగిందానికంటె గాంధీ చాల గొప్ప ఆర్టిస్టు. ఆయన కాన్వాసు అయిదారడుగుల చుట్టుకొలత కలదికాదు. హిందూదేశమంత విశాలమైంది. ఆయన న్యూటన్ కంపెనీ రంగులతో చిత్రించడు. లోకకల్యాణానికి ఆత్మార్పణం గావించిన తన నిరాడంబర జీవితంనుండి అపూర్వమైన త్యాగ సౌలభం ఈ అనంత భారతీయాకాశాన్నంటి ఇంద్రధనుర్వర్ణము లతో ప్రభాతరాగజ్వాలలను చిత్రిస్తున్నది. ఆ మనోహర దృశ్యం ప్రపంచమందంతట అన్ని జాతులవారిని ముగ్ధులను గావిస్తున్నది.[29]"

ఇలా ఎక్కడికక్కడ గాంధీజీ గొప్పతనాన్ని వెంకటరెడ్డిద్వారా చూపుతాడు రామిరెడ్డిగారు. చివరకు వెంకటరెడ్డి మానవత్వాన్ని చూచి శాంతినికేతనపాసి రంగారావు మారుతాడు గాని కల్యాణరెడ్డి మాత్రం "మా మహర్షి ఈ దృశ్యం చూస్తే!" అని వ్యంగ్యంగా పలుకుతాడు. ఈ ముగింపు గిరీశం చెప్పిన "డామిట్ కథ అడ్డం తిరిగింది"లా వుండి కన్యాశుల్కాన్ని తలపుకు తెస్తున్నది.

"*గాంధేయ విజయము*" అన్న శ్రీ యడ్లపల్లి కోటయ్య వ్రాసిన నాటకం "ఆధునిక సమస్యలను గూర్చి జనసామాన్యమునకు ప్రబోధము కావింపవలయునన్న"[30] అభిప్రాయంతో వ్రాయబడ్డది. ఈ గ్రంథ కర్త ఈ నాటకం వ్రాయటం ఎంతైనా సమంజసమని పట్టాభిగారి అభిప్రాయము. దానికి కారణం "ఈయన భారత జాతీయతా పునర్నిర్మాణమునకును, సత్యాహింసలపైన నాధారపడియున్న గాంధీమత సిద్ధాంతముల వ్యాపకమునకును, కాంగ్రెసు సంస్థ యొక్క కార్య క్రమ సంచాలనమునకును అపారమైన సేవచేసియున్నాడు."

ఈ నాటకాన్ని *"గాంధేయ విజయము"* అనటంవల్ల గాంధీ మతానుయాయుల విజయమని గాంధీ సిద్ధాంతాల విజయమని చెప్ప వచ్చు. ఉపోద్ఘాతంలో పట్టాభిగారు చెప్పిన పధ్నాలుగు గాంధీ సూత్రాలను ఈ నాటకంలో యథాశక్తి పొందుపరిచారు రచయిత. ఆనందరావన్న దేశభక్తుడు కాంతారావు అన్న భూస్వామిని, విశ్వ నాథము అన్న పురాతన సాంప్రదాయిని ఎదుర్కొని గాంధీ సూత్రాల ద్వారా పల్లెలలోని కష్టాలను, అస్పృశ్యతను నివారించటానికి ప్రయత్నం చేస్తాడు.

నాంది పద్యంలోనే హిందూ మహమ్మదీయుల సఖ్యతను గూర్చి సూత్రధారుడుగా గానం చేశాడు రచయిత.

"శ్రీ విలసిల్ల హిందువు లశేషమహమ్మదు
భక్తు లెల్లరున్
భావము లేకమై మెలగు భాగ్యమెలర్పగ
నంటరాదు పొం
డావలికంచు నెట్టబడునట్టి నికృష్టతమాన్చి
ఏకతన్
చేవదలిర్ప చేపనులచే విలసిల్లెడి మాత నెంచెదన్.

అంటరానితనము, కుటీర పరిశ్రమలు వీనిని తన నాటకంలో ప్రధాన సమస్యలుగా చిత్రీకరించారీయన. దేశ దురదృష్టాన్ని చూచి బాధా తప్తుడై యింతలో గాంధీజీ వున్నాడు. ఆయనను అనుకరించటమే మనం చేయవలసిన పని అని మనస్ఫూర్తిగా నమ్మిన ఆనందరావు చివరకు ఆధ్యేయ నిర్వహణలో కృతకృత్యుడవుతాడు.

"దేశ దాస్యంబు ద్రుంచంగ దివ్యమూర్తి
గాంధి ఏతేర భయమేమి, కానిదేమి ?

జన మనోవీధి నిరతంబు సంచరించి
జేతునిక మాతృదేశ సంసేవనమ్ము"

కథకు ఫలశ్రుతిగా హరిజనులు దేవాలయ ప్రవేశం చేయటంతో నాటకం పరిసమాప్తమవుతుంది. శాంతాశారదలు మంగళహారతులు పాడతారు.

"మంగళమో దేవా......దేవా ॥మం॥
అంటరాదనుచు హరి నీ జనులను
గెంటిన పాపం బంటగనీయక
కంటి కింపుగా నీ హరిజనులను
గాచి మమ్ము రక్షింపు దయావర" ॥మం॥

స్వాతంత్ర్యం వచ్చాక వ్రాయబడ్డ జాతీయ నాటకాలలో శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి వ్రాసిన "అంకితం" అన్న నాటకం ఒకటి. ఈ నాటకానికి గాంధేయ సిద్ధాంతాలలో ఒకటైన గ్రామ పునర్నిర్మాణము యితివృత్తంగా స్వీకరించబడ్డది. ఈ గ్రామ పునర్నిర్మాణ సందర్భంలో అనేక సమాజాభివృద్ధికరమైన విషయాలు ఇందులో ప్రస్తావితములైనవి — ఖద్దరు, చేనేత, కుటీర పరిశ్రమలను ప్రోత్సహించటం మొదలైనవి. ఇందులో అంజయ్య పాత్ర ఈ నాటికీ మిగిలివున్న వృద్ధ గాంధేయులకు ప్రతీక.

కొడాలి సుబ్బారావు వ్రాసిన "ఆహుతి" హిందూ ముస్లిముల సఖ్యతను గూర్చి వ్రాయబడ్డ నాటకం

ఆంధ్రనట ప్రకాశిక నిర్దేశకులైన శ్రీ పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రిగారు వ్రాసిన "గ్రామసేవ" (1954) అన్నది స్వాతంత్ర్యానంతరం పల్లెల్లో గాంధీజీ ఆశయాలకు అనుగుణంగా జరగవలసిన కార్యక్రమాల విధిని నిర్ణయిస్తూ వుంది. బ్రాహ్మణ

అగ్రహారంలో హరిజనులు పడే కష్టనష్టాలను కళ్ళకు కట్టినట్లు కన్పింప చేశారు రచయిత యీ నాటకంలో.

గ్రామ జీవితాన్ని నాటకీకరించిన వారిని గూర్చి చెప్పవలసి వచ్చినప్పుడు శ్రీ బోయి భీమన్నను మరచిపోవటం కష్టం. ఆయన వ్రాసిన "పాలేరు", "కూలిరాజు" నాటకాలు అచ్చమైన గ్రామ జీవితానికి ప్రతిబింబాలు. "మానవుని మరొక మజిలీ" అన్న నృత్య నాటకం ప్రకృతిని విశ్వరూపంగా భావించి మానవుడు ఆ ప్రకృతిని చేరడానికి రూపొందించుకున్న దశల నన్నింటిని వివరంగా చిత్రిస్తూంది. మానవుని క్రమ వికాసాన్ని గూడా ఈ నాటకం చూపుతుంది. గృహ పరిశ్రమలను గూర్చి, రాట్నాలను గూర్చి యిందులో ప్రస్తావనవుంది.

ఈయనే వ్రాసిన "పడిపోతున్న అడ్డగోడలు" "పాలేరు" కు వలెనే అస్పృశ్యతాభావాన్ని కూకటివ్రేళ్ళతో లాగివేయటానికి రచయిత చేసిన ప్రయత్నం. ఆధునిక రచయితల ధార్మికమైన ఆగ్రహం అంతా భీమన్న కలానికి వుంది. అనుభవంలోనుంచి పైకి వచ్చిన చేదు నిజాల అనుభూతి వుంది. ఈ రెండింటి కలయికే భీమన్న నాటకాలు. ఈ కోవకు చెందినదే "**రాగవాశిష్టము**". అరుంధతి కథకు ఆధునిక వ్యాఖ్యానం యీ నాటకం.

గాంధీజీ నిర్మాణ కార్యక్రమాలలో మద్యపాన నిషేధం ముఖ్యమైనది. దాని ప్రచారార్థం తెలుగులో అసంఖ్యాకములైన నాటకాలు వ్రాయబడ్డాయి. వీనిలో ముఖ్యమైనది కాళ్ళకూరి నారాయణరావుగారి "**మధుసేవ**". ఈ నాటకంలో మధుపానంవల్ల కష్టనష్టాలకులోనై తుదకు ఒక గాంధేయునివల్ల సన్మార్గానికి త్రిప్పబడిన వ్యక్తిగాథ చిత్రీకరింపబడింది. కొండాలి సత్యనారాయణరావు వ్రాసిన "**సురానంద**" కూడా పై తరగతికి చెందినదే. "దేశమున కనర్థదాయక మగు త్రాగుడును త్రోసివేయ" ఈ నాటకమును వ్రాశాడు రచయిత.

గాంధీజీ తన 14 సూత్రాల్లో విదేశ వస్తుదహనంతోపాటు కోర్టుల బహిష్కరణను కూడ పేర్కొన్నారు. అందువల్లనే ఆయనపై ఎన్ని ఆరోపణలు వచ్చినా తానుగా ఏ న్యాయవాదిని నియమించుకోలేదు. తన తరఫున వాదించటానికి ఏ న్యాయవాదికి అనుమతి ఇవ్వలేదు. అదే భావాన్ని "వరవిక్రయం" నాటకంలో పురుషోత్తమరావు చూపుతాడు. "నేను గాంధీవాదిని...నాకు న్యాయవాదులక్కరలేదు" అంటూ గాంధీ సూత్రాలఎడ తన భక్తిని వెల్లడిస్తాడు.

గాంధీ సూత్రాలలో అతి ముఖ్యమైనది హిందూ మహమ్మదీయ సఖ్యత. ఈ విషయంమీద తెలుగులో చాల నాటకాలు వ్రాయబడ్డాయి. అందులో ఆత్రేయ వ్రాసిన "ఈనాడు" ముఖ్యమైన రచన. పృథ్వీ థియేటర్స్ ప్రదర్శించే "దీవార్" నాటకానికి దీనికి దగ్గరి పోలికలు కన్పిస్తాయి. హిందూముస్లిం సంఘర్షణల్లో ఇద్దరు స్నేహితులు (అందులో ఒకడు హైందవుడు మరొకడు మహమ్మదీయుడు) ఒకరికొకరు సహాయపడి తుదకు ప్రాణాలైనా అర్పించడానికి సంసిద్ధులు కావడం యీ నాటకానికి ఇతివృత్తం. ఇది రంగస్థలంమీద పలుమార్లు విజయవంతంగా ప్రదర్శింపబడిన నాటకం. ఆత్రేయ నాటకాలన్నింటివలెనే నాటకీయత ప్రబలంగా వున్నది దీనిలో.

ఆత్రేయ వ్రాసిన నాటకాలలో "విశ్వశాంతి", "గౌతమబుద్ధ" అన్న నాటకాలు కూడా పరోక్షంగా గాంధీజీ సిద్ధాంతాలవల్ల ప్రబోధితాలైనవే

గాంధీజీ వలన ప్రభావితములైన కావ్యసాహిత్యంలో ప్రత్యక్ష ప్రభావితాలు, పరోక్షప్రభావితాలు వున్నట్లే నాటకాలలో కూడా ఆనాటి వుద్యమచరిత్రను యథాతథంగా చిత్రించే రాజకీయ నాటకాలతో బాటు ఆ వుద్యమానికి మూలకందమైన స్వాతంత్ర్యేచ్ఛను,

ధర్మయుద్ధ ప్రభావాన్ని నిరూపించే చారిత్రక పౌరాణిక నాటకాలు కూడా ఎన్నో వెలువడ్డాయి. సంఖ్యలో రాజకీయ నాటకాలకన్న ఇట్టి నాటకాలే అధికము. దీనికి రెండు కారణాలు చెప్పవచ్చు. ఒకటి- ఇందులోని కథ రచయితకు, ప్రేక్షకులకు కూడా తెలిసి వుండడంవల్ల అటు రచయితకు రచనలో సౌలభ్యము, ప్రేక్షకునకు తాదాత్మ్యం చెందటంలో సహజత్వము ఏర్పడుతాయి. రెండవ లాభము అధికారుల ఆగ్రహానికి గురకాకుండానే నాటక కర్తలు తాము చెప్పదలచుకొన్న భావాలను పరోక్షంగా ఆయా పాత్రల ద్వారానే చిత్రించవచ్చు. నిజానికి వుద్యమ ప్రారంభంలో వచ్చిన రాజకియ నాటకాలన్నీ ప్రభుత్వంచే నిషేధింపబడటంతో ఈ చారిత్రక, పౌరాణిక నాటకాల అవసరం ఇనుమడించింది.

### పౌరాణిక నాటకాలు

గాంధీజీ సాగించిన అసహాయోద్యమ ధర్మ యుద్ధానికి "ధర్మక్షేత్రే కురుక్షేత్రే" అని పేరుపొందిన భారత యుద్ధానికి చాల సామ్యాలు వున్నాయి. మొదటి సామ్యం గాంధీజీ బోధించిన "కర్మవీరము"లో వున్నది. భగవద్గీతకు వ్యాఖ్యానంచేస్తూ గాంధీజీ దానిని "నిష్కామయోగము" అన్నాడు. ఏ నిష్కామయోగాన్నైతే యుద్ధ భూమిలో కృష్ణుడు అర్జునునకు వుపదేశించాడో అదే సిద్ధాంతాన్ని గాంధీజీ అసంఖ్యాకులైన తన అనుయాయులకు వుపదేశించాడు. అందువల్లనే గాంధేయ సిద్ధాంతాలను ప్రపంచించటానికి ప్రధానంగా భారత గాథలను ఎన్నుకున్నారు నాటక కర్తలు. ఇట్టి నాటకాలలో తిరుపతి వేంకటకవుల "ఉద్యోగవిజయాల"ను పేర్కొనవచ్చు. ఆరు భారత కథలను తిరుపతి వేంకటకవులు నాటకీకరిస్తే అందులో ఉద్యోగవిజయాలే ఎందుకంత ప్రచారానికి రావాలి?- అని ప్రశ్నించుకుంటే దానికి సమాధానం ఒక్కటే. ఆ నాటకాలు

వ్రాయబడినప్పుడు దేశ పరిస్థితులకు అనుగుణంగా వున్న భాగాలు ఏవో వానినే ప్రేక్షకులు ఆదరించారు. తిరుపతి కవుల శైలీ కవిత్వాదులు ఈ నాటకాలలోనే పరాకాష్ఠకు చేరాయన్న వాదాన్ని ఎవ్వరూ అంగీకరించరు - ముఖ్యంగా సంస్కృతానువాదాలను గమనించిన తరువాత. కాని ఉద్యోగవిజయాలలో శ్రీకృష్ణుడు రాయబారిగా పోవటం, దురాత్ములైన కౌరవులు సంధిని అంగీకరించక పోవటం, యుద్ధం అనివార్యం కావటం, ఈ దశలన్నీ భారత జాతీయోద్యమానికి కూడా మనం ఆపాదింపవచ్చు.

"అలుగుటయే ఎరుంగని మహామహితాత్ము డజాతశత్రువే
యలిగిననాడు సాగరములన్నియు నేకము గాకపోవునే ?"

అన్న శ్రీకృష్ణుని మాటలలో ఆనాటి ప్రతి ప్రేక్షకునికి గాంధీజీ ప్రత్యక్షమయ్యేవాడు.

ఇలా భారత నాటకాలతో ప్రారంభించి, "పద్మవ్యూహము", "ద్రౌపదీవస్త్రాపహరణము" వంటి నాటకాలలో గూడ యీ ప్రచ్ఛన్న జాతీయతను వెలువరించారు రచయితలు.

కాళ్లకూరి నారాయణరావుగారు వ్రాసిన "పద్మవ్యూహము" (1919) నాటకం అభిమన్యుని వధకు సంబంధించిన నాటకం. ఈ నాటకం చివరలో కృష్ణుడు అర్జునునకు చేసిన ఉపదేశంలో స్వరాజ్యోద్యమాన్ని గూర్చిన ప్రశంస ఉండడం గమనించదగ్గ విశేషం.

ఈ సందర్భంలో పౌరాణిక గాధలకు సమకాలీన భావాలను ఆరోపించి ఒక విలక్షణమైన నిగూఢభావ రూపకాలను (Allegory) వ్రాసిన నాటకకర్తలు కొందరున్నారు. ఇట్టి నాటకాలలో శ్రీ బుద్ధవరపు పట్టాభిరామయ్య వ్రాసిన "మాతృదాస్య విమోచనం" పేర్కొనదగిన రచన.

"మాతృదాస్య విమోచనము" (1924) పూర్తిగా పౌరాణిక కథ. ఇందు వినత కద్రువల కథ చెప్పబడినది. వినత కద్రువలు ఒక పందెం వేసుకొన్నప్పుడు కద్రువచేసిన మోసాన్ని గ్రహించలేని వినత తన ఓటమిని అంగీకరించి కద్రువకు దాస్యం చేయటానికి అంగీకరి స్తుంది. తన తల్లిచేస్తున్న దాస్యవృత్తిని చూడలేక వినతాసుతుడైన గరుత్మంతుడు ఆ మాతృదాస్యశృంఖలాలను త్రెంచివేయడానికి శపథం తీసుకుంటాడు. తుదకు కద్రువ కుమారులైన నాగేంద్రులు కోరిన కోరికతో వారినే శిక్షించి తల్లికి స్వేచ్ఛను సంపాదించాడు గరుత్మంతుడు. ఈ నాటకంలో వినతను భారతమాతగాను, గరు త్మంతుణ్ణి భారతీయ ప్రజలుగాను, కద్రువ కుమారులైన నాగులను ఆంగ్లేయులుగాను చూపుతాడు రచయిత.

"మాతృప్రేమను ప్రజలెల్ల మసలునట్లు
దాస్యమున నేరు బాధల నందకుండ"

చేయవలసిందిగా పౌరాణిక కాలంలోని మాతృశృంఖలానిబద్ధనము నకు కంకణం కట్టుకొన్న స్వాతంత్ర్య యోధుడైన గరుత్మంతుడు వాసుదేవుని ప్రార్థిస్తాడు.

### చారిత్రక నాటకాలు

గాంధీజీ నాయకత్వాన స్వాతంత్ర్యోద్యమం 1921 నుంచీ క్రొత్త పుంతలు త్రొక్కటం ఆరంభించింది. అదే సంవత్సరం తెలుగు సాహిత్యంలో మొట్టమొదటిసారి రాజకీయ నాటకాల ప్రాదుర్భావం జరిగింది. ఇదే సంవత్సరంలో దాదాపు 18 చారిత్రిక నాటకాలు వచ్చాయి. ఇందులో రాణాప్రతాపునిగూర్చిన నాటకాలు 8, శివాజీని గురించిన నాటకాలు 5, ఆంధ్ర వీరులను గూర్చిన నాటకాలు 5 వున్నాయి. ఇన్ని చారిత్రిక నాటకాలు మరి ఏ సంవత్సరం వెలు

పడలేదు. దీనికి కారణం ఏమిటి ? ఒక్క మాటలో చెప్పాలంటే ఈ నాటకాలన్నీ జాతీయోద్యమంవైపుకు ప్రజల దృష్టిని మళ్ళింప చేయటానికి ఇంకా ఎక్కువ సంఖ్యలో అందులో పాల్గొనటానికి రచయితలు చేసిన ప్రయత్నమేనని స్పష్టమౌతుంది.

రాణాప్రతాపుని గూర్చి వచ్చిన నాటకాలలో *"రాజపుత్ర తేజః పుంజము"* అన్న ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణశాస్త్రిగారి నాటకం ముఖ్యమైనది.

ఈ నాటకంలో ఆద్యంతమున సూత్రధారుడు ప్రవేశించి సభాసదుల నుద్దేశించి "దేశాభిమానులగు సభాసదులారా !" అని సంబోధిస్తాడు. అక్కడినుండి నాటకం చివరి వరకు స్వాతంత్ర్యకాంక్ష పూర్వ కాలంలో ఎంత బలమై నిలచినదో చూపుతూనే వున్నది. ఇందులోని పద్యాలు పాటలు రెండు దశాబ్దాలపాటు ఆంధ్రదేశాన్ని వుఱ్ఱూత లూగించాయి.

"ఆపదలందు ధైర్యమె సుఖాస్పదమౌ నిజకార్యసిద్ధి దీ
ఙా పరతన్ లభించునను సత్యము నిక్కము
చాటి తెల్పగన్[31]"—

ఈ నాటకాన్ని వ్రాసినట్లు రచయిత చెప్పుకున్నాడు.

శ్రీపాద కామేశ్వరరావుగారి *"చంద్రగుప్త"* నాటకం రాజమంద్రి అమెచ్యూర్ సంఘముచే విజయవంతముగా ప్రదర్శించబడి ప్రజల ఆదరాభిమానములకు పాత్రమైంది.

ఈ కాలంలోనే *"రోషనార శివాజి"* అన్న పేరుతో ధర్మవరం వారి నాటకం, *"శివాజి విజయం"* అన్న పేరుతో మొసలికంటి హనుమంతరావు, కేతవరపు రామకృష్ణశాస్త్రిగార్ల నాటకాలు వెలువడ్డాయి. 1922 లో డి. యల్. రాయ్ వ్రాసిన *"మేవాడు రాజ్యపతనము"*ను పింగళి నాగేంద్రరావుగారు అనువదించారు. ఈ నాట

కాన్ని ఇండియన్ డ్రమెటిక్ కంపెనీవారు చాల సమర్థతతో ప్రద ర్శించేవారు.

ఒక ప్రక్క భారత చరిత్రకు సంబంధించిన నాటకాలు యిలా రచింపబడి ప్రదర్శింపబడుతున్న కాలంలోనే ఆంధ్రచరిత్రను గూర్చిన నాటకాలు కూడా వెలువడ్డాయి. ఇవి కూడా జాతీయోద్యమ భావా నికి పురస్కారములైనవని వేరుగా చెప్పనక్కరలేదు. ఇట్టి నాట కాలలో "*కృష్ణరాజ విజయము*" వంటి నాటకాలు ముఖ్యమైనవి. ఆంధ్రులకు అతిప్రియములైన "*పల్నాటి వీరచరిత్ర*", "*బొబ్బిలి యుద్ధము*" వంటి కథలపై పదిహేను నాటకాల వరకు వ్రాయ బడ్డవి. ఇవి అన్నీ ప్రజల్లో జాతీయతా భావాన్ని పెంపొం దింప చేసినవే [32]

సబ్నవీసు రామారావుగారి "*రైతుబిడ్డ*" (1939) గాంధీజీ ఆశయాల కనుగుణమైన గ్రామ పునర్నిర్మాణ సూత్రాలమీద రూపొందించబడ్డ నాటకం. "గ్రామోద్యోగులవల్లనేమి ఉత్తమ వర్ణులవల్లనేమి, ఆర్థిక నిరంకుశత్వమున బద్ధ దీక్షితులైన యజమానుల వల్లనేమి పేదరైతు పడ్డపాట్లను అనల్పమైన నేరిమితో చిత్రించిరి" అన్న జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారి అభిప్రాయము సత్య దూరం కాదు. ఈ నాటకానికి ముట్నూరి, కాటూరి, అడవి బాపి రాజు, ఉన్నవ లక్ష్మీనారాయణ, చింతా దీక్షితులు, గి. వెం. రా. మూర్తి, చిలుకూరి నారాయణరావు, సి. ఆర్. రెడ్డిగార్ల అభి ప్రాయాలన్నీ ఒక్క విషయంలో ఏకాభిప్రాయంలో వున్నాయి. అది ఈ నాటకంలో వాడబడ్డ 'జాతీయ భాష'ను గురించి. అన్నింటికన్న గొప్ప విషయం ఈ నాటకంలో వాడబడ్డ భాష ఎంతకాలమో పరి శ్రమచేస్తే తప్ప అట్టి జాతీయ భాష అలవరచుకొని గ్రంథంలో ఎక్కిం చటం కష్టం అన్నారు చింతా దీక్షితులుగారు. ఈ నాటకం భరత మాత స్తవం, కాంగ్రెసు స్తవాలతో ప్రారంభమవుతుంది. కృష్ణాపత్రి

కలో ధారావాహికంగా వెలువడ్డ యీ నాటకం గ్రామ నిర్మాణాలను గురించి వ్రాయబడ్డ నాటకాలలో ప్రముఖమైనది.

అస్పృశ్యతా నివారణను ఉద్దేశించి వ్రాయబడిన నాటకాలలో శ్రీ ధర్మవరం గోపాలాచార్యులు గారు వ్రాసిన "ప్రేమచంద్ర యోగి" లేదా "అస్పృశ్యా విజయము" కూడా పేర్కొనదగిన రచన.[33]

పైన పేర్కొన్న నాటకములు కాక రాజకీయ భావాలపై - ముఖ్యంగా గాంధీజీ సిద్ధాంతాలను ఆలంబనంగా చేసుకున్న - రచనలలో యీ క్రిందివానిని పేర్కొనవచ్చు: డి. సీతారామయ్య వ్రాసిన "స్వారాజ్య ధ్వజము" (1921), టి. సూర్యనారాయణగారి "స్వారాజ్యభారతము" (1948), ద్వివేదుల సత్యకవి వ్రాసిన "స్వారాజ్య సమరము", పులిజాల వేంకట అప్పారావు వ్రాసిన "స్వారాజ్య సౌధము" (1948).

ఇవికాక ఎన్నో అముద్రిత నాటకాలు - జాతీయోద్యమ ప్రేరకాలు ఉన్నాయి. కొన్ని నాటకాలు 1920-25 మధ్య కాలంలో ప్రదర్శింపబడ్డా, వాని ప్రతులను అధికారులు తగులబెట్టించారట! అటువంటి నాటకాలలో విశ్వనాథ సత్యనారాయణ, కొడాలి ఆంజనేయులుగార్లు కలిసి వ్రాసిన "అవతార పరివర్తనము" ఒకటి. ఆనాటి ప్రభుత్వఆగ్రహానికి గురియైన ఇటువంటినాటకాలు ఎన్నిఉన్నాయో![34]

# 8

# నవలా సాహిత్యం

తెలుగు నాటక సాహిత్యంలో వచ్చినంత రాజకీయ సాహిత్యం నవలలో రాలేదనే చెప్పాలి. 1947 వరకు తెలుగు దేశంలో నవలల కన్న నాటకాలే ఎక్కువ ప్రచారంలో వున్నాయి. పైగా నాటకాలు ప్రదర్శించబడి మారుమూల గ్రామాలకు, చదువులేని వారికి కూడా ఉపయోగపడటంతో సామాన్య ప్రజలను అవి కదిలించినట్లు నవలలు కదిలించలేదు. అందువల్లనే తెలుగులో ప్రచార నాటకాలు ఎక్కువ. నవలలలో సిద్ధాంత ప్రతిపాదకమైనవో, లేదా ఉద్యమ చరిత్ర ఆనాటి వారిపై కలిగించిన ప్రభావాన్ని తెలియచెప్పేవో ఉన్నాయి కాని ఆనాటి రాజకీయాలలో ప్రఖ్యాతులైన వారిని పాత్రలుగా గ్రహించిన నవలలు లేనట్లే.

తెలుగు నవలా రచయితల్లో ప్రఖ్యాతులందరూ ఏదోవిధంగా గాంధీజీ ప్రభావానికి లోనైనవారే. ఎక్కడో ఒకచోట - తమ నవలలలో - గాంధీజీని గురించి ఆయన దేశంలో కలిగించిన సంచలనాన్ని గురించి గ్రంథస్థం చేసినవారే! ఇలా ప్రభావితమైన నవలలలో - ఉన్నవవారి "**మాలపల్లి**",విశ్వనాథ "***వేయిపడగలు***", అడవి బాపిరాజు

"నారాయణరావు", "కోనంగి", బుచ్చిబాబు "చివరకు మిగిలేది", కొడవటిగంటి "చదువు", మహీధర రామమోహనరావు "కొల్లాయి గట్టితేనేమి", ముప్పాళ రంగనాయకమ్మ "బలిపీఠం" ప్రథమ శ్రేణిలో చేర్చదగినవి. ఇవికాక యింకా అనేకమైన నవలలలో యీ విషయం ప్రస్తావించబడ్డది. అందులో కొన్నింటిని ఇక్కడ పేర్కొనడం జరిగింది.

## మాలపల్లి

"మాలపల్లి" అత్యుత్తమమైన తెలుగు నవలలలో ఒకటి. ఇందులోని కథ మాల, మాదిగలనబడే హరిజనులకు సంబంధించినది. వారి ఉన్నతికి గల మార్గాలను అన్వేషించి వారిని అభ్యుదయ పథంవైపుకు త్రిప్పడానికి కృషిచేసిన ఉత్తమ సాధనం యీ నవల. ఇది గాంధీజీ సిద్ధాంతాలవల్ల ప్రభావితమైన అన్ని రచనలలోను మేలుబంతి. ఉన్నవ లక్ష్మీనారాయణగారు ఆనాటి ఆంధ్రదేశంలోని ప్రథమశ్రేణి నాయకులలో ఒకరు. పదవులపై కాక నిర్మాణ కార్యక్రమాలపై దృష్టి నుంచిన నిజమైన కార్యకర్త.[1] ఈ నవల వ్రాయబడిన సమయానికే భారతదేశం నలువైపులా గాంధీజీ నామం భగవన్నామంవలె మననం చేయబడుతున్నది. అందులోనూ ఉన్నవవారు స్వీకరించిన అస్పృశ్యతా నివారణ, హరిజనోద్యమము - అన్న సమస్య గాంధీజీకి అతి ప్రీతిపాత్రమైనది. ఇన్ని కారణాలవల్ల యీ నవల తెలుగులోని గాంధేయ సాహిత్యంలో మణిపూస అనిపించుకున్నది. కాని యింత ఉత్కృష్టమైన గాంధేయ రచనలో ఎక్కడా గాంధీజీ పేరైనా ఉటంకించబడలేదు. అందువల్ల దీని ఆధిక్యత యినుమడించింది.

"వర్తమాన కాలమునందు ప్రజాజీవన వికాసమున కాధారములైన వర్ణాశ్రమ ధర్మములు, సాంఘికాచార వ్యవస్థలు, రాజ్యాంగములు, మత విశ్వాసములు, వృత్తులు ధనార్జన విధానములు, ధర్మ

సాధనములు సాహిత్య రచనలు - మొదలగు సకల వ్యవస్థలును, శిథిలములై పునర్నిర్మాణము నపేక్షించుచున్న విధమును ప్రపంచావృతమైన మహా పరివర్తనము విశదము చేయుచున్నది ఉన్నవ లక్ష్మీనారాయణగారు మాలపల్లియందు సంకల్పించిన నవజీవన నిర్మాణ విధానము లాంధ్ర సాహిత్య సంస్కారమునందు నూతనాధ్యాయములు "[2]

పై మాటలు కాశీనాదుని నాగేశ్వరరావు పంతులుగారివి. పంతులుగారి మాటలు ఎంతైనా యథార్థములు. ప్రజా జీవితానికి ముఖ్యమైన అన్ని వ్యవస్థలూ పతనం పొందుతున్న రోజుల్లో క్రొత్త జాతి, క్రొత్తతరాల పునర్నిర్మాణానికి మాలపల్లి ద్వారా ప్రయత్నం చేశారు ఉన్నవ వారు.

గ్రంథానికి ఉంచిన పేరునుబట్టే "మాలపల్లి" నవల హరిజనాభ్యుదయాన్ని దృష్టిలో ఉంచుకుని వ్రాయబడ్డదని స్పష్టమవుతున్నది. కాశీనాథునివారు అన్న "నవజీవన నిర్మాణ విధానము" ఈ హరిజనుల అభ్యుదయ కాంక్షకు సంబంధించినదే!

"మాలపల్లి" నాలుగు భాగాల బృహద్గ్రంథము. ఈ నాలుగు భాగాలలోనూ ముఖ్యమైన కథ రామదాసువి. నవలలోని అన్ని పాత్రలకన్న రామదాసు పాత్రోన్మీలనమే ఉత్కృష్టమైన విధంగా చూపబడింది అందువల్లనే ఈ నవలను "రామదాసు జీవితచరిత్ర" లేదా "రామదాసు ఆత్మోద్ధరణము" అనవచ్చు. పచ్చని జీవితంతో ఆనందమయమైన సంసారంతో ప్రారంభమైన రామదాసు జీవితం ఎన్నో ఎత్తుపల్లాలలో పయనించి చివరకు జీవితంలోని ఆకర్షణలు, అన్ని ఉద్వేగాలు వదలి సన్యసించటంతో అంతమవుతున్నది. పెరిగిన పంటచేనును చూసుకుని మురిసిపోతున్న రామదాసుతో నవల ఆరంభమై, ఆయన మౌనిగా, యతీంద్రుడుగా రూపొందడంతో నవల

అంతమవుతుంది. భౌతికమైన సంపదనుంచి కష్టాల మార్గం గుండా ఆధ్యాత్మికమైన సంపదను పొందడానికి ప్రతిమానవుడూ సాగించే యాత్ర రామదాసు జీవితమని చెప్పవచ్చు.

రామదాసు పంచమ కులంలో పుట్టికూడా ఈ యాత్రను ఆసాంతము సాగించడంలోనే రామదాసుయొక్క ప్రత్యేకత విశద మవుతున్నది. పంచమకులంలో పుట్టినా ఆధ్యాత్మికమైన ఔన్నత్యాన్ని సాధించడానికి ఆ కులపు గోడలు అడ్డురావన్న సత్యాన్ని రామదాసు జీవితం మనకు నేర్పుతున్నది. అంతేకాదు. రామదాసు జీవితంలో సాంఘికమైన ఔన్నత్యానికి, వ్యక్తిగతమైన ఔన్నత్యానికిగల అంత రాన్ని కూడా ఉన్నవవారు విశదంగా చూపారు. చిన్న కులానికి చెందిన రామదాసు గొప్పతనం తెలియచెప్పడానికి పెద్దకులాలవారి చిన్నతనం నిదర్శనంగా చూపి తద్వారా రామదాసు యతీంద్రత్వానికి అర్హుడేనని చాటి చెపుతారు రచయిత.

ఈ నవలలో ఆద్యంతమూ ప్రాముఖ్యాన్ని వహించిన మరో పాత్ర సంగదాసుది. సంగదాసు ఈ నవలకు నాయకుడన్నా తప్పు లేదు. ఈ నవలకు "*సంగవిజయం*" అని నామాంతరమున్నది. నిజానికి అది "మాలపల్లి" అన్నదానికన్నా సమంజసమైనది.

ఈ నవల మొదటి భాగం చివరనే సంగదాసు మరణిస్తాడు. కాని అతడు నిజంగా జీవించడం మొదలుపెట్టినది చనిపోయిన తర్వా తనే! "విజయ కళాశాల" స్థాపన, దిగువజాతుల విద్యాసముపార్జ నకు అవకాశం, పంచములను గౌరవంగా చూడడం – ఇవన్నీ సంగ దాసు ఆశయాల పరిపక్వ రూపమే. రామదాసు దిగువ కులాలవారి ఆధ్యాత్మిక (Spiritualism) సంపత్తికి ప్రతీక అయితే సంగదాసు వారి మేధా సంపత్తి (Intellectual element) కి ప్రతీక అని చెప్పవచ్చు. ఈ రెంటి మేళవింపే ఆదర్శవంతమైన జీవితం.

ఈ నవలలో హరిజనోద్ధరణం ప్రధానమైన ఆశయంగా ఉద్దేశించ బడ్డది. దీనికి ఉన్నవవారు రెండు మార్గాలను సూచించారు. ఒకటి వారికి వారు పరిశుద్ధులై ఉండటం, రెండవది మిగిలిన జాతులవారు ఆ విషయంలో వారికి సహాయం చేయడం. ఇక్కడనే - సంకుచిత మైన కుల, మత విషయాలనుంచి మానవతావాదం వైపుకు కథను నడుపుతారు రచయిత.

ఉన్నవవారు ఆస్తికవాదులు కావడంవల్ల హరిజనుల ఆధిక్యానికి, మతానికీ గల సంబంధాన్ని విచిత్రంగా చూపారు. నవలకు వ్రాసిన ముగింపులో యీ విషయంలో వారు తమ వాదాన్ని సిద్ధాంత రూపంలో ప్రపంచించారు. ఈ నవలకు ఈ భాగాన్ని పరాకాష్ఠగా గ్రహించవచ్చు.

"జాత్యాధిక్యత అహంకారమునకు హేతువగుటచే సవర్ణులు భగవంతునకు దూరమగుచున్నారు. కడజాతివారికి మేమెక్కువను అభిమానముండదు. గనుక వారికి ముక్తి సమీపము. సవర్ణులకు అహంకారము ఆజన్మ సిద్ధము, కడజాతికి అనహంకారము జన్మసిద్ధము."[3]

ఈ మాటలద్వారా ఉన్నవవారు సవర్ణులపై సున్నితమైన వ్యంగ్యాన్ని విసిరి కడజాతివారి జన్మసిద్ధమైన అనహంకారాన్ని - భగవంతుడు భక్తులనుండి కోరే ప్రప్రథమ లక్షణంగా చూపారు. అహంకారాన్ని అణుచుకొన్నప్పుడే-నిరహంకారికే భగవంతుని సామీప్యము సాధ్యము- అన్నది అన్ని మతాలకు ప్రాథమికమైన సిద్ధాంతము.

"మాలపల్లి"లో రామదాసు, సంగదాసు, రామానాయుడు అహింసా భావం మూర్తి కట్టినవారు. చౌదరయ్య అమానుష

కృత్యాలకు తన కొడుకు బలి అయిపోయినా, చలించక అహింసా మార్గాన్నే అనుసరించిన రామదాసు చాలచోట్ల గాంధీజీనే తలపిస్తాడు. జీవితంలో ప్రతిక్షణం ఎదుర్కొనే సమస్యలను అతి శాంతంగా రామదాసు ఎదుర్కోవడం చూస్తే అతని ఆత్మ నిగ్రహం మనకు వ్యక్తం అవుతుంది.

ఈ నవల ఆంధ్రదేశంలోని మాలపల్లెల జీవితాలకు యథార్థ చిత్రణ. "పరిపాలనలో ఉన్న భారతదేశపు కుళ్లు యావత్తూ మాలపల్లెలు చూస్తే భూతద్దంలో చూసినట్టుగా కనిపిస్తుంది. ఎందుచేతనంటే మాలమాదిగలు బాధితులచేత బాధితులు" అన్న కొడవగంటి కుటుంబరావుగారి మాటలు సత్యం. ఈ కుళ్లును కళ్లకు కట్టినట్లు చూపించిన నవల "మాలపల్లి". అంతకన్న బీభత్సమైన దృశ్యం సెటిల్ మెంట్ జీవితం. దుఃఖభూయిష్టమైన జీవితాన్ని గడుపుతున్నవారు కూడా సెటిల్ మెంటు జీవితం అంటే భయపడ్డారంటే దాని భయంకర స్వరూపం అర్థం అవుతుంది. రామదాసు అట్టి కష్టాలకు కూడా లోనైనాడు కనుకనే సర్వసంగపరిత్యాగమైన మౌని అయినాడని చెప్పవచ్చు.

ఒక వంక మానవధర్మ పరిణామము, వేరొకవంక సాంఘిక పరివర్తనం సమాంతరంగా చూపబడ్డాయి యీ నవలలో. సాంఘిక రాజకీయ పరివర్తనంతోనే మానవ పరిణామం ఆధారపడి ఉన్నదన్న సంగతి కూడ యీ నవల పరోక్షంగా నిర్వచిస్తున్నది. మానవధర్మ పరిణామం ఏ విధంగా సాంఘిక పరివర్తనంమీద ఆధారపడి ఉన్నదో చూపడానికి యీ నవలలోని మూడు పాత్రలను మనం గ్రహించాలి. వారు రామదాసు, సంగదాసు, వెంకటదాసు.

రామదాసు అంతా కృష్ణమయమనీ మనం నిమిత్తమాత్రులమనీ భావించి కర్మ సిద్ధాంతాన్ని అనుసరించాడు. భగవంతునియందు భక్తి ద్వారా తరించడమే తక్కువ కులాలవారు చేయవలసిన పని అనీ,

అందుకుగాను బాహ్యా, అంతరాలను శుద్ధంగా ఉంచుకోవాలని భావించినవాడు.

సంగదాసు లేదా రామానాయుడు (వారిద్దరు ఒకే భావానికి ప్రతినిధులు కనుక) కులమత భేదాలు సంఘ పతనానికే దారి తీస్తాయని, కడజాతివారు ఎందునా మిగిలిన జాతుల వారికి తీసిపోరని భావించి అందుకుగాను తమ కులాలవారిని ఆర్థిక సాంఘిక రంగాఅలో ఉన్నతులను చేయడానికి ప్రయత్నించారు.

ఇక వెంకటదాసుకు తమ కులం అణచబడ్డ కులం. తమ్ము ఇన్నాళ్లుగా అణచి ఉంచుతున్న యీ ధనిక వర్గాలు సక్రమమైన మార్గాన్ని అనుసరించక పోవడంవల్ల సాంఘికమైన, ఆర్థికమైన సమత్వాన్ని సాధించాలంటే అట్టి ధనవంతులదగ్గరి ధనాన్ని కొల్లగొట్టి బీదసాదలకు పంచాలని నడుం కట్టాడు.

ఒకరిది భక్తి పద్ధతి; రెండవ వారిది ప్రేమ పద్ధతి; మూడవ వారిది వీర పద్ధతి. ఈ మూడు విధాలా సంఘ సంస్కరణ లేదా సంఘ పరివర్తనం జరుగుతుంది. కాలవిభజన ప్రకారం కూడా ఈ మూడు పద్ధతులూ, ముందు మొదటి పద్ధతీ, తరువాత రెండవదీ, ఆ తరువాత మూడవది జరుగుతవని చెబుతుంది.

రామదాసంతటి వాడు కూడా వెంకటదాసు పద్ధతి మంచిదో చెడ్డదో తేల్చలేక—

"నీది చాలా కొత్తనాటకం. నీ నాటకనియమాలు కూడా వేరే. కొత్త పంథా తొక్కావు. నేను మామూలుదారిన బోయిన వాణ్ణి. నీది మార్గం కాదని చెప్పలేనగాని, అంతా అవలంబిస్తే యెట్లా ఉంటుందో చూడాలి. నీ మార్గం నియమబద్ధం మటుకు అవును. ఆ నియమాలు చాల ఉత్కృష్టమైనవీని. అమలులో పెట్టడం కష్టమేమోనని చాలామందికి అనుమానం"

అంటాడు. ఈ మాటల్లో ఆశాభావమూ, సందిగ్ధతా, సమ పాళంలో ఉన్నాయి. వెంకటదాసు పద్ధతి సామ్యవాద పద్ధతి లేదా దానికి పునాది. అందువల్లనే వెంకటదాసు చనిపోతూ చెప్పిన మాటలు భావితరాల వారికి మాగ్నాకార్టావంటివి.

> "అందరూ పనిచెయ్యాలె; అందరికీ ఒకటే భోజనం. ఒకటే మోస్తరు గుడ్డలు......రేపనే దిగులు లేదు......పోటీలు లేవు. ఆదుర్దాలేదు."

అదీ వెంకటదాసు సమతా సిద్ధాంతం. రామరాజ్యమని అనుకునేదీ అదే! అది ఆదర్శరాజ్య మనవచ్చునా ?

## వేయిపడగలు

తెలుగు నవలా సాహిత్యంలో విశ్వనాథవారి "*వేయిపడగలు*" ఒక అపూర్వమైనసృష్టి. ఇది **మూడు** తరాల కథగా ఉద్దేశించబడ్డా, ముఖ్యంగా ఇరవయ్యో శతాబ్దం మొదటి మూడు దశాబ్దాల తెలుగు దేశపు జాతీయ జీవనము ఇందులో విపులంగా చిత్రించబడ్డది. తర తరాలుగా వస్తున్న ఆంధ్రుల జాతీయ జీవన విధానానికి విశ్వనాథ ప్రచారకుడు. అంతమాత్రాన ఆయన నూతనమైన ఉద్యమాలను స్వీకరించి ఆమోదించలేదని కాదు. ఆయన చిత్రించిన ఉత్తమమైన పాత్రలలో కనీసం ముగ్గురు గాంధేయ జీవన విధానాన్ని అనుసరించిన వారే! సుబ్బన్నపేటలో కొత్తగా జాతీయ కళాశాలను స్థాపించిన కేశవరావు, ధర్మరావు స్నేహితుడు రాఘవరావు గాంధీజీ ఉద్యమం చేత ప్రత్యక్షంగా ప్రభావితులైనవారు. ఇక ధర్మారావు తన నడవడి

లోనూ, తన భావాలలోను పూర్తి గాంధేయవాది. కాని జీవికకు అడ్డంకులు ఉండటంవల్ల ధర్మారావు ఏ ఉద్యమంలోను పాల్గొనలేక పోతాడు.

గాంధీజీ సిద్ధాంతాలకు విశ్వనాథ భావాలకు కొన్ని విషయాలలో పోలిక ఉంది. పాశ్చాత్య సంప్రదాయానుసరణ మంటే విముఖత, ఇంగ్లీషు చదువంటే నిరాదరణ - ఈ రెంటియెడ విశ్వనాథకు కూడా ఎంతో ఆత్మీయ భావము. గాంధీజీ నిరాకరణోద్యమాన్ని గురించి విశ్వనాథ యిలా అంటాడు :

> "అప్పటికి మహాత్ముడైన గాంధి సహాయనిరాకరణోద్యమమారంభించి రెండేండ్లయినది. జనులు గాంధి దేవుడై యవతరించె నన్నారు. ఆయనే కృష్ణుడు; రాటములే వేణువు; తన్మధుర ధ్వని వంశీనాదము; భారతదేశము బృందావనము; ప్రజలు గోపికలై యాయన చెప్పినట్లే కోటకుగోట్లు జనులు గుమిగూడి యవలంబించజొచ్చిరి. దేశమునం దింగ్లీషు చదువన్నను పాశ్చాత్య సంప్రదాయానుసరణమన్నను నిరాదరణ కలిగెను."4

ఈ నిరాదరణకు ఫలితంగా కొన్ని వేలమంది విద్యాలయాలలో చదువు మానివేశారు. జాతీయ భావాలకు అనుగుణంగా విద్య గరపడానికి జాతీయ కళాశాలలు ప్రారంభింపబడ్డాయి. అట్టి కళాశాల ఒకటి కేశవరావుగారిచే ప్రారంభింపబడ్డది.

దేశంలో కళలు, విద్యలు, నశించిపోతున్నవని, వానిని సముద్ధరించడం జాతీయ పాఠశాలల విధి అని కేశవరావుగారు తలపోశాడు. గాంధీజీ యిలా ఎక్కడా వివరంగా చెప్పలేదు. దేశీయ

లకు అనువైన, అవసరమైన విద్యను బోధించవలసిందనే ఆయన అభిప్రాయం. కాని విశ్వనాథ దానిని తనకు అనుగుణంగా మార్చుకున్నారు.

ఇక రాఘవరావు తీవ్ర జాతీయవాది. నిరాకరణోద్యమంలో జైలుకు పోయివచ్చినాడు. జైలునుంచి విడుదల కాగానే మద్యపాన నిషేధ కార్యక్రమాన్ని చేపట్టినవాడు. ఆనాటి జాతీయ కార్యకర్తల కష్టాలను రాఘవరావును దృష్టిలో ఉంచుకొని యిలా చెబుతాడు రచయిత :

> "నరసరావుపేటలో నతనికి దానుండుటకు వీలులేకపోయినది. భార్య పుట్టినింటనున్నది. అత్తమామల కల్లునికన్న దౌర్భాగ్యుడు లేడని యూహ."[5]

రాఘవరావు సుబ్బన్నపేటను తన కార్యస్థానం చేసుకున్నాడు. అక్కడ అతడు సమావేశాలు చేయడం. ప్రతి యింటికి పోవడం, మద్యం తాగేవారికి బోధచేయడం - ఇవి అతని కార్యక్రమాలు.

తిరిగి రాఘవరావు దేవుని కల్యాణోత్సవాలకు ముందే మిత్రులకు కన్పిస్తాడు. ప్రాణాలు కళ్ళల్లో ఉంచుకుని జైలునుంచి విడుదలై వస్తాడు. కాని అంతలోనే ఉత్సాహం తెచ్చుకుని కల్యాణోత్సవాల్లో ధర్మారావు ప్రక్కనే ఉండి "ఎదురుకోల" ఉత్సవంలో ఆడపిల్ల తరపున తమ పిల్లను వేణుగోపాలస్వామి కివ్వడానికి రాయబారం వస్తాడు ధర్మారావు, రాఘవరావులకు యీ కల్యాణోత్సవాలు రెండు విభిన్న సిద్ధాంతాలను ప్రతిపాదిస్తాయి. ధర్మారావుకు యీ ఉత్సవాలు ఆధ్యాత్మికతకు నిదర్శనాలు.

"ఈ కల్యాణము లామె (గిరిక) కొఱకే నిర్ణయించినాము... మా గిరిక స్వామికి గడుంగడు ప్రియురాలు. పూర్వకాలపు భారత దేశమున నున్న దేవదాసీత్వ భావమంతయు నామెలో నున్నది."[6]

ఇలా గిరిక ఊహాలన్నీ, ఆమె కోరికలన్నీ యీ కల్యాణోత్సవాలలో ఒక పరిణతకు వస్తాయన్నది ధర్మారావు భావం. ఇక గాంధేయుడుగా రాఘవరావుకి యీ కల్యాణోత్సవాలు భారత జాతీయతకు చిహ్నాలు, సంప్రదాయాన్ని నిలబెట్టి ఉంచే మధుర సంఘటనలు. ధర్మారావు భావం ఆత్మపరమైనది. రాఘవరావు భావం సంఘపరమైనది.

రాఘవరావు శారీరకస్థితి గమనిస్తే ఆనాడు జాతీయోద్యమంలో తమ సర్వస్వాన్ని ఒడ్డిన అనేక యోధుల త్యాగగరిమ కాను వస్తుంది.

ఇక ధర్మారావు - తన చేష్టలవలన కాక తన భావాలవలన గాంధేయవాది. తమ కార్యక్రమాల ద్వారా గాంధేయులైనవారు కేశవరావు, రాఘవరావు. తన మేధాసంపత్తిచే గాంధేయుడైన వాడు ధర్మారావు. తానుకూడ తక్కువ జీతానికి జాతీయ కళాశాలలో చేరడం, ఒక విధంగా తన ఆశయాలకు అనుగుణంగా నడచుకుని అటు సిద్ధాంతాల భావనలోనూ, ఇటు వాని ఆచరణలోనూ, గాంధేయుడై నిరాడంబర జీవితంతోపాటు ప్రయోజనాత్మకమైన జీవితం కూడా గడపాలన్న ఆశయంవల్లనే !

ధర్మారావుకు దేశమన్నా, తమ సంస్కృతి అన్నా వల్లమాలిన అభిమానం. ఈ అభిమానం గాంధేయవాది కావడంవల్ల వచ్చినది. కాని రాజకీయాలకు అతనికిగల సంబంధం ఖద్దరు కట్టడంతో ఆగిపోయింది. కాని అతని సిద్ధాంతపరమైన ఊహాలు జాతి పునర్నిర్మాణం వైపుకు సాగాయి.

### నారాయణరావు

"**నారాయణరావు**" నవలలో ఆద్యంతమూ గాంధేయ సిద్ధాంతాలను గురించిన చర్చ, వివరణా ఉన్నాయి. గాంధీజీ సాగించిన

సత్యాగ్రహ సమరం - దానివలన దేశంలో ప్రారంభమైన ఉత్సుకతా ఈ నవలలో అడుగడుగునా కన్పిస్తాయి. ఏ రచననైనా మూడు పద్ధతుల్లో రచయిత నడిపించవచ్చు. ఒకటి వర్ణనాత్మకమైన పద్ధతి. రెండవది కథా కథన పద్ధతి. మూడవది నాటకీయ పద్ధతి. కథను సంఘటనలను జరిగినవానిని జరిగినట్లుగా కాక, ఆ వర్ణనలు కవి దృష్ట్యానో, ప్రధానపాత్ర దృష్ట్యానో ఎలా ఉంటాయో వర్ణించడమే బాపిరాజు గారికి ఇష్టమైన రచనా పద్ధతి. ఇతివృత్త నిర్మాణానికి యీ పద్ధతి అంత దోహదకారి కాకపోయినా రచయిత మనోభావాలను చెప్పడానికి ఎంతో అనువైన విధానం ఇది. అందువల్లనే బాపిరాజుగారి నవలలన్నింటిలో ఆయా పాత్రలకన్న బాపిరాజే ఎక్కువగా ప్రతిబింబిస్తాడు. "*నారాయణరావు*" లో కూడా అంతే.

"*నారాయణరావు*" లోని గాంధేయ సిద్ధాంతాలు రెండు విధాల వర్ణించబడ్డవి. ఒకటి నారాయణరావును గురించి నవలలోని పాత్రలు చిత్రించినప్పుడు; రెండవది నారాయణరావుతో మిగిలిన వారు సంభాషించినప్పుడు, ఆ సంభాషణలో నారాయణరావు తెలియ చెప్పిన విషయాలు.

జమిందారుగారికి తన బావ నారాయణరావును గురించి చెపుతూ లక్ష్మీపతి—

> "ఇంతలో మహాత్మా గాంధీగారి సహాయ నిరాకరణం వచ్చింది. రాజమండ్రి కాలేజీ వదలివేసి దేశంకోసం పనిచేశాడు. ఖైదుకు వెళ్లాడు. ఆరునెలలు నిర్భయంగా కృష్ణజన్మస్థానంలో గడిపాడు."[7]

ఇది నారాయణరావు దేశాభిమానాన్ని గురించిన మొదటి ప్రశంస. తరువాత అనేక సందర్భాలలో నారాయణరావు తన అభిప్రాయాలను వెల్లడిస్తాడు. ముఖ్యంగా మిత్రులతో సంభాషించినప్పుడు.

నారాయణరావు మిత్రుల్లో రాజకీయంగా మూడు వర్గాలకు చెందినవారున్నారు. నారాయణరావు నిరాకరణోద్యమంలో పని చేసినవాడు, తీవ్రకాంగ్రెసు వాది. రాజేశ్వరుడు జస్టిసు పార్టీ. పరమేశ్వరుడు కొంత స్వరాజ్య పార్టీ వారికి సానుభూతి పరుడు. వివాహానంతరం వారి సంభాషణ దేశ రాజకీయ పరిస్థితి వైపుకు మళ్ళింది. ఈ సంభాషణలో నారాయణరావు స్వరాజ్య పార్టీని నిందిస్తాడు. వాళ్ళు శాసనసభలలో చేరి ఏ మహాత్కార్యం చేస్తున్నారని ప్రశ్నిస్తాడు.

జమిందారుగారు, నారాయణరావు, అతని మిత్రులు యీ విషయం చాలాసార్లు ప్రస్తావిస్తారు.

> "దేశమునకంతా స్వరాజ్యం తెచ్చే ప్రయత్నాలు మాని, ఆంధ్ర రాష్ట్రం మాత్రం తెచ్చే ప్రయత్నం నేను ఆమోదించను" అంటాడు నారాయణరావు.

ఆ నాడు ఆంధ్రనాయకులు జాతీయోద్యమంపైకన్న ఆంధ్రోద్యమంపై ఎక్కువ మక్కువ చూపేవారు. ఈ మాటలు అట్టి నాయకులపై విమర్శ.

అంతేకాదు. "యావద్దేశ బంధ మోక్షానికి పాటుపడవలసిన ఉత్కృష్ట వ్యక్తులకు ఆంధ్రసమస్య సైంధవుడులాగు అడ్డుపడుతుంది. దేశ పరిపాలన చేతికి వచ్చిన తర్వాత మీ చిత్తము వచ్చినట్లు ...... రాష్ట్రవిభజన చేయడం సులభం"[8] అని వాదిస్తాడు. ఇదే విషయాన్ని "*కోనంగి*" లో కూడ వెలువరించడంతో ఈ అభిప్రాయాలు బాపిరాజుగారివేనని, ఆయనకు ముందు దేశానికి స్వాతంత్ర్యం రావడం ముఖ్యమని ఆ వెనుక ఆంధ్రరాష్ట్రం సంగతి ఆలోచించుకోవచ్చునన్న అభిప్రాయంతో ఉన్నారని రూఢి అవుతున్నది.

స్వరాజ్య పార్టీవారు శాసన సభలలో ప్రవేశించే సన్నాహంలో ఉన్నప్పుడు గాంధీజీ కాంగ్రెసు రాజకీయాలకు దూరంగా ఉండి ఖద్దరు, పంచమోద్ధరణ కార్యక్రమాలు నిర్వహిస్తాననడం కూడా యిందులో ప్రస్తుతించబడ్డది.[9]

బాపిరాజుగారు యిలా వివిధ వాద ప్రతివాదాలతో నారాయణరావుచేత గాంధీజీ కార్యక్రమాలకు అనుగుణమైన విషయాలు చెప్పించడమే కాక, నారాయణరావు అతని మిత్రులు ఉత్తరదేశ యాత్ర చేసినప్పుడు వారు చూచిన ప్రదేశాలలో పోరుబందరును కూడ చేర్చి, దానినొక యాత్రాస్థలంగా పేర్కొన్నారు.[10]

నారాయణరావు, అతని మిత్రులేకాక యీ అసహాయోద్యమం యొక్క ఉత్సాహం స్త్రీలకు కూడా ప్రాకినట్లు చూపుతారు బాపిరాజు. "*కోనంగి*"లో అనంతలక్ష్మి అందుకు నిదర్శనం. ఈ నవలలో శారద అక్కగారు శకుంతలాదేవి నిదర్శనం.

శకుంతల :— ఎందుకే నువ్వూ, మీ బావా ఇంగ్లీషువాళ్లో ఇంగ్లీషు వాళ్లో అని యిదవడం ?

శారద :— నువ్వు గాంధీగారి మతంలో చేరావుటే అక్కయ్యా ?

శకుంతల :— నువ్వు అదృష్టవంతురాలవు కాబట్టి నీకు నాన్ కోఆపరేషన్ భర్త దొరికాడు......

రోహిణీ దేవి, శ్యామసుందరీ దేవుల యింటికి వచ్చిన మంగపతిరావు కూడ గాంధీగారి సిద్ధాంతాలకు వ్యతిరేకియే. ఇట్టి వ్యతిరేక సిద్ధాంతాలు గల వ్యక్తులను ప్రవేశపెట్టడం ద్వారా బాపిరాజు తాను చెప్పదలచుకొన్న గాంధీగారి సిద్ధాంతాల గొప్పదనాన్ని ప్రచ్ఛన్నంగా చెపుతాడు.

మంగపతిరావు గాంధీగారి అహింసావ్రతము ఆడుదాని మతమని వాదించును. దానికి నారాయణరావు "శ్రీ మహాత్ముని తత్త్వం వీళ్లకేమి తెలుసును చెల్లీ"[11] అంటాడు.

నారాయణరావు గాంధీ సిద్ధాంతాలను చల్లాలు అన్న వారి యింటి పనికత్తె మాటలలో సంతృప్తీకరించవచ్చు.

"చిన్నతనాన్నుంచి ఎలాంటివోళ్లమీదా ప్రేమ. మాలోళ్లంటే వాళ్లకన్నీ యిస్తూ వుండేవోరు గాంధీగారి మాట రాకమునుపే ఇంటిలోవన్నీ తీసుకెళ్ళి మాలోళ్ల పిల్లలకి మా పిల్లలకీ పెట్టుండేవారొండీ........."

శారద "ఖైదుకు వెళ్లారా ?" అని చల్లాలును అడుగుతుంది.

"అవునండీ ! ఇంతప్పటినుంచీ నెచ్చేరులే. అంతలో గాంధీగారొచ్చారు. ఒక్కటే నెచ్చేరులు నారాయణగోరు. తచ్చణం ఆయన్ని పట్టుకొని ఆరునెల్లు ఖైదులో యేశారు."

నారాయణరావు గాంధీ సిద్ధాంతాలకు సరియైన ప్రతినిధిగా యీ నవలలో చూపబడ్డాడు.

**కోనంగి**

కోనంగి 1930 నుండి 1950 వరకు జరిగిన ఆంధ్రచరిత్రను చిత్రించే నవల. "మొన్నటి మహాసంగ్రామమునకు పూర్వమునందు పరమందు సంఘ జీవన సముద్రమున పొడమిన పాటు పోట్లను ఈ నవల స్థూలముగ చిత్రించును."[12] ఇందులోని ప్రధానపాత్ర కోనంగి. వివిధ సన్నివేశాల్లో విభిన్నమైన వ్యక్తులమధ్య కోనంగి గడిపిన జీవితాన్ని చిత్రిస్తుంది నవల. కోనంగి రాజకీయాలలో చేరడం యీ నవలలో ఒక విచిత్రమైన సన్నివేశం. "అనంతలక్ష్మి" అను అందాల బాలికను ప్రేమించిన నిరుపేద కోనంగిని ఆమెనే ప్రేమిస్తున్న ఒక చెట్టి

యార్ కొట్టిస్తాడు. గాయాలు బలంగా తగిలి నెల రోజులు హాస్పిటల్‌లో వుండవలసి రావటంతో చేస్తున్న వుద్యోగానికి తిలోదకాలు ఇవ్వవలసి వచ్చింది. హోటలు గదినుంచి కూడా అతన్ని పంపివేస్తారు. కోనంగికి తిరిగి అనంతలక్ష్మి ఇంటికి పోవడానికి యిష్టంలేదు. కోనంగి రావుకి ఏమిచేయాలో తోచదు. అతనికి ఏ ప్రభుత్వ వుద్యోగమో చేయడానికి యిష్టంలేదు.[13] ఈ పరిస్థితుల్లో కోనంగికి ఏదో తెలియ చెప్పరాని అసంతృప్తి బయలుదేరుతుంది. అప్పుడే ప్రపంచంలోని నిద్రాణమై వున్న శక్తులన్నీ మేల్కొన్నాయి. కోనంగి రాజకీయపు బిడ్డగా వుద్భవించాడు.[14] ఆత్మపరమైన అసంతృప్తిలోనుంచి బయట పడటానికి కోనంగికి ఒక్కటే మార్గం కనిపించింది– జాతి అసంతృప్తికి కారణమైన పారతంత్ర్యం, దానికోసం కాంగ్రెసు జరుపుతున్న మహోద్యమం. తన వ్యక్తిగతమైన అసంతృప్తిని అణచుకొని కోట్లాది ప్రజల అసంతృప్తిని బాపటానికి సాగుతున్న మహాయజ్ఞంలో పాల్గొనడానికి సన్నద్ధుడైనాడు.

అతనికి చిన్నతనంనుంచీ కాంగ్రెసు మహాసంస్థ అనీ, కాంగ్రెసు నాయకుడైన మహాత్మా గాంధీ లోకనాయకుడని నమ్మకం.[15] కాని మిస్‌మేయో గ్రంథం "*మదర్ ఇండియా*" అతనిని రాజకీయపు నిద్రమత్తునుండి లేపింది. ఏమిటీ కాంగ్రెసు? ఎవరీ మహాత్ముడు ? అన్న ప్రశ్నలు వేసుకున్నాడు.

అనంతలక్ష్మి యింటిలో పట్టాభిగారి "*కాంగ్రెసు చరిత్ర*", మహాత్ముని "*యంగ్ ఇండియా*" పత్రికా సంపుటాలు, "*హరిజన*" సంపుటాలు వున్నాయి. అహింస, సత్యాగ్రహం - వీనిమీద వ్రాసిన గ్రంథాలున్నాయి. రోమారోలా మొదలైనవారు వ్రాసిన గ్రంథాలున్నాయి. అవన్నీ చదివాడు కోనంగి.

రానురాను అతడు డాక్టరు రంగనాయకులు రెడ్డితో సంభా-

పిస్తూ రాజకీయాలలో ఆనాడు జరుగుతున్న సర్వవిషయాలను క్షుణ్ణంగా తెలుసుకున్నాడు. హింసాహింసలమీద కాంగ్రెసు సోషలిజంలమీద నిత్యమూ వారిద్దరికి వాగ్యుద్ధమే.

కోనంగి కాంగ్రెసులో సభ్యుడైనాడు. ఖద్దరు కొన్నాడు. చరఖా వడకడం ప్రారంభించాడు. గాంధీజీని గురించే ఆతని ఆలోచనలు. కుడిచి కూర్చొని రాజకీయాలలో వేలు పెట్టేవారు లేరు. కావాలని తమ జీవితాలను దేశానికి అర్పించే రాజకీయ సేవకులు లేరు. అందులో మహాత్ముడు అతి విచిత్రమైన పురుషుడు. ఏ కొద్ది మందిలోనో అహింసా వాదమున్నది. చాలమంది అహింసావాదాన్ని పాక్షికంగా చూడగలరు. సర్వతోముఖంగా చూడలేరు.[16]

బాపిరాజుగారన్నట్లు "ప్రాచ్య దేశాలలో మహర్షులు అహింసా వాదాన్ని, హింసపూరితమైన వస్తువులను భావాలను వదలివేయడంలో చూపించారు. కాని ప్రపంచాన్ని ఎదుర్కొని ప్రపంచంలో భాగస్థులై అహింసను ఆచరించేది ఒక్క బాపూజీయే !"[17]

ఇలా కోనంగి ఆనాటి మహోద్యమాన్ని తలచుకొన్నప్పుడల్లా బాపిరాజు ఆనాటి సర్వవిషయాలను వర్ణించడం ప్రారంభిస్తారు. గాంధీ సత్యాగ్రహం, చౌరీచౌరాలో అల్లర్లు, దాసుగారి స్వరాజ్య పక్షం, 1930 లో గాంధీ ఉప్పు సత్యాగ్రహం ప్రారంభించడం అన్నింటినీ వర్ణిస్తాడు. బాపిరాజు 1930-40 మధ్యకాలంలో వచ్చిన అన్ని రాజకీయ పరిణామాలను కోనంగి ద్వారా చెప్పిస్తారు.

ఆంగ్ల ప్రభుత్వంమీద కుట్ర పన్నుతున్నాడన్న నేరంమీద శోభనం నాటి రాత్రే కోనంగి అరెస్టవుతాడు. జైలులో కూడా గాంధీవాది కోనంగి సామ్యవాది రెడ్డితో ప్రతి నిత్యమూ వాగ్యుద్ధము చేస్తూ వుండేవాడు. ఆ సంభాషణా సంఘర్షణల్లో కోనంగి గాంధేయ సిద్ధాంతాల గొప్పతనాన్ని చాటిచెప్పేవాడు. తన సహజ

మైన హాస్యధోరణిలో సామ్యవాద సిద్ధాంతాలను అపహాస్యం చేసే వాడు.

భర్త జైలుకు వెళ్ళగానే అనంతలక్ష్మి కూడా కాంగ్రెసు కార్యక్రమాల్లో పాల్గొనడం ప్రారంభించింది. ఖాదీప్రచార కార్యక్రమానికి వెళ్ళేది. ఆ వేసంకాలం సేవాగ్రాం పోయి మహాత్ముని వద్ద కొన్నాళ్ళు వుండటానికి నిర్ణయించుకుంది. "సేవాగ్రాంలో అనంతలక్ష్మి పొందిన ఆనందం ఆకాశపథాన్నంటినది. ప్రతి ప్రార్థనా సభకు ఆమె హాజరు. ఆ ప్రార్థనా సమయంలో మహాత్ముని సమీపంలో ఆమె అనుభవించిన శాంతీ, ఆనందమూ పరమోత్తమ స్థితి నందింది".[18]

భారతీయ స్వరాజ్య చరిత్రలో 1942, ఆగస్టు 8 వ తేది అతి ముఖ్యమైనది. ఆనాడే బొంబాయి కాంగ్రెసు సమావేశం జరిపి వ్యక్తి సత్యాగ్రహానికి పునాదులు వేసింది. ఆ తెల్లవారుఝామున నాయకులందరూ అరెస్టయ్యారు. దేశం అట్టుడికినట్లుడికిపోయింది. ఆ రోజులలోని స్వాతంత్ర్యోన్మాదాన్ని బాపిరాజుగారు కళ్ళకు కట్టినట్లు చిత్రించారు. క్రానికల్ లో చరిత్రలోని అన్ని విషయాలను చిత్రించినట్లు "*కోనంగి*" లో ఆనాటి రాజకీయ జీవితంలోని ప్రతి స్పందననూ చిత్రించారు బాపిరాజు.

ఆనాటి కోనంగిని భార్య అనుమానించడంతో అతని హృదయంలో తిరిగి ఆందోళన ప్రారంభమైంది. ఆ ఆందోళనలో తిరిగి జాతి చేస్తున్న ఆందోళనా ప్రవాహంలో మునిగిపోవాలని అనిపించింది. అంతవరకు తన పత్రిక ద్వారా మాత్రమే జాతీయ భావాలను వ్యక్తం చేస్తూన్న కోనంగి ఒక ఉదయం కార్యకర్తగా వీధులవెంట బయలు దేరాడు "*క్విట్ యిండియా*" నినాదాల్తో.

కోనంగి ప్రజల నుద్బోధిస్తూ గాంధీజీని అనుసరించండని కోరుతూ పాటలు పాడుతూ వీధుల్లో నడుస్తాడు.

మహాత్మగాంధీ! క్విటిండియా అను
మహా వాక్కునే
మంత్రం చేశావూ
.........................
ఇన్నాళ్ళూ నీ మాటే మాకూ
ఎంతో ముందుకు నడిపే శక్తయి
స్వరాజ్య యుగముకు సాగించి నీ
అడ్డం కానీ వేగంతోటే॥

అంటూ మహాత్ముణ్ణి పొగుడుతాడు.

కోనంగి తిరిగి అరెస్టవుతాడు. జైలు కటకటాల మధ్య స్వాతంత్ర్యేచ్ఛ తిరిగి అతణ్ణి ఉత్తేజితుణ్ణి చేసింది.

కోనంగి 1943 జూన్‌లో విడుదలైనాడు. అంతటితో యీ నవల ముగుస్తుంది.

నవల అంతా కోనంగికి ఆనాటి రాజకీయ జీవితానికి వున్న సంబంధం చూపబడ్డది. ఔత్సాహకుడిగా, ఉద్యమ కార్యకర్తగా, జైలు నివాసిగా, సంపాదకునిగా అతని అనుభవాలే యిందులో వర్ణితాలు. కోనంగి, అతని మిత్రులైన రియాసత్ ఆదులను గురించి వ్రాయబడ్డ యీ నవల గాంధేయ సాహిత్యంలో పేర్కొనతగినది.

చివరకు మిగిలేది

"రెండు మహాసంగ్రామాల మధ్యకాలంలో, తెనుగునాట కొందరి యువతీయువకుల జీవితం చిత్రితమైంది ఈ నవలలో. జీవితంపై ఒక దృక్పథాన్ని కలగచేయాలన్న ఉద్దేశంతో" యీ రచన సాగింది. ఈ దృక్పథాన్ని కలగచెయ్యడానికి గాను బుచ్చిబాబు దయానిధి జీవితాన్ని స్వీకరిస్తాడు దానిని ప్రాతిపదికగా చేసుకొని ఆ జీవితంలో వచ్చిన ఒడుదుడుకులకు వ్యాఖ్యానం చేస్తాడు రచయిత.

దయానిధి జీవితంలో పెద్ద మలుపు అతని శోభనంనాటి రాత్రి జరిగిన సంఘటన. దయానిధిలో కలిగిన రాజకీయ లేదా జాతీయ చైతన్యానికి ఆ సంఘటన దోహదం చేసింది. అతడు శోభనానికి అత్తవారింటికి వచ్చి భోజనం చేసి పడుకుంటాడు. "ఐదు నిమషాల్లోనే భరతమాత సంకెళ్లని చప్పుడు చేస్తూ అతని ఏకాంతాన్ని భంగం చేసింది"— దయానిధి యీ సంకెళ్ల చప్పుడుకు చలించాడు. చలించి రంగంలోకి దుమికాడు. ఇది 1935 లో సంగతి.

1935 లో ఆంగ్ల ప్రభుత్వం ఒక కొత్త చట్టం చేసింది. అది ప్రజలకు నచ్చలేదు. "భారతీయులు బానిసలే! కాని 1935 ఇండియా యాక్ట్‌తో తాము బానిసలం అని గ్రహించుకున్నారు."

దీనికి ముందు 1920 నుంచి వచ్చిన స్వాతంత్ర్య ఉద్యమ చరిత్రను సంగ్రహంగా వివరిస్తాడు రచయిత- "జనం ఎక్కడికో కదలి పోతున్నారు. ఎక్కడికో ప్రయాణం? ఆశలు లేని, ఆకలి లేని ఆ లోకానికి పోదాం అన్నారు. ఎక్కడ ఆ లోకం? ఒక సన్నటి నల్లటి పొడుగాటాయన కఱ్ఱపుచ్చుకుని తొందరగా కదిలిపోతున్నాడు. అందరూ ఆయన వెనకాల పడ్డారు - ఆయన పాదాల కింద యిసుక రేణువులై, యీ ప్రజ ఒక్కసారి లేచి, గంతులు వేసి, నలుదిక్కులా వ్యాపించింది" అంటూ ఉద్యమంలో గాంధీజీ నాయకత్వానికి నివాళులు పడతాడు రచయిత.

నిద్ర పోతున్న దయానిధిని మిత్రులు లేపుతారు. ఆ ఊళ్ళో (కాకినాడ) ఉపన్యాసం ఉంది లెమ్మంటారు. తాను మాట్లాడను కాని ప్రేక్షకుడుగా వస్తానన్నాడు. తీరా ఉపన్యాసం దగ్గరకు వచ్చాక తన్నుతాను సంబాళించుకోలేకపోయాడు. ఆ ఉద్రేకం ఎలాంటిదో వివరించాడు రచయిత:

"శరీరం పొంగింది. చర్మం విప్పుకుని వెంట్రుకలు నిలబడి, గుండెలు దడదడ కొట్టుకుంటూ, రక్తం వేడెక్కి వేగంగా ప్రవహిస్తూ, అతన్ని నరాల కుప్పగా మార్చివేశాయి. అతనిక మనిషికాడు. ఒక శక్తి."

అటువంటి దయానిధి ఉవ్వెత్తున లేచాడు మాట్లాడటానికి :

"స్వాతంత్ర్యం జన్మహక్కన్నాడు నిధి. మానవుడికి స్వాతంత్ర్యం ఆకలి దప్పులకంటె కూడ ఎక్కువ ముఖ్యం అన్నాడు."

పోలీసు అధికారి అతన్ని హాస్పిటల్‌కు తీసుకుపోతాడు. బలవంతంగా-అతని దెబ్బలకు కట్లుకడతారు. మాధవయ్యగారే - దయానిధి మామగారే - అక్కడ పోలీసు ఆఫీసరు. ఆయన తక్షణం దయానిధిని అక్కడనుంచి వెళ్ళిపోవాలని సలహావంటి వార్త పంపుతాడు. అతన్ని చూడాలని వెళ్ళిన భార్య ఇందిర తండ్రి ఆజ్ఞ ప్రకారం అతన్ని చూడకుండానే వెళ్ళిపోతుంది. ఆ సంఘటనలతో వారిద్దరి మధ్య దూరం ఏర్పడుతుంది. అది ఎప్పటికీ కలుసుకోని దూరం.

ఈ నవలలో ముఖ్యమైన ఘర్షణ దయానిధికీ, అతని మామగారు మాధవయ్య గారికీ - మధ్య బలి అయిపోయింది మాత్రం ఇందిర.

మామ అరాజకమైన ప్రభుత్వ ప్రతినిధి. అల్లుడు స్వాతంత్ర్య కాంక్షకు ప్రతినిధి. వీరిద్దరి మధ్య ఆనాడు జరుగుతున్న నిత్య సంఘర్షణే యీ నవలలో కూడా ప్రతిబింబించింది. దయానిధి మాటల్లో చెప్పాలంటే—

"బిరుదుల్ని, డబ్బుని, గౌరవాన్ని పొందడం కోసం ఆత్మ విశ్వాసాన్నీ, న్యాయవిచక్షణతలనీ, సత్యాన్ని కొందరు వొదులుకో

లేరు. మన ప్రభుత్వం (అప్పటి ఆంగ్ల ప్రభుత్వం) అన్యాయంగా ప్రజల్ని పీడించి బానిసలుగా చేసిన చరిత్ర తెలిసిన యువకుడెవడూ ఈ దురంతపు చర్యలలో పాల్గొనడు. సత్యాగ్రహం ద్వారా ప్రజా సేవ చేసి అనామకుడుగా బీదవాడుగా జీవితం సాగిస్తాడు. అవసర మైతే మరణిస్తాడు ........ మాధవయ్యగారిది దక్షిణమార్గం. నాది వుత్తరమార్గం. మేం ఎప్పుడూ కలుసుగోం........ ..."[19]

రెండు ప్రపంచ యుద్ధాల మధ్య, రెండు తరాల వ్యక్తుల మధ్యనున్న సంఘర్షణను పటిష్ఠంగా చిత్రించింది యీ నవల.

## చదువు

నవలా రచనలో వివిధ ప్రక్రియలను విభిన్నమైన పోకడలను సృష్టించిన కొడవటిగంటి కుటుంబరావుగారి "చదువు" (1952) తెలుగుదేశంలోని మధ్య తరగతిపై జాతీయోద్యమం ఎంతటి ప్రభా వాన్ని కలుగజేసిందో విస్తృతంగా చూపే నవల. ఈ నవలలోని కథ రెండు ప్రపంచ యుద్ధాల మధ్య జరిగినట్లు చూపబడ్డది. ఈ కాలమే భారత జాతీయోద్యమంలో ఎంతో సంచలనం కలిగించిన కాలం.

ఈ నవలలో సుందరం నాయకుడు. అతని చదువు ఎన్ని ఎన్ని వాతావరణాల్లో ఎలా సాగిందో, ఆ చదువు నేర్చుకుంటూ సుందరం తన వ్యక్తిత్వాన్ని ఎలా తీర్చి దిద్దుకున్నాడో చూపుతుంది యీ నవల. సుందరం వీధి బళ్లో చదువుతూ ఉండగానే జర్మనీ వాళ్లకు, ఇంగ్లీషు వాళ్లకూ యుద్ధం ప్రారంభమైన సంగతి వింటాడు. అది అతనికి ఆధు నిక రాజకీయాలతో మొదటి పరిచయం :

> "రాములవారు ఎప్పుడో రావణాసురుడితో యుద్ధం చేసినట్టు మాత్రం సుందరానికి తెలుసు. ఇప్పుడు కూడా యుద్ధాలు జరుగుతాయని సుందరానికి తట్టలేదు."[20]

హైస్కూల్లో చేరాక ఆ యుద్ధానికి సహాయ నిధికోసం అణా యివ్వ మని తల్లిని వేధిస్తాడు.

హైస్కూలులో చదువుతున్న రోజుల్లోనే సుందరం జాతీ యోద్యమాన్ని గురించి తన మాస్టరు సాంబయ్యగారి ద్వారా వింటాడు. యుద్ధానంతరం స్వరాజ్యమిస్తామని ఆంగ్లేయులు అనటం, ఆ మాట తప్పటం ఆయన వివరిస్తాడు. సుందరం ఆంగ్లేయుల్ని అస హ్యించుకుంటాడు.

మురికి గుంటలా ఉన్న జీవితం జలియన్‌వాలాబాగ్ కాల్పుల తోను, డయ్యర్ పేరుతోనూ ఒక్కసారిగా కదలబారింది. "రౌలట్ చట్టం, సత్యాగ్రహం, జలియన్‌వాలాబాగ్" అన్న మాటలు సుందరం విన్నాడే కాని ఈ సంఘటనల వెనుక ఉన్న రాజకీయాలు సుందరం ఎరగడు. అప్పటికి సుందరానికి తొమ్మిదేళ్లు.

సీతప్పగారు బాలగంగాధర తిలక్ పోయినప్పుడు విచారపడడం, "అటువంటి మహానాయకుడు దేశానికి మరి దొరకడు. 'గాంధీ' అని ఇంకో ఆయన ఉన్నాడు గాని – ఎబ్బే తిలక్ మహాశయుడి కెవ్వరూ చాలరు" అనడం సుందరం విన్నాడు. తరువాత గాంధీని గురించి చాలవిషయాలు విన్నాడు.

> "తిలక్ పోయిప్పుడు గాంధీదగ్గరే వున్నాట్ట. జాతీయోద్య మాన్ని గాంధీకి వప్పగించి తిలక్ ప్రాణం విడిచాట్ట."
>
> "గాంధీ చెప్పే కొత్త పద్ధతుల్లో ఒకటి స్వదేశీ ఉద్యమంతో విదేశవస్తు బహిష్కారం."[21]

స్కూలు ముందు పికెటింగ్ జరగడం, పిల్లల్ని వెళ్లనీయక పోవడం, యీ యింగ్లీషు చదువులు వద్దన్న నినాదాలు ఎక్కువయ్యాయి.

జాతీయ విద్యాలయం వెలిసింది దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి ఆధ్వర్యంలో.

ఇంతటి సంచలనానికి సుందరం ఒట్టి ప్రేక్షకుడు మాత్రమే. కాని శేషగిరి మామయ్య ఉద్యోగం మానేసి ఉద్యమంలో చేరాడు. "ఇంటింటా రాట్నం తిరగాలి. ఊరూరా జాతీయ విద్యాలయం నడవాలి. అస్పృశ్యత పోవాలి. జనమంతా ఏకం కావాలి" అని ఉద్రేకంగా చెప్పుకుపోయాడు ఆయన.

శేషగిరి పిల్లలిద్దర్నీ స్కూలు మానిపించాడు. ఆయన తన ఊళ్లో విదేశవస్త్రదహనం చేయించాడు. జాతీయ విద్యాలయమూ, లైబ్రరీ కట్టించాడు. స్కూల్లో అస్పృశ్యులను చేర్చే విషయంలో కొంత పట్టింపు వచ్చింది.

> "ఇంకా అస్పృశ్యులు ఏమిటి? అంతా గాంధీ మయం అయి పోతుంటేను- ? జగమంతా గాంధీమయం"[22]

అంటాడు శేషగిరి. శేషగిరి అల్లుడు రంగారావు కూడా ఉద్యమంలో పనిచేసినవాడే. ఖద్దరును గురించి ఉద్రేకంగా మాట్లాడతాడు.

కాలేజీలో చేరాక సుందరం మద్రాసు కాంగ్రెసు సభలకు వెళ్ళాడు. అక్కడ పెండాలు చుట్టూ తిరిగాడు. "మా కొద్దీ తెల్ల దొరతనము" అన్నపాట విన్నాడు.

కాశీలో చదువుతూండగా జాతీయోద్యమం ముమ్మరమై కాలేజీలు మూసేశారు అక్కడ. "అదివరకల్లా చదువుమీద ఉంటూ వచ్చిన అభిమానం కాశీ రాగానే జీవితం మీదికి ఎందుకు మళ్ళిందో సుందరం ఊహించలేకపోయాడు."

గాంధీమహాత్ముడు ఉప్పు సత్యాగ్రహం ప్రారంభించినప్పుడు దేశంలో వచ్చిన సంచలనాన్ని సుందరం చూశాడు. గాంధీని

అరెస్టు చేసినప్పుడు కాలేజీలో పాఠాలు జరుగలేదు. మాలవ్యా మాటలు కూడా పికెటింగ్ చేసే విద్యార్థులు వినలేదు.

సుందరం తన ఊరికి తిరిగి వచ్చాడు. అక్కడ కూడా జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతోంది. అయితే అతనికి యీ సత్యాగ్రహాలలో కొంత అనుమానం ఏర్పడ్డది. ఆ అనుమానం నాయకుల వలన కలిగిందే. వాళ్లు సత్యాగ్రహంలో అరెస్టు కావడం లాంఛనం కింద చూడడం అతనికి గిట్టలేదు. అయినా అతడు ప్రేక్షకుడుగానే కనిపిస్తాడు. కాని అతనిమీద ఈ రెండేళ్లుగా జాతీయోద్యమం ఎంతో ప్రభావం చూపింది. భవిష్యత్తుకు పునాది వేసింది.

సుందరాన్ని ఆలంబనంగా తీసుకుని ఆనాడు దేశంలో కలిగిన సంచలనాన్ని - ఒక విద్యార్థి అక్షరాభ్యాసం దగ్గర నుంచీ చదువుకునే వరకు అతని వ్యక్తిత్వ వికాసాన్ని, ఆ వ్యక్తిత్వం వికసించడానికి జాతీయోద్యమం చూపిన ప్రభావాన్ని యీ నవల వాస్తవికంగా చిత్రించింది.

## కొల్లాయి గట్టితేనేమి

1965 లో ప్రచురింపబడిన ఈ నవల - 1921 వ సం॥ లో దేశంలో జరిగిన సంచలనాన్ని కథావస్తువుగా స్వీకరించింది. ఈ నవల మహీధర రామమోహనరావుగారి రచన.

భారత జాతీయోద్యమంలో భాగంగా పన్నుల నిరాకరణోద్యమంలో అసువులను బాసిన కన్నెగంటి హనుమంతుకు యీ నవల అంకితం ఇవ్వబడ్డది.

ఆనాటి తెలుగుదేశపు రాజకీయ, సామాజిక జీవితాన్ని చిత్రించడం యీ నవల ధ్యేయం. నిజానికి ఆనాటి భారతదేశంలో

యీ రెండు రకాల జీవితాలు వేరుకావు. ఒక ప్రక్క సహాయ నిరాకరణం ముమ్మరంగా జరిగే రోజుల్లోనే ఖద్దరు, రాట్నాలు వడకటం, అస్పృశ్యతా నివారణ సంఘంలో ఎంతో సంచలనాన్ని కలిగించాయి.

రచయితే యీ నవలకు ఉంచిన పేరును గురించి ఒక సంజాయిషీ ఇచ్చారు. ఈ పేరు ఆక్షేపణీయం కావచ్చు. "ఏమంటే గాంధీజీ ఈ కథ ముగిసిన మరి ఆరు నెలలకు గాని "కొల్లాయి కట్టడం ప్రారంభించలేదు"[23] అన్నారు రచయిత.

కొల్లాయి కట్టకపోయినా ఆయన నిరాడంబర జీవితం, సాధు వర్తనం, సమాజంలో అడుగున ఉన్న జనానికి దగ్గరగా వుండాలనీ, వారిని పైకి తీసుకొని రావాలని ఆయన పడే తపన - ఇవే ఆనాడు ఆయనను తెలుగుదేశానికి ప్రియతముడిని చేశాయి. దానిని తెలపడానికే ఆ పేరు.

ఈ నవలకు కేంద్రంగా రచయిత స్వగ్రామం ముంగండ తీసుకోబడ్డది. 1921 మార్చి 31, ఏప్రిల్ 1 తేదీల్లో బెజవాడ కాంగ్రెసు జరగడం, తరువాత తిలక్ స్వరాజ్య నిధికోసం గాంధీజీ ఆంధ్రదేశం పర్యటిస్తూ ముంగండ రావడం, ఆయన రాక ఆ గ్రామ ప్రజలలో కలిగించిన సంచలనం కళ్లకు కట్టినట్లు చిత్రించబడ్డాయి ఈ నవలలో.

సత్యాగ్రహ సమర ప్రారంభంలో గాంధీజీ ఆదేశంతో రామనాథం కాలేజి చదువు మానడంతో యీ కథ ప్రారంభం అవుతుంది. ఆ చదువులు మానడం తన దగ్గరివాళ్లకు ఎంత కష్టం కలిగించిందీ, ఆ తరువాత భర్తను వదిలివేసిన నాయుడిగారి అమ్మాయి స్వరాజ్యంతో అతని పరిచయం, ఊళ్లో స్వరాజ్య కార్యక్రమాలలో అతను పాల్గొనడం, ఊళ్లో బ్రాహ్మణుల వెలి, మాలమాదిగల యిక్కట్లు, ఊరి చెరువులోంచి నీళ్లు కూడా తీసుకొని రావడానికి

అభ్యంతరం ఉండడం, రామనాథం వాళ్లకు సహాయం చేయడం, వాళ్ల కోసం తన తోటలో ప్రత్యేకంగా బావి తవ్వించే ప్రయత్నం చేయడం, ఊళ్లో రాటాలు పెట్టించి వడికించడం — యివన్నీ వివరంగా వర్ణించ బడ్డాయి ఇందులో.

ఒకే గ్రామాన్ని తీసుకుని ఆ గ్రామంలోని విభిన్న మన స్తత్వాలు గల వ్యక్తుల్ని పరిచయం చేసి, ఆ వ్యక్తులు ఒక మహో ద్యమం పట్ల ఎలా విచలితులైనదీ యీ నవల అద్భుతంగా వర్ణించింది. ముఖ్యంగా అగ్రహారాన్ని కథా స్థలంగా స్వీకరించడంతో అక్కడ అస్పృశ్యతా నివారణ సమస్య ఎంత జటిలమైనదో మనకు అర్థం అవుతుంది. ఛాందసులైన బ్రాహ్మణులు తరతరాలనుంచీ వస్తున్న ఆచారాలకు బానిసలై సంఘాన్ని కలుషితం చేస్తున్నదని భావించి గాంధీగారి అస్పృశ్యతా విధానాన్ని నిరసిస్తారు. కాని గాంధీగారు ముంగండ రాబోతున్నారని విని అతి విచిత్రంగా ఆ మహాసభ జయ ప్రదం కావడానికి తోడ్పడుతారు.

ఈ మార్పు చూపడం యీ నవలకు ధ్యేయం. రామనాథం కేవలం అస్పృశ్యతా సమస్యతో ఆగక తన జీవితానికి సంబంధించిన మరో సమస్యలో యిరుక్కుంటాడు. అది కులాంతర వివాహం. దానికి ఒప్పుకోడు పెంచిన పెదతండ్రి. అయినా వీనిని లక్ష్యం చేయ కుండా రామనాథం విజయం సాధించాలన్న పట్టుదలతో ప్రయత్నం చేయడం చూస్తే రామనాథంవంటివాళ్లు ఆ నాటి ఉద్యమానికి ఎలా దోహదకారులైనదీ తెలుస్తుంది.

శంకరశాస్త్రి వంటి సనాతనుడే గాంధిగారి రాకతో మారి పోయి దూరాన ఆనందంతో సూరాయ పాడుతున్న —

సుందరమైన రాట్నమే
పసందు బాంబురా

సందేహమేలా అందులోనే
స్వరాజ్య మున్నదిరా

అన్న పాట విని ఏదో అదృశ్య శక్తికి నమస్కారం చేశాడు. ఆ అదృశ్య శక్తి గాంధీజీ.

## బలిపీఠం

హరిజన సమస్యనూ, కులాంతర వివాహ సమస్యనూ కేంద్రంగా తీసుకొని వ్రాయబడ్డ ఎన్నో నవలల్లో శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మ వ్రాసిన "బలిపీఠం" ఎన్నిక చేయదగిన నవల. ఈ నవలలో రచయిత్రి ఈ నాడు సంఘాన్ని ఎదుర్కొంటున్న అతి ముఖ్యమైన సమస్యను స్వీకరించి ప్రతిభావంతంగా పోషించింది. పైన పేర్కొన్న రెండు సమస్యలూ నిజానికి రెండు సమస్యలు కాదు. ఒక సమస్యయొక్క రెండు రూపాలు.

"అరుణ" అన్న ఉత్తమ కులస్థురాలు "భాస్కర్" అన్న హరిజనుణ్ణి విచిత్రమైన పరిస్థితుల్లో వివాహమాడటంతో ప్రారంభ మవుతుంది నవల. అశక్త అయి, చావు బ్రతుకుల మధ్య యుద్ధం చేస్తున్న అరుణ తాను సుమంగళిగా మరణించాలన్న ఆకాంక్షతో భాస్కర్ భర్త కావాలని కోరుకుంటుంది. ఒక అనాథ యొక్క ఆరిపోబోతున్న జీవన జ్యోతికి కొంచమైనా ఊపిరి పోయాలన్న ఆద ర్శంతో భాస్కర్ ఈ వివాహానికి ఒప్పుకుంటాడు.

అరుణ తిరిగి కోలుకుంటుంది. ఉద్యోగంలో చేరుతుంది. ఆమె తిరిగి వెనుకటి మనిషి అయింది. దానికి తోడు ఉద్యోగంలో చేర డంతో తన వంశము, దాని వెనుక తరతరాలుగా వస్తున్న ఆధిక్యతా భావము ఆమెను కమ్ముకుంటాయి. ఈ అహంభావం పరా కాష్ఠకు చేరి భర్తయొక్క ఉన్నతమైన మనస్సును కూడా నొప్పి స్తుంది. ఇప్పుడు ఆమెకు భర్త హరిజనుడు. తక్కువ కులానికి చెందిన

వాడు. భాస్కర్ సన్నిహితులు ఆ యింటికి రావడంతో ఈ భావం మరీ స్థిరపడిపోయి ఆమెను ఉద్విగ్నను చేస్తుంది. చివరకు భర్తకు విడాకులు ఇవ్వడానికి కూడా జంకదు. భాస్కర్ ఉదాత్తమైన హృదయం అందుకు అంగీకరించదు. కాని కులం అన్న అడ్డుగోడ వారిద్దర్నీ వేరు చేసింది. అరుణ అహంభావం తుదకు ఆమె మరణంతో కాని అంతంకాలేదు.

ఈ కథలో వర్ణాంతర వివాహం చేసుకున్న రెండు జంటల్ని ప్రవేశపెట్టింది రచయిత్రి. అరుణా-భాస్కర్‌ల వివాహం - అందులో ఒకరి సంకుచిత మనస్తత్వంవల్ల విజయవంతం కాలేదు. రెండవ జంట అమల-జేమ్స్. వారి వివాహ జీవితం వారి వారి విశాల భావాలవల్ల సుఖమయం అవుతుంది. కరుడుకట్టుకుపోయిన కులమత విద్వేషాలను విమర్శించి, కులాల ఆధిక్యత అన్న సిద్ధాంతంలోని అర్థంలేని తనాన్ని రచయిత్రి ఈ నవలలో అడుగడుగునా చూపింది.

"కరుణ సమాజం" అన్న పేరులోనే గాంధీజీ ఊహించిన కారుణ్యభావం గోచరిస్తున్నది. అందులో భాస్కర్ ఉండటం గాంధీజీ ఆశ్రమ సిద్ధాంతాలకు అనుగుణంగా ఉన్నది. భాస్కర్ జీవితంలోని కారుణ్యానికి అరుణ లోనుకాలేదంటే దానికి కారణం ఆమె పాషాణ హృదయమే.

ఇలా రచయిత్రి ఈ నవలలో ఆద్యంతమూ గాంధీజీ కారుణ్యభావాన్ని, అస్పృశ్యతా నివారణను వ్యక్తి, సమాజాల దృష్ట్యా ప్రతిబింబింపచేయడానికి ప్రయత్నించి కృతకృత్యురాలైంది.

ఈ నవలలో చూపబడిన సిద్ధాంతం - కుల, మత సంఘర్షణ- "మాలపల్లి" లోని సమస్యను పోలి ఉన్నది. తను నవల ముగింపులో ఉన్నవవారు చెప్పినట్లు "పైజాతి వారి అహంభావమే వారిని భగవంతుడినుంచి దూరం చేస్తున్నది." ఆ భగవంతుడికి ఈ నాటి కరుణ

సమాజం ప్రతీక. భాస్కరుకు అందులో స్థానం ఉండడానికి అతడు భగవంతుడికి దగ్గరివాడు కావడమే కారణం! అంటే అహాంభావ విరహితుడు కావడమే!

పైన పేర్కొన్న నవలలుకాక యింకా ఎన్నో నవలలు - యిటీవల వచ్చినవి - గాంధీజీ సిద్ధాంతాల గొప్పతనాన్ని చాటిచెప్పాయి. శ్రీ పోలాప్రగడ సత్యనారాయణ మూర్తి వ్రాసిన "కౌసల్య" లో సత్యాగ్రహోద్యమంలో చేరిన వ్యక్తులు భార్యాపుత్రులను కూడా ఎలా విడనాడగలరో వారికి దేశమే ఎలా సర్వస్వమో చూపబడ్డది.

వెంకట్రామయ్య కౌసల్యను వివాహం చేసుకున్నాడు. ఆయన సత్యాగ్రహి. శోభనంనాటి రాత్రే నిరాకరణోద్యమంలో చేరి జైలుకు పోతాడు. కౌసల్య సౌమ్యంగా భర్తకు చెప్పిచూచింది. కాని ఎన్ని సంవత్సరాలు గడచినా వెంకట్రామయ్య ఆ వుద్యమాలలో తిరగడం మానడు. చివరకు విసిగి పంతంకొద్దీ కౌసల్య వెంకట్రామయ్యను విడిచి వెళ్ళిపోతుంది. ఆమెలో యీ మార్పు రావటానికి ముఖ్యంగా ఒక సంఘటన పనిచేసింది. శోభనంనాటి రాత్రే తన్ను విడిచి వెళ్ళిపోయినందుకు ఆమె భర్తనేమీ అనలేదు కాని తాను గర్భిణిగా ఉన్నప్పుడు తన్ను విడిచి వెళ్ళవద్దని ఆయనెన్నెంత ప్రార్థించినా ఆయన వినలేదు. దీనితో ఆమెకు భర్తపై విరక్తి కలిగింది.

అంతమాత్రాన కౌసల్యకు దేశమన్నా వుద్యమం అన్నా యిష్టం లేకపోలేదు. తాను భర్తకు దూరమైనా, తన కుమారుణ్ణి దూరంచేసినా తన కొడుక్కు "తిలక్" అని పేరు పెడుతుంది కౌసల్య. సత్యాగ్రహోద్యమం పల్లెలలోని రాజకీయాలను సాంఘిక జీవితాన్ని ఎలా మార్చివేసిందో మహీధరవారి "కొల్లాయి గట్టితే నేమి" చూపించగా "కౌసల్య" ఒక కుటుంబంలో ఆ సత్యాగ్రహం తెచ్చిన మార్పులను, ఉద్వేగ కావేషాలను చూపించే ప్రయత్నం చేసింది.

సుమలత వ్రాసిన *"జీవన కలశం"* అన్న నవలలో గాంధీజీ ప్రభావం ప్రత్యక్షంగా కనిపిస్తుంది. వసంతలక్ష్మికి రామకృష్ణతో పెద్ద వాళ్ళ ఏర్పాటుతో వివాహం అవుతుంది. వసంత లక్ష్మికి చదువుకోవా లన్న ఆశ, జీవితంమీద, వివాహంమీద ఆమెకున్న అభిప్రాయాలు ఆమెను భర్తకు దూరంచేశాయి. ఆమె భర్తను భర్తగా చూడలేదు. అత్తవారింటికి వెళ్ళిన ఆమె ఆ వాతావరణాన్ని భరించలేక ఎవ్వరికీ చెప్పకుండా వార్ధాలోని గాంధీజీ ఆశ్రమానికి వెళ్ళిపోయింది. గాంధీజీకి ఆమె తన కథ నంతనూ పూసగుచ్చినట్లు చెబుతుంది. ఆమె తొందరపాటును, ఎవ్వరితో చెప్పకుండా రావటాన్ని గాంధీజీ విమర్శిస్తారు. ఆమె తండ్రికి, మామగారికి ఉత్తరాలు వ్రాస్తుంది. వా రిరువురూ వార్ధా వస్తారు. ఆమె వారికి తన మనోనిశ్చయం తెలియజేస్తుంది.

వసంత చదువు ప్రారంభిస్తుంది. గాంధీజీ గార్డియన్‌గా నాగ్‌పూర్‌లో చదువుతుంది. గాంధీజీ, ఆయన సిద్ధాంతాలు ఆమెను సరియైన జీవనమార్గంలో నడుపుతాయని ఆశిస్తుంది. ఆమె బి.ఏ. మూడవ సంవత్సరంలో వుండగా గాంధీజీ మరణిస్తాడు. అయినా ఆమె అక్కడే తన చదువు కొనసాగించి కలకత్తాలో వుద్యోగంలో చేరి తనకు నచ్చిన మనోహర్ అన్న వానిని వివాహం చేసుకుంటుంది. తన పూర్వపు భర్త రామకృష్ణకు అతనికి నచ్చిన కన్యతో తాను దగ్గర వుండి వివాహం జరిపిస్తుంది. ఇలా తాను గాంధీజీ అండను నేర్చుకున్న శాంతి సామరస్య భావాలను జీవితంలో కూడా అమలుపరుస్తుంది వసంతలక్ష్మి.

ఈ సందర్భంలో తప్పక పేర్కొనవలసిన రచన యిటీవలనే ఆంధ్రప్రభలో వారంవారం ధారావాహికంగా వెలువడిన ***"రాజరికాలు–పేదరికాలు"***[24] అన్న నవల. ఇందులో జమీందారుల యిండ్లలోని యువతీ యువకులపై గాంధీజీ వుద్యమ ప్రభావాలు వర్ణితములైనాయి.

నాలుగు తరాలవారి కథ యిది. జమీందారు రంగరామానుజుల వారు ముమ్మూర్తులా ఫ్యూడల్ రాజరికపు వంశానికి చెందినవారు. ఆయన కొడుకు నారాయణదేవు, భార్య శ్రీదేవి ఇద్దరికీ జాతీయ భావాలంటే ఎక్కువ ఆసక్తి. హనీమూన్‌లో వార్ధా వెళ్ళి గాంధీగారి దర్శనంచేసి వస్తారు. ఇంటికి వచ్చి తమ గ్రామంలో పాఠశాల, ఆసుపత్రి స్థాపిస్తారు. వయోజన విద్యా బోధన ప్రారంభిస్తారు. శ్రీదేవి కాంగ్రెసులో సభ్యురాలవుతుంది. ఖద్దరు కట్టడం మొదలుపెడుతుంది. వయోజనులకు చదువుచెప్పడానికి పంతులమ్మగా చేరుతుంది. ఇవి అన్నీ అటు పుట్టింటివారికి ఇటు అత్తింటివారికీ కంటగింపుగా వుంటాయి. మామగారు, తండ్రి చెప్పినా ఆమె, ఆమె భర్త వినరు.

భార్యాభర్తలిద్దరూ సత్యాగ్రహంచేసి జైలుకుపోతారు. జైలులో నారాయణదేవుకు విప్లవవాదులతో పరిచయం ఏర్పడుతుంది. అతనికి వారి సిద్ధాంతాలు కూడా నచ్చుతాయి. జైలునుంచి విడుదల కాగానే నారాయణదేవు విప్లవవాదులతో చేరి అరాచకకృత్యాలు చేయడం ప్రారంభిస్తాడు. ఆంగ్లేయులను చంపడం, వారి ఆస్తిపాస్తులను ధ్వంసంచేయడం మొదలైనవి ఇందులో భాగాలు. శ్రీదేవికి యివి నచ్చవు. ఆమె గాంధేయభావాలు గల జాతీయవాదిగానే వుండిపోయింది.

చివరకు నారాయణదేవు మరణిస్తాడు. కోడలిని యీ వుద్యమాల గొడవలనుంచి తప్పించి నాలుగుగోడల మధ్య కట్టివుంచాలన్న రంగరామానుజులవారి అభిప్రాయం సాగిరాదు. ఇంతలో ఎన్నికలు వచ్చాయి. జమీందారువారు నిలబడ్డారు. ఆయనకు పోటీగా కోడలు శ్రీదేవి నిలబడ్డది. జమీందారుగారు ఎన్ని ప్రయత్నాలుచేసినా ఆమె నెగ్గింది. ఇలా శ్రీదేవి మామగారి అభిప్రాయాలకు బెదరింపులకు తల ఒగ్గదు.

ఈ కథ యిటీవలి చైనా అక్రమణవరకు కూడా పొడిగింప

బడ్డది. నారాయణదేవు శ్రీదేవి ల పాత్రలు, వారి జాతీయసేవ అన్నీ విస్పష్టంగా చిత్రించబడ్డాయి యీ నవలలో.

ఇవి గాక యద్దనపూడి సులోచనారాణి వ్రాసిన "విజేత"లో కూడా సత్యాగ్రహోద్యమానికి కొంత ప్రాముఖ్యం వుంది.

హరిజన సమస్యను గురించి ఎన్నో నవలలు వెలువడ్డాయి. వానిలో రావూరి సత్యనారాయణరావుగారి "నెలవంక"చెప్పుకో తగినది. అనాధుడైన హరిజన బాలుణ్ణి పెంచడానికి ఒక సనాతన బ్రాహ్మణ వంశంలో పుట్టిన బ్రాహ్మణుడు పూనుకుంటే అతడు ఎట్టి ఇబ్బందులకు లోనౌతాడో యీ నవల వాస్తవికంగా చిత్రించింది.

గాంధీజీ హరిజన సమస్యను ప్రారంభించక పూర్వమే పంచముల ఉద్ధరణ విషయంలో తెలుగు రచయితలు, సంస్కర్తలు ఎంతో శ్రద్ధ చూపారు. తల్లాప్రగడ సూర్యనారాయణమూర్తిగారి "హేలావతి" అన్న నవల (9-5-1913) తెలుగులో అస్పృశ్యతమీద వ్రాయబడ్డ మొదటి నవల. 1919లో వెంకట పార్వతీశకవులు వ్రాసిన "మాతృ మందిరము" అన్నది యీ నాటికీ ఆ సమస్యపై వచ్చిన నవలలలో వుత్కృష్టమైనది. పంచముల దేవాలయ ప్రవేశము, ఆ కులంలోని కన్యను వివాహమాడటం, మద్యాన్ని,గోవధను నిషేధించటం మొదలైనవన్నీ ఈ నవలలో విస్పష్టంగా చిత్రించారు రచయితలు. 1920 లో వచ్చిన వేలూరి శివరామశాస్త్రిగారి "అహోబలీయం" (ఓబయ్య అన్న పేరుతో భారతిలో వచ్చింది) జాతీయోద్యమంలోని బాగోగులను చర్చించిన మొదటి నవల.

స్వాతంత్ర్యానంతరం వచ్చిన చాల నవలల్లో గాంధీజీ సిద్ధాంతాల్లోని పవిత్రత, దానిని యీ నాటివారు ఎలా భ్రష్టం చేస్తున్నదీ వ్యంగ్యంగా చూపటం అలవాటయిపోయింది ఇవన్నీ బాపూజీ చెప్పిన మానవధర్మ సిద్ధాంతాలకు యీ నాటి నాయకమ్మన్యులు

చేస్తున్న విపరీతార్థాలకు వ్యంగ్యరూపమైన చిత్రణలు. ఇట్టి రచనలలో శ్రీ జి. వి. కృష్ణారావు వ్రాసిన "*కీలుబొమ్మలు*" ఎన్నదగిన రచన. ఇందులో అమ్మాయమ్మ - స్వార్థ ప్రయోజనాలకు, గాంధీజీ పేరు, హరిజనసేవ పేరు చెప్పుకొని ఎలా గ్రామ రాజకీయాలను తన అవసరానికి వాడుకొన్నదో చిత్రించారు రచయిత.

ఇట్టివే యింకా ఎన్నో నవలలు గాంధీజీని గురించి, గాంధీజీ సిద్ధాంతాలయిన అస్పృశ్యతా నివారణ, మద్య నిషేధము, వర్ణాంతర వివాహాలు, గ్రామ పునరుద్ధరణము అన్న విషయాలమీద వ్రాయబడ్డాయి. అవి అన్నీ నాటకాలలోవలెకాక ఆ నాటి సాంఘిక జీవనాన్ని స్పష్టంగా ప్రతిబింబించే రచనలు. గాంధీజీ ప్రభావము పల్లీయులను ఎలా మార్చిందీ "*మాలపల్లి*", "*కొల్లాయి గట్టితేనేమి*" చూపుతాయి. పట్టణాలలో ఎలా మార్చిందీ "*నారాయణరావు*", "*చదువు*" చెబుతాయి. వ్యక్తులను ఎలా మార్చిందీ "*కోనంగి*", "*చివరకు మిగిలేది*" చూపుతాయి. ఇలా అన్ని దశలలోని, వయసులలోని మనుష్యులపై గాంధీజీ ప్రభావం ఎంత విస్తృతమైనదో, ఎంత లోతైనదో నవలా సాహిత్యం మనకు చెప్పగలదు.

# 9

# జీవిత చరిత్రలు - సిద్ధాంత గ్రంథాలు

ఈ అధ్యాయంలో గాంధీజీని గూర్చి వ్రాయబడిన జీవితచరిత్ర లను, సిద్ధాంత గ్రంథాలను పరామర్శించడం జరుగుతుంది. నిజానికి వీని రెంటిని వేరుపరచడానికి వీలులేదు. గాంధీజీ జీవితమే ఆయన సిద్ధాంతము. "మీరు ప్రపంచానికిచ్చే సందేశమేమిటి?" అని గాంధీజీని అడిగితే, "నా జీవితమే" అని ఆయన సమాధానం చెప్పారట. అందు వల్ల వాని రెంటినీ వేరుపరచడానికి వీలులేదు. అందువల్లనే ఈ అధ్యా యంలో ఆ రెంటి పరామర్శ చేయబడుతుంది. సౌలభ్యంకోసం ముందు గాంధీజీపై వచ్చిన జీవిత చరిత్రలను, ఆ తరువాత గాంధేయసిద్ధాంతా లపై వచ్చిన గ్రంథాలను వేరువేరుగా పరామర్శించడం జరుగుతుంది.

జీవిత చరిత్ర లనగానే రెండు విధాల చరిత్రలు వస్తాయి. ఒకటి వ్యక్తి తన్ను గురించి, తన జీవితాన్ని గురించి తానే వ్రాసుకొన్న "ఆత్మకథ"లు. రెండవ విధమైన జీవితచరిత్రలు ఒరులు మరొక వ్యక్తిపై వ్రాసినవి. ఈ విభాగంలోని మొదటి పద్ధతికి చెందిన - గాంధీజీ 'ఆత్మకథ'కు అనువాదాలుగా వచ్చిన - గ్రంథాలను ముందు పరిశీలించాలి. ఆ తరువాత జీవిత చరిత్రలను గురించి ప్రస్తావించాలి.

జీవిత చరిత్రలలో తిరిగి మరొక విభజన చేయవలసివుంది: మౌలిక మైనవి, అనువాదాలు - అని. ఇందులో గాంధీజీ జీవితాన్ని గురించి వ్రాయబడిన ముఖ్యమైన వ్యాసాల దగ్గరనుంచి బృహద్గ్రంథాల వరకు అన్నీ పరిశీలింపబడతవి.

**ఆత్మకథలు**

కావ్య వాఙ్మయంలో వచ్చిన తుమ్మలవారి "*బాపూజీ ఆత్మ కథ*" ను పూర్వమే పరామర్శించడం జరిగింది. ఇక్కడ గాంధీజీ ఆత్మకథకు వచ్చిన గద్యానువాదాలను పరిశీలిద్దాం.

తెలుగు గద్యంలో వచ్చిన ఆత్మకథానువాదాలు మూడు. అందులో రెండు కాటూరి వెంకటేశ్వరరావుగారివి; మూడవది శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి అనువాదం.

ఇందులో వేలూరివారి అనువాదం సమగ్రమైనదీ, సరళమైనదీ కూడా. కాటూరివారి రెండు గ్రంథాలు గాంధీజీ "*ఆత్మకథ*"కు భరతన్ కుమారప్ప చేసిన సంగ్రహ గ్రంథానికి తెలుగుసేత. కాగా - వేలూరివారిది గాంధీజీ వ్రాసిన "*ఆత్మకథ*"కు సంపూర్ణమైన అను వాదము. దీనిలో మొదటి, రెండు, మూడు భాగాలు కలిసిన మొదటి సంపుటం 1931 లో వచ్చింది. నాలుగైదు భాగాలు 1932 లో మరో సంపుటంగావచ్చాయి. దీనికి "*ఆత్మకథ*" అన్న నామకరణం చేశారు అనువాద కర్త. ఇది కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి *ఆంధ్ర గ్రంథమాల* ప్రచురణ. అనువాదం క్లిష్టంగా వున్నా ఉత్తమమైన పద్ధతిలో సాగింది. ఆ నాడు దీనికి ఎంతో ప్రచారం వచ్చింది.

ఇక కాటూరివారి అనువాదం 1953 లో వచ్చింది - "*సత్యా శోధన*" అన్న పేరుతో. దానినే విపులీకరించి 1961 లో "*గాంధీజీ స్వీయకథ*" అన్న పేరుతో తిరిగి ప్రచురించారు.

కాటూరివారి అనువాద శైలి వేటూరివారి శైలికన్న

సరళమైన గ్రాంథికంలో వుండి ఈనాటి సామాన్య పాఠకులకు సైతం చదివే వీలును కల్పించింది.

**జీవిత చరిత్రలు**

జీవిత చరిత్ర ఒక విలక్షణమైన సాహిత్య ప్రక్రియ. మిగిలిన సాహిత్య ప్రక్రియలలో ఉండే భావన, ఉద్వేగాల అనుభూతుల ప్రకటన జీవిత చరిత్రలో ఉండే వీలులేదు. యథార్థతకు ప్రాముఖ్యం యిస్తూ, అక్కడక్కడ రచయిత చరిత్రకారునివలె తన అభిప్రాయాలను చెప్పవచ్చు. గాంధీజీపై తెలుగులో వచ్చిన జీవిత చరిత్రలు యీ సూత్రాన్ని ఎంతవరకు పాటించాయో చెప్పడం కష్టం. అప్పుడప్పుడు రచయితల భక్తి భావాలు వెల్లడి అవుతూ ప్రశంసలకు ఎక్కువ స్థానం యిచ్చినట్లు కనిపిస్తుంది వీనిలో.

గాంధీజీ 1919 ప్రాంతములలోనే భారత రాజకీయరంగంపై ప్రవేశించినా, దక్షిణాఫ్రికాలో ఆయన కావించిన మహత్కార్యాలు ఆంధ్రదేశంలో కూడా మారుమ్రోగాయి. ఆంధ్రపత్రిక, ఆంధ్రభారతి, కృష్ణాపత్రికలు వారి కీర్తిని గానం చేశాయి. అయితే ఇవి ఎక్కువ భాగం రాజకీయ సంఘటనలకు ఉండే ప్రాముఖ్యం కన్న ఎక్కువ ఆదరం పొందలేకపోయాయి.

తెలుగులో గాంధీజీపై వచ్చిన మొదటి వ్యాసం - తరువాత తరువాత ఆయనకు సన్నిహిత సహచరుడైన పట్టాభి సీతారామయ్య పంతులుగారిది కావడం విచిత్రమే! పట్టాభిగారు 1910 లోనే "ఆంధ్ర భారతి"లో "మోహన్‌దాస్ కరంచంద్ గాంధి" అన్న వ్యాసం వ్రాసి, దక్షిణాఫ్రికాలో అప్పటికే గాంధీజీ సాగించిన ఉద్యమాన్ని కొనియాడారు.

"భారతీయుల నెల్లర నవగౌరవపరచు శాసనములను నిరోధించుట యందు వీరి ధైర్య స్థైర్యములను, వీరి స్వార్థ త్యాగమును, తోడి

వారలకు వీ రొసంగిన ఉత్సాహమును వారిపై వీరికి గల వశీకరణ శక్తియు, వీరి యుద్యమముయొక్క పవిత్రతయు, వీరిచే నవలంబింప బడు సాత్త్విక సాధనములును చదువరు లెల్లరకు విస్పష్టముగ దెలిసియే యున్నవి"[1] అంటూ వారి జీవిత చరిత్రను ప్రారంభించారు. ఈ వ్యాసంలో పట్టాభిగారు గాంధీజీ దక్షిణాఫ్రికాలోని వివిధ స్థలాల్లో చేసిన విభిన్నమైన కార్యాలను, తమ సిద్ధాంతాలను ఆచరణలో పెట్టిన విధానాన్ని విపులంగా వర్ణించారు.

పట్టాభిగారు కేవలం యీ ఒక్క వ్యాసంలో మాత్రమే మహాత్ముని గూర్చి వ్రాయలేదు. ఆయన ప్రతి సంవత్సరము "*ఆంధ్ర పత్రిక*" ఉగాది సంచికలో "*సామ్రాజ్యమునందలి రాజకీయ పరివర్తనలు*" అన్న శీర్షికతో దేశంలో జరిగిన రాజకీయ విషయాలను గురించి వ్రాస్తూ ఉండేవారు వానిలో చాలమార్లు గాంధీజీ చేస్తున్న త్యాగబద్ధమైన కార్యక్రమాలను గురించి సమీక్షిస్తూనే వచ్చారు.

ప్రతి ఉగాదికి వెలువరించే "*ఆంధ్రపత్రిక*" వార్షిక సంచికలో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు జాతీయోద్యమ విశేషాలతో ముందు "ప్రస్తావన" వ్రాసేవారు. ఆ ప్రస్తావనలో తరుచు గాంధీజీని గూర్చి వ్రాయబడేది. ఆ వ్యాసాలను తిరిగి యీనాడు ప్రచురిస్తే దేశానికి ఎంతో సేవచేసినట్లు.

1914 వ సంవత్సరము సంవత్సరాది సంచిక "*ఆంధ్రపత్రిక*" లోని "ప్రస్తావన" లో గాంధీజీని గురించి యిలా వ్రాయబడ్డది :

"గత సంవత్సరమునందు రవీంద్రుని '*గీతాంజలి*' యు గాంధీగారి నిరపరాధ నిరోధక సైన్యమును...లోకదృష్టి నాకర్షించినవి." తరువాత "*గాంధిగారి త్యాగము*" అన్న ఉపశీర్షిక క్రింద "దక్షిణాఫ్రికాలోని భారతీయుల కష్టములు నివారించుటకై గాంధిగారు నిరపరాధ నిరోధక సైన్యమును నిర్మించిరి....నిరాయుధులును,

నిరాహారులును దౌర్జన్యము నెదిరించి విజయము నొందిరి...గాంధి గారు త్యాగసంపన్నులు. భారతీయుల మాన సంరక్షణకై గాంధిగారు పడిన కష్టములు దుర్భరములు...సుప్రసిద్ధార్యనాయకులవలె గాంధి గారు పూజ్యులై భారతీయుల హృదయపీఠముల నలంకరించగలరు."[2]

ఇలా ప్రతి సంవత్సరము గాంధీజీ దక్షిణాఫ్రికా భారతీయుల కష్టాలను తొలగించడానికి సాగించిన మహోత్కృష్టమైన ఉద్యమాల విశేషాలను పాఠకుల ముందు ఉంచేవారు "*ఆంధ్రపత్రిక* సంపాదకులు."

ఈ సందర్భంలో స్మరించవలసినవారు శ్రీ ముట్నూరి కృష్ణా రావుగారు. తెలుగుదేశంలో జాతీయోద్యమ వ్యాప్తికి "*కృష్ణా పత్రిక*" ఉపకరించినంతగా మరే పత్రిక ఉపకరించలేదు. అందులోనూ ముట్నూరివారి వాడి కలంనుంచి వెలువడిన వేడివేడి ఆదేశాలు, ఉప దేశాలు నాయకులను కూడా సరియైన మార్గాన నడిపించజాలినవి.

గాంధీజీ జీవితంమీద వచ్చిన ముఖ్యమైన వ్యాసాల ప్రసక్తి వచ్చినప్పుడు రాయప్రోలు సుబ్బారావుగారి వ్యాసం తప్పక ఉటంకించాలి. 1914 "*ఆంధ్రపత్రిక*" సంవత్సరాది సంచికలో ప్రచు రింపబడిన వారి వ్యాసం "*భగవాన్ మోహనదాస కరుణాసాంద్ర గంధి.*"[3] ఈ వ్యాసం 1908లో గాంధీజీ నాటాలు నుంచి జోహాన్స్ బర్గుకు రాగానే ఆయనకు అక్కడి నల్లవారు యిచ్చిన ఘనస్వాగతంతో ప్రారంభమవుతుంది.

"ఖైదీ దుస్తులలో నున్న ఆ పురుషుని ముఖవర్చస్సును, శాంతినితాంతమగు చూపును, ఒక విధమయిన విలక్షణశక్తిని ఆయనలో నుండి దశదిశల బ్రసరింపజేయుచుండెను...ఆ పురుషుని జూచినతోడనే ప్రక్కల తారాడుచున్న నల్లని మనుష్యులు సాష్టాంగ దండప్రణా మంబు లాచరించిరి...హృదయ కవాటమును దెఱచికొని ఆయన మూర్తిని బ్రవేశపెట్టుకొనిరి."[4]

గాంధీజీ కీర్తిప్రతిష్ఠలను గురించి చెబుతూ "అనుచరులకెల్ల నీ మహాత్మ్ము డొక్కఁడే శరణ మిచ్చెను...అది మనోబలము" అంటారు రాయప్రోలు. "గంధి ధర్మసేవానిరతుడు. ప్రజాసేవనము కంటె నుత్తమ ధర్మము ప్రపంచమున లేదు." "ఆయన మహోపన్యాసములు శాంతిపూర్ణములు, ధర్మ సమన్వయములు."

ఈ వ్యాసంలో గాంధీజీ జీవితమూ, ఆయన కార్యదీక్ష, ఉద్యమము – వీని సంక్షిప్త చరిత్ర యివ్వబడ్డది. గాంధీజీని భగవానుడని పొగడిన మొదటి వ్యాసం యిది.

1919 సంవత్సరానికి ముందు వచ్చిన జీవితచరిత్రలలో బొడ్డపాటి శేషగిరిరావుగారి "*గంధి జీవిత చరితము*" ముఖ్యమైనది. ఇది 36 పేజీల చిన్న గ్రంథము. దీనిలో గాంధీజీ దక్షిణాఫ్రికాలోని జీవితము మాత్రమే చిత్రించబడినది. పుట్టుకనుంచి 1916 వరకు గల చరిత్ర యిందు వ్రాయబడ్డది. అందువలన గాంధీజీపై వచ్చిన జీవిత చరిత్రలలో దీనిని ప్రప్రథమమైనదానినిగా పేర్కొనవచ్చు.

1920 వ సంవత్సరం ప్రచురింపబడిన జీవిత చరిత్రలలో "*గంధి మహాత్ముడు*" అన్న పి. నరసింహముగారి రచన ఒకటి ఉన్నది. దీనిలో కూడ 1916 వరకు – గాంధీజీ దక్షిణాఫ్రికానుండి తిరగి బయలుదేరు వరకు – గల జీవితమే చిత్రించబడ్డది.

గాంధీ మహాత్ముని జీవితచరిత్రలు అటు గుణంలోను, యిటు సంఖ్యలోను కూడ విస్తృతంగా రావడం ప్రారంభమైనది 1921నుంచి. ఈ క్రమంలో వచ్చిన జీవితచరిత్రలలో మొదటిది మానికొండ సత్యనారాయణశాస్త్రిగారి "*శ్రీ గాంధిమహాత్ముని జీవితము*" (1921). ఇది స్వరాజ్యాశ్రమము, నరసారావుపేట వారి తరపున శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావుగారు ప్రకటించినది. ఈ గ్రంథానికి "మహాత్ముని ప్రధాన శిష్యులలో నొకరగు" శ్రీయుత దిగుమర్తి

హనుమంతరావుగారు ఉపోద్ఘాతం వ్రాశారు. ఈ ఉపోద్ఘాతంలో హనుమంతరావుగారు తమకు, గాంధీగారికి గల పరిచయాన్ని తెలియ చేశారు. అసలు గ్రంథంలో చెప్పని గాంధీజీ గొప్పతనాన్ని వ్రాక్రు చ్చారు. కొన్నిచోట్ల గ్రంథకర్తను విమర్శించారు కూడా.

హనుమంతరావుగారు యీ జీవితచరిత్రను గురించి చేసిన ముఖ్యమైన విమర్శ - రచయితకు "తన కథా నాయకునితో కొంత కాలమైనను కలసి మెలగుటకు గాని, వారిచే నిర్వహింపబడుచున్న సంస్థలను గన్నులార గాంచుటకుగాని యవకాశము లభించినట్లు తోచదు." అందువలననే కొన్ని పొరపాట్లు దొర్లినాయంటారు.

హనుమంతరావుగారు చెప్పిన ఒక్క విషయం మాత్రం సత్యం: యీ గ్రంథకర్త "వీరారాధకుడు". గాంధీజీ యెడ యీయన కున్న భక్తి ప్రపత్తులు ఎనలేనివి. ఈ గ్రంథం ముఖ్యంగా మూడు అధ్యా యాలుగా విభజింపబడ్డది. (1) దక్షిణాఫ్రికా చేరుకొనే వరకు గాంధీజీ జీవితం; (2) దక్షిణాఫ్రికా రంగము - సేవ; (3) భారతరంగము.

సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించబడినంతవరకుగల చరిత్ర వివరంగా యీయబడ్డది దీనిలో. ఆ తరువాత శాస్త్రిగారు మహాత్ముని సిద్ధాంతాలలో కొన్నింటిని గూర్చి వివరంగా తెలియ చెప్పారు. వానిలో "స్వదేశి యననేమి ?", "పాశ్చాత్య విద్యా గర్వము", "నీచదాస్యబుద్ధి", "లా కోర్టులను బహిష్కరింపుడు", "అహింస - దౌర్జన్య రాహిత్యము", "హిందూముసల్మానులు, బ్రాహ్మణ బ్రాహ్మణేతరులు" అన్న శీర్షికలు ఉన్నాయి.

మహాత్ముని గుణగణాభివర్ణనము, సత్య సందర్శనము - అన్న విషయ శీర్షికలతో గ్రంథం అంతమవుతుంది.

ఈ గ్రంథంలో మిగిలిన అన్ని జీవిత వివరాలతోపాటు మరొక విశేషం కూడా ఉంది. తిలక్ చనిపోగానే ఆయన నుంచి ఒక

మహత్తర శక్తి వచ్చి గాంధీలో లీనం అయినదన్న విషయాన్ని చాల మంది రచయితలు - కవులు, నాటకకర్తలు, గేయకర్తలు, జీవిత చరిత్రకారులు - పేర్కొన్నారు. ఇందరు రచయితలు యీ విషయంలో యింత ఏకాభిప్రాయాన్ని చూపడానికి గల కారణాన్ని శాస్త్రిగారు తమ గ్రంథంలో వివరించారు.

ఈ సంఘటన జరిగినట్లు మొట్టమొదట ఊహించి ప్రజలముందుంచినది శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారట ! ఉన్నవవారు తమ ఉపన్యాసంలో తిలక్, గాంధీలను "నూతనావతార ఆవిర్భావము" అంటూ పరశురామ, శ్రీరామావతారాలతో పోల్చారు. ఆ తరువాత తిలక్ మరణ సమయాన్ని గురించి యిలా చెప్పారు :

"లోకమాన్యుడు రాత్రి ఒంటిగంటకు నిర్యాణమునొందుననగా మధ్యాహ్నము గాంధిమహాత్ముడు లోకమాన్యుని సందర్శింప వచ్చెను. లోకమాన్యుడు అంత్యనిముషమువరకును స్పృహకలిగి యుండుటచే మహాత్ముని జూచి 'నే జబ్బుగ నుంటినని చూడ వచ్చితివా ? నే జబ్బుగ లేనే !' యని ప్రశ్నించెను. దానికి మహాత్ముడు బదులుచెప్పక లోకమాన్యుని పొట్టలో తన తల యుంచెను అరగంట తరువాత మహాత్ముడు లేచి నిలువబడెను. వెంటనే డాక్టరులు లోకమాన్యుని పరీక్షింపగా లోకమాన్యుని శక్తియంతయు నాయనను విడిచి మహాత్మునిలో నావిర్భవించినట్లు లోకమాన్యుడు విగతజీవుడైనట్లు గన్పట్టెను."[5]

గ్రంథాంతంలో గాంధిగారిని త్రిమూర్త్యాత్మకుడుగా వర్ణించారు రచయిత : "మహాత్ముడు కాలజ్ఞుడు. కాలస్వరూపుడు...జ్ఞాన స్వరూపుడు. భగవత్సంకల్పము నెరిగిన ధన్యాత్ముడు." ఇందులో కేవలం వీరారాధనమే కాక సిద్ధాంత ప్రవచనం కూడా ఉన్నది.

ఇదే సంవత్సరంలో వచ్చిన మరొక జీవిత చరిత్ర ఆత్మకూరి

గోవిందాచార్యులుగారి *"గాంధిమహాత్ముని చరిత్ర"* (1921). ఈ పుస్తకాన్ని వ్రాయడంలో రచయితకు "సరోజినీదేవిచే రచింపబడిన ఆంగ్ల గ్రంథమును, వావిళ్లవారిచే ప్రకటింపబడిన తెలుగు గ్రంథమును తోడ్పడినవి" అని రచయితే చెప్పుకొన్నారు. ఈ చరిత్ర ఆలీసోదరుల అరెస్టుతో అంతమౌతుంది. అదే సంవత్సరం రెండవ కూర్పు కూడా వచ్చింది. అప్పటికి జరిగిన రాజకీయములైన మార్పులు కూడ యీ రెండవ సంస్కరణలో చేర్చబడ్డాయి.

ఆత్మకూరివారు పేర్కొన్న వావిళ్లవారి ప్రచురణ *"మోహన దాస కరంచందు గంధి"* అన్నది (1916). "స్వయముగ ఎఱిగినవా రందరు దేవదూత యని, మతగురు వని యితనిని భావింతురు" అన్నారు యీ చిన్న పుస్తకంలో. రచయిత పేరు లేదు.

మానికొండవారి జీవిత చరిత్ర తరువాత పేర్కొనదగిన చరిత్ర కొమాండూరి శఠకోపాచార్యులు వ్రాసిన *"గాంధి చరిత్రము"*. ఇది చాలసార్లు పునఃముద్రణము అందిన గ్రంథం. 80 ప్రకరణాల్లో వ్రాయ బడిన యీ జీవిత చరిత్ర కొంతలో కొంత సమగ్రమైనదనే చెప్పవచ్చు

"ఆయన పురుషోత్తముని యవతార మనియు కొందరందురు. తాను వట్టి మనుష్యుడనని గాంధిగారు స్పష్టపరచినాడు." అంటాడు రచయిత, భూమికలో. ఈ జీవిత చరిత్రలో జననం నుంచి ఫలితం వరకు - 1947 వరకు - గల బాపుజీ జీవితం చిత్రింపబడ్డది. 1947 ఫిబ్రవరి 20 వ తేదీన ముగిసింది ఈ కథనం.

గాంధీజీ కార్యక్రమాల, సత్యాగ్రహ సమరాల వివరణ - ప్రకరణాల వారీగా - ఇందులో ఉన్నది. ఇందులో ప్రశంసలకన్న గాంధీజీని రాజకీయనాయకుడుగా అట్టి నాయకులలో ఉన్నతుడైన నాయకునిగా భావించి చిత్రించడం జరిగింది. దీనికి చాల ముద్రణలు కూడ వచ్చాయి.

1916 ప్రాంతాలలో వ్రాయబడ్డ మరో జీవితచరిత్ర యస్. వి. రంగాచార్యులు వ్రాసిన *"మోహనదాస కరంచంద్ర గంధి జీవిత చరిత్రము"* అన్నది దక్షిణాఫ్రికా సత్యాగ్రహం వరకే పరిమిత మైనది. 23 పేజీల చిన్న గ్రంథం.

1920-40 మధ్యకాలంలో వచ్చిన జీవిత చరిత్రలు చాల భాగం గాంధీజీని భగవత్స్వరూపుడుగా చూచినవే! ఈ కాలానికి చెందిన రచనలలో ఆదిపూడి సోమనాథరావు వ్రాసిన *"గాంధి మహాత్ముడు"*, యన్. జగన్నాథరావు వ్రాసిన *"గాంధీ జీవితము"* ఇట్టివే!

1940 తరువాతకాని గాంధీజీపై ఆత్మాశ్రయం కాని రచనలు వెలువడలేదు. అంతవరకు గాంధీజీ ఏర్పరచిన సత్యాగ్రహ పథంలో నడచినవారే ఆయన జీవితచరిత్రలు వ్రాయడంతో అవి ఆత్మాశ్రయ రచనలై వీరారాధన చేసే గ్రంథాలయ్యాయి. వానిలో రెండు మూడు కేవలం వీరారాధన గ్రంథాలుగా మాత్రమేకాక ఆయన సిద్ధాంతాలను చర్చించినవి ఉన్నా, చాల రచనలు అట్టివే!

1940 లో వెలువడిన దంటు కృష్ణమూర్తిగారి **"బాపూజీ"** అన్న జీవితచరిత్ర ఉత్తమంగా వ్రాయబడ్డ వానిలో ఒకటి. ఇందులోని భాష సరళమూ, చక్కని వ్యావహారికమూ. దంటు కృష్ణమూర్తిగారికి కథ చెప్పే కళ తెలుసు. 20 అధ్యాయాలు గల యీ జీవితకథ మంచి నవలలా చదవడానికి అతి సులభంగా వుంది.

ఇదే జీవితచరిత్ర 1949 లో ప్రచురింపబడ్డప్పుడు దీనికి పరిచయవాక్యాలు వ్రాస్తూ, కళా వెంకటరావుగారు "రామగాథ వలె గాంధీగాథ యెన్ని మారులు యెన్నెన్ని వైఖరులలో కవులు గానము చేసినను, గద్య రచించినను తనివితీరదు" అన్న సత్యాన్ని చెప్పారు. ఈ జీవితచరిత్రకు చివర ఆయన మరణానికి వివిధ నాయకులు యిచ్చిన సందేశాలు పొందుపరచబడి వున్నాయి.

1940 లో ప్రచురింపబడ్డ మరో జీవితచరిత్ర ***"గాంధిమహాత్ముడు"*** అన్న దేశోద్ధారక గ్రంథమాల వారి ప్రచురణ. రెండు భాగాలుగా ప్రచురింపబడిన యీ గ్రంథానికి రచయిత "విష్ణుచక్రం" మల్లంపల్లి, పట్టాభిగార్ల ఉపోద్ఘాతాలతో ఉన్న యీ పుస్తకం ప్రముఖ దేశభక్తుడు వట్టికోట ఆళ్వారుస్వామిగారి ప్రచురణ.

అనేకములైన జీవితచరిత్రలలో మంచెళ్ల సుదర్శనాచార్యులు వ్రాసిన *"గాంధీమహాత్ముడు"*, వడ్డాది వీర్రాజు సిద్ధాంతి వ్రాసిన ***"మహాత్మాగాంధి"*** (జాతక రహస్యములు), *"గాంధీమహాత్ముడు"* అన్న పేరుతో భాగవతుల నరసింహామూర్తిగారు రెండు భాగాలలో వ్రాసిన గ్రంథం ముఖ్యమైనవి.

ఇటీవల వచ్చిన జీవితచరిత్రలలో వెలిదండ్ల శ్రీనివాసరావుగారి *"గాంధీమహాత్ముని సమగ్ర జీవితచరిత్ర"*, రావెళ్ల రామయ్యగారి ***"మానవ జీవితము - గాంధీమహాత్ముడు"***, ఊట్ల కొండయ్యగారి ***"గాంధీపథం"*** ముఖ్యమైనవి. శ్రీ వెలిదండ్ల వారి అనువాదం సమగ్రమూ, ఆధికారికమూ అనవచ్చు

రావెళ్ల రామయ్యగారు వ్రాసిన *"మానవ జీవితము - గాంధీమహాత్ముడు"* అన్న గ్రంథంలోని ప్రణాళిక చమత్కారమైనది. ఇందులో రెండు భాగాలున్నాయి. మొదటిది *"మానవజీవితము"* ఇందులో మానవుడు, అతని అవసరాలు, స్వాతంత్ర్యేచ్ఛ, దానిని సాధించడానికి మహాపురుషుల ఆగమనం - యిట్టి విషయాలు ప్రస్తావించబడ్డాయి. దీనిని సిద్ధాంతఖండము అనవచ్చు. ఈ ఖండంలో చెప్పిన సిద్ధాంతాల ప్రయోగం రెండవ భాగమైన *"గాంధీమహాత్ముడు"* లో కానవస్తాయి.

రచయిత యీ గ్రంథం చివరలో యథాశక్తి వీరారాధన చేశాడు. గాంధీని అవతార పురుషుడనీ, ఆయనది పుట్టుటకు తగిన జీవితమనీ చెప్పబడ్డది. "గాంధి తత్త్వమునకు గాలదోషము గలుగ

జాలదు......మహాత్ముడే గీత. మహాత్ముడే వేదములు" అంటాడు యీాయన.

శ్రీ ఊట్ల కొండయ్య వ్రాసిన *"గాంధీపథం"* (1966) ప్రభాకర్ జీ డైరీ ఆధారంగా మహాత్ముని జీవితంలోని అనేక సంఘటనలను ఇంతవరకు తెలియనివానిని - చెప్పే గ్రంథం. రచన - చదువుకోవడానికి అనువుగా, చక్కని వ్యావహారికంలో చేయబడ్డది. ఇందులో సంఘటనలు ఇంతవరకు చరిత్ర కెక్కనివి కావడంవల్ల, కొంత హాస్యపుపాలు కలసి వుండడంవల్ల వినూత్నమైన అనుభూతిని యివ్వగలవు.

గాంధీ సాహిత్య ప్రచురణాలయంవారు ఇటీవల ప్రచురించిన *"నే నెరిగిన మహాత్మగాంధి"* అన్న ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య గారి రచన కూడా చెప్పుకోతగ్గది. గాంధీజీకి సన్నిహితులైనవారు ఎందరో క్రమంగా మనలను వీడి పోతున్నారు. వారి సన్నిహితమైన సహచర్యాన్ని గ్రంథస్థం చేయించడం భావితరాల వారికి ఎంతో మేలు చేయడం. ఉన్నవవారికి గాంధీజీకి వున్న ఆత్మీయతను ఈ గ్రంథం వెలువరిస్తుంది. గాంధీజీతో ఎవరి సన్నిహిత సహచర్యాన్ని గురించి చదివినా, ఆ అనుభవం మనం పొందినట్లుగా, ఎంతో ఆత్మీయం అయినట్లుగా భావిస్తాం. అదే కావచ్చు, ఆయనను మహాత్ముణ్ణి చేసిన గుణం. అట్టి సాన్నిహిత్యం ఉన్న మిగిలిన తెలుగువారిచేత కూడా ఇటువంటి గ్రంథాలు వ్రాయించి ప్రచురించడం ఎంతైనా అవసరం.

### జీవిత చరిత్రలు : కొన్ని అనువాదాలు

గాంధీజీ జీవితాన్ని గురించి పాశ్చాత్యులు, భారతీయులు ఇంగ్లీషులో, తదితర భాషల్లో వ్రాసిన గ్రంథాలకు అనువాదాలు కూడా ఎన్నో వచ్చాయి. అందులో ముఖ్యంగా పేర్కొనదగినవి : రోమారోలా వ్రాసిన గ్రంథానికి కాటూరి వెంకటేశ్వరరావుగారి

అనువాదం; విన్సెంట్ షీన్ గ్రంథానికి దేవరకొండ చిన్నికృష్ణశర్మ అనువాదం; లూయీఫిషర్ గ్రంథానికి దేవదాస్ అనువాదం; డాక్టర్ రాధాకృష్ణన్ గాంధీజీ సప్తతి జన్మదినోత్సవానికి తయారుచేసిన "*గాంధీ - గాంధీతత్త్వము*" అన్న గ్రంథానికి "*మహాత్మాజీ*" అన్న పేరుతో ముదిగంటి జగ్గన్నశాస్త్రిగారి అనువాదం ముఖ్యమైనవి.

రోమారోలా ఫ్రెంచి రచయిత. "*జీన్ క్రిస్టోఫో*" అన్న నవలతో ప్రపంచవిఖ్యాతి నార్జించినవాడు. గాంధీజీకి మిత్రుడు. ప్రపంచంలోని విఖ్యాత పురుషుల్లో గాంధీజీ ఒకడని ఆయన నమ్మకం. కాటూరివారి అనువాదం కొంత క్లిష్టంగావున్నా, మూలానికి దగ్గరగా వున్నది.

లూయీఫిషర్ అమెరికన్ పాత్రికేయుడు, రచయిత. గాంధీజీతో రెండుసార్లు సుదీర్ఘమైన సంభాషణలు జరిపి ఒక జీవిత చరిత్రను, '*గాంధీతో ఒకవారం*' అన్న అనుభవాలనూ ప్రచురించాడు. ఆంగ్లంలో ఆ గ్రంథం చాలా ప్రచారంలోకి వచ్చింది. ఫిషర్ జర్న లిస్టు కావడంవల్ల సంఘటనలను కథాకథనంలో వాడుకొనే నేర్పు అత్యద్భుతంగా కలవాడు. ఆంగ్ల గ్రంథం జీవితచరిత్రలా ఏ కోశాన తోచదు. మంచి నవల చదువుతున్న అనుభూతి కలుగుతుంది. ఫిషర్ గాంధీజీతో కొన్ని విషయాలలో ఏకీభవించలేదు. అయినా గాంధీజీ లోని ఆధ్యాత్మిక శక్తికి ఎంతో ముగ్ధుడైనాడు. ఈ జీవిత చరిత్రకు తెలుగులో సమగ్రమైన అనువాదం రాలేదు. 1944 లో "దేవదాసు" ఇందులో కొన్ని భాగాలను మాత్రమే తెనిగించారు. అనువాదంలో చెప్పుకోదగిన విశేషమేమీలేదు.

విన్సెంట్ షీన్ గ్రంథానికి దేవరకొండ చిన్నికృష్ణశర్మగారి అనువాదం "*మహాత్మగాంధి*" (1958). షీన్ చాల రోజులు ఇండియాలో ఉండి గాంధీజీతో ఎంతోదగ్గరగా మెలిగినవాడు. షీన్ గాంధీజీని

గురించి "మానవుల నందరినీ ఆత్మసమానులుగా మన్నించిన యీ మానవునికి మనకాలంలో సమాను లెవరూ లేరు" అని ప్రశంసిస్తూనే "గాంధీజీ తన జీవిత లక్ష్యాలలో పరాజయం పొందారు" అంటాడు ఈ అనువాద గ్రంథానికి తొలిపలుకు వ్రాసిన ప్రఖ్యాత జర్నలిస్టు, సంపాదకుడు శ్రీ ఖాసా సుబ్బారావుగారు - పై అభియోగానికి సమాధానం చెబుతూ "తమ అనంతరం కూడా శతాబ్దాల తరబడి మానవలోకం తమ ప్రబోధాలను శిరసావహించేటట్లు చేసికోగలిగిన క్రీస్తు, బుద్ధుడు, సోక్రటీసు కూడా జీవిత లక్ష్యసాధనలో పరాజితులయినారంటే ఇక విజయం సాధించేవారెవ్వరు ? కాని, గాంధీ పరాజయాన్ని ఇలా నిర్వచించడంవల్ల చరిత్రలో ఆయన సుస్థిరం చేసికొన్న మహా విజయాన్ని ఉపేక్షించినట్లవుతున్నది" అన్నారు. షీన్ చేసిన లోపం ఏమంటే—గాంధీజీ జీవిత లక్ష్యాలను తాత్కాలికమైన స్వాతంత్ర్య సాధనకే పరిమితం అనుకోవడం. మొత్తానికి అనువాదకుడు చెప్పినట్లు "సంక్షిప్తమూ, వ్యక్తిగతమూ, ప్రబోధదాయకమూ అయిన యీ జీవిత చరిత్ర పుటలలో మనకు భరతఖండాన్నీ, బ్రిటిష్ సామ్రాజ్యాన్నీ, ప్రపంచాన్నీ కూడా తన మాటలతో చేతలతో ఊయల లూగించిన అత్యద్భుత చరిత్రుడూ, ఋషికల్పుడూ అయిన ఒక మహాపురుషుడు తిరిగి సాక్షాత్కరిస్తాడు" ఈ గ్రంథంలో.

"మహాత్మాజీ" అన్న పేరుతో వివిధ రచయితలు ఆంగ్లంలో వ్రాసిన వ్యాసాల సంకలనానికి ముదిగంటి జగ్గన్నశాస్త్రిగారి అనువాదం ముఖ్యమైన గ్రంథమే అయినా అంత చెప్పుకోదగినంత ప్రమాణంలో లేనట్లే. డాక్టర్ రాధాకృష్ణన్ గాంధీజీ డెబ్బదియవ జన్మదినోత్సవానికి సంకలనంచేసిన యీ గ్రంథంలో ఎందరో జాతీయ అంతర్జాతీయ నాయకులు గాంధీజీకి సమర్పించిన భక్త్యంజలులు ఉన్నాయి. అది ప్రతివారికి చదవడానికి వీలయిన భాషలో వ్రాయ

బడాలి. అసలు రాజకీయ సంబంధమైన ఏ సాహిత్యమైనా విధిగా అతి తేలిక శైలిలో మధురమైన వ్యావహారిక భాషలో వ్రాయబడాలి. కాగా, ఇంత ముఖ్యమైన గ్రంథానికి చేయబడిన తెలుగు అనువాదము ఏమీ బాగాలేదు. అనువాదకులు ప్రఖ్యాతులు. గాంధీజీ సిద్ధాంతాలంటే వారికి ప్రాణం. ఉద్యమాలలో పనిచేసినవారు. కాని ఒక గ్రంథానికి - అందునా మరీ విద్యావంతులు కానివారికి కూడా అందుబాటులో ఉండవలసిన గ్రంథానికి - వారు ఎంచుకొన్న భాష గ్రాంథికము. శైలి జటిలము.అనువాదము ఏమీ సాఫీగా నడవలేదు. ఉదాహరణకు డాక్టర్ రాధాకృష్ణన్ వ్రాసిన మొదటి వ్యాసంలోని ఆఖరు మాటలకు శాస్త్రిగారి అనువాదం యిది :

"గాంధీగీ మోక్ష జీవిత ప్రవక్త. అతని ప్రత్యేక పవిత్రత వలనను, వీరత్వము వలనను లక్షలకొలది ప్రజ లతనికి బాసటగ నుందురు. ఆధునిక దేశికులు అనిర్దిష్టమగు సాధారణ మంచిని ఆచారబద్ధమగు శ్రీరంగనీతులను, సరసమగు నటనలను బోధింపగలరే కాని, ఇట్టి యసమాన సాదృశములలోని దివ్యశక్తిని, సత్యస్వరూపమును చూప జాలరు."

ఇట్టి అనువాదాలవల్ల - మూలంలోని రచయితలకు చేసే ద్రోహం మాట అటుంచి - గాంధీజీకి మనం ఎంత ద్రోహం చేస్తున్నాం !

అనువదింపబడిన గాంధీ జీవిత చరిత్రలలో ఘనశ్యామ్‌దాస్ బిర్లా వ్రాసిన జీవితచరిత్రానువాదం "బాపూజీ" కి (1932) మోటూరి సత్యనారాయణగారి అనువాదం ఉత్తమమైనది బిర్లా అంటారు : "71 సం॥ నియమబద్ధంగా ఆయన గడిపిన జీవితం జయ ప్రదంగా వ్రాయాలంటే ఎప్పుడూ సాధ్యంకానిపని. వ్రాయడానికి గాంధిగారిని పూర్తిగా అర్థం చేసుకున్నది మాత్రం ఎవరు ? .. గీతను

గురించి కృష్ణుడికే పూర్తిగా తెలుసు. ధనుర్ధరుడైన పార్థునికి కొంచెం తెలుసునేమొ. అన్నట్లు గాంధిగారిని గురించి వారికే బాగా తెలుస్తుంది. వారితో ఉండే మహాదేవదేశాయిగారు వారిని గురించి కొంచెమేమైనా ఎరుగుదురేమో !"

బిర్లాగారి స్వానుభవమైన విషయాలు యిందులో ఎన్నో యివ్వబడ్డాయి - మధ్యమధ్య గాంధిగారి దక్షిణాఫ్రికా అనుభవాలు జోడించబడ్డాయి. నిజానికి యిందులో గాంధిగారి జీవితంలోని సంఘట నలు మాత్రమే వర్ణించబడినా ప్రతి సంఘటన వెనుక గాంధీజీ వ్యక్తిత్వం వర్ణితమైంది. గాంధీజీపై స్వాభిప్రాయాలను గ్రంథస్థం చేసిన ప్రయత్నా లన్నింటిలోను ఇది ప్రశంసనీయమైనది. అనువాదం ఎంతో సాఫీగా నడిచి చదవడానికి సుకరంగా ఉంది.

జార్జి కాట్లిన్ అన్న సోషలిస్టు వ్రాసిన గ్రంధానికి "*గాంధీజీ అడుగుజాడలలో*" (1952) అన్న అనువాదం - కాళహస్తి లక్ష్మణ స్వామిగారిది - మంచి అనువాదాలలో ఒకటి. "ఆంధ్ర భాషలో ఇటువంటి జాతీయ చరిత్ర లేదు" అన్న కృత్తివాసతీర్థులుగారి అభి ప్రాయం కొంత అతిశయోక్తిగా కనబడినా - తేలిక శైలిలో, చక్కని వ్యావహారికంలో వ్రాయబడ్డది జీవిత చరిత్ర.

ఇవిగాక భారతీయులైన వినోబాజీ, నెహ్రూ, ఆర్.ఆర్. దివాకర్ ప్రభృతులు వ్రాసిన జీవిత చరిత్రలకు, వారివారి అభిప్రా యాలు తెలిపే గ్రంథాలకు కూడా అనువాదాలు వచ్చాయి.

అనువాదాలను గురించి చెప్పవలసి వచ్చినప్పుడు గాంధీ సాహిత్య ప్రచురణాలయంవారి ప్రచురణలను తప్పక పేర్కొనవలసి వుంటుంది. వీరు గాంధీజీ వ్రాసిన ఎన్నో గ్రంథాలను - చిన్నవానిని, పెద్దవానిని కూడా - అనువదింప చేశారు. ఈ అనువాదాలలో వెలు వడిన మొదటి గ్రంథాలు అనువాదంలో సిద్ధహస్తులైనవారికి కాక,

దేశసేవలో ఆరితేరినవారికి ఇవ్వడంతో ఆ అనువాదాలు చాలా వానిలో ఉత్సాహం, భక్తి ఉన్నంతగా, భాషాపాటవం, సరళమైన అనువాదం కనిపించవు. తరువాత తరువాత వీరు ఈ లోపాన్ని పూరించారు

ఈ అనువాదాల్లో పేర్కొనదగినవి కొండాలి ఆంజనేయులు, మల్లవరపు విశ్వేశ్వరరావు, అడపా రామకృష్ణరావు, భీమసేన్ 'నిర్మల్' గార్లవి. మాతృకను ఎరిగి, భాష నడవడిని ఎరిగి చేసిన అనువాదాలే ఏనాటికైనా నిలిచేవి. అట్టి అనువాదాలు వీరినుంచి వచ్చాయి.

ఇవి కాక భీమసేన్ 'నిర్మల్' వ్రాసి, మహాత్మ ప్రచురణల వారు ప్రచురించిన మహాత్ముని ఆత్మకథకు సంక్షిప్త రూపం "మహాత్మ" కూడా మెచ్చుకోదగిన అనువాదం. విద్యార్థులు చదువుకోవడానికి అనువైనది.

ఇటీవల పత్రికల్లో గాంధీజీని గురించిన వ్యాసాలు, లేదా వారికి సన్నిహితులైనవారు వ్రాయగా అనువదింపబడిన వ్యాస పరంపరలు ఎన్నో వెలువడ్డాయి. అట్టివానిలో ముఖ్యమైన రెంటిని ఇక్కడ పేర్కొనాలి: సుశీలా నాయర్ వ్రాసిన గ్రంథానికి శ్రీ తిరుమల రామచంద్ర చేసిన అనువాదం "*కారాగార కథలు*" అన్నది. అతి సులభమైన శైలిలో సుశీలా నాయర్ మాతృకలో చెప్పిన సునిశితమైన భావాలను ఎంతో సమర్థవంతంగా అనువదించారు శ్రీ రామచంద్ర. రెండవది శ్రీ కోడూరి శ్రీరామమూర్తి "*ఆంధ్ర జ్యోతి*" లో వారం వారం ప్రచురించిన "*గాంధీజీ కథావళి*".

కార్యకర్తలకు, సామాన్య ప్రజలకు గాంధీజీ సిద్ధాంతాల యెడ ప్రగాఢమైన భక్తివిశ్వాసాలను కలగజేయడానికి పత్రికలు తోడ్పడి నంతగా మరో ఏ ప్రక్రియా, విధానమూ తోడ్పడలేదు. అందులో కూడా ముఖ్యంగా ఆనాడు తెలుగు దేశంలోని మారుమూల గ్రామా లలో కూడా రచ్చబండల మీద పారాయణం చేయబడ్డ *ఆంధ్రపత్రిక*, *కృష్ణాపత్రిక*లు ముఖ్యమైనవి. ఈ పత్రికలలోని సంపాదకీయాలు,

వ్యాసాలు కూడా ప్రజలకు గాంధీ విధానాల యెడ అనురక్తిని కలుగచేశాయి.

*కృష్ణాపత్రిక*, *ఆంధ్రపత్రిక*ల సంపాదకులు ఇద్దరూ ప్రముఖ గాంధీవాదులే! ముట్నూరి కృష్ణారావు, కాశీనాథుని నాగేశ్వరరావు గార లిద్దరూ అచంచలమైన దేశభక్తి, కార్యదీక్ష కలవారు.

నిశితమూ, నిష్పక్షపాతమూ అయిన కలంనుంచి ధారావాహికంగా వెలువడిన వారి జాతీయోద్యమ వ్యాసాలు, సంపాదకీయాలు చిరస్మరణీయాలు.

*ఆంధ్రపత్రిక* దినపత్రికలో గాంధీజీ రాజకీయ వ్యవహారాలను గురించిన వార్తలేకాక ఆయన సిద్ధాంతాలపైన, ఆయన జీవితంపైన ఎన్నో వ్యాసాలు వెలువడ్డాయి. 1914 లోనే గాంధీజీని గురించి, ఆయన దక్షిణాఫ్రికాలో సాగించిన సత్యాగ్రహ విధానంపైన వివరణాత్మకమైన వ్యాసాలు వెలువడడమే ఇందుకు నిదర్శనం. అవికాక *ఆంధ్రపత్రిక* సంవత్సరాది సంచికల "ప్రస్తావన" అన్న సంపాదకీయాలలో దేశ రాజకీయాలను పర్యవేక్షిస్తూ గాంధీజీ సాగించిన అనేక రాజకీయోద్యమాలపైన వివరణాత్మకమైన సమీక్షలు వెలువడ్డాయి. వానినన్నింటినీ రాజకీయ వ్యాఖ్యానాలనవచ్చు.

ముట్నూరి కృష్ణారావుగారు - వ్యక్తిగాను, సంపాదకుడిగాను కూడా ఉన్నతుడు. సత్యాగ్రహోద్యమం ముమ్మరంగా సాగేరోజుల్లో *కృష్ణాపత్రిక* ఊరూరా వేదంవలె పఠించబడేది. దానికి కారణం ముట్నూరి వారి ఉద్రేకపూరితమైన సంపాదకీయాలే. 1920 లో గాంధీజీ భారత రాజకీయరంగంమీద ప్రవేశించిన నాటినుంచీ కూడా కృష్ణారావుగారు గాంధీతత్త్వాన్ని జాగ్రత్తగా అవగాహన చేసుకొని దానిని విశ్లేషించి, దాని మాహాత్మ్యాన్ని పాఠకులకు చాటి చెప్పడానికి కృషి చేసినవారే!

1921 లో ఆయన పుట్టిన రోజును పురస్కరించుకొని "మహా జయంతి" అన్న సంపాదకీయంనుంచి మొదలుపెట్టి కృష్ణారావుగారు కృష్ణాపత్రిక సంపాదకత్వం నెరపినంతకాలం ఇట్టి వ్యాఖ్యానాత్మక వ్యాసాలు వెలువడుతూనే వచ్చాయి. అవి ఏ జాతి అయినా కల కాలం నిలుపుకోవలసిన కావ్యఖండాలు. ముట్నూరివారు అటు ఆధ్యాత్మికతను, ఇటు రాజకీయాలను సమంగా మేళవించి గాంధీజీ వంటి అత్యుత్తమ ఆధ్యాత్మిక వేత్తకు సరియైన వ్యాఖ్యాత అయినారు.

"గాంధీజీ ఒక మహానది. మిగిలిన అన్ని వెల్లువలు అందులో కలిసిపోవలసినదే"నని, "మహాపురుష జననము లిట్టి నదీప్రవాహములకు బోలనగును" అనీ చెప్పి గాంధీజీని సర్వప్రపంచంలోని మహాపురుషుల కోవలో చేర్చారు కృష్ణారావుగారు. "బుద్ధ, శ్రీరామ, శ్రీకృష్ణుల వలె" శ్రీమంతుల కుటుంబంలో పుట్టి, వ్యష్టి ఉద్యమాలను "సామాన్య ప్రతిష్టాపనలను" "సమిష్టిభావమునందు" ఇమిడ్చి ఒక మహోద్యమాన్ని స్థాపించారు.

"ప్రస్తుతము దేశము నావరించియున్న గాంధి యుద్యమమునం దివియన్నియు నిమిడిపోయి ప్రత్యేక ప్రాముఖ్యతను కోల్పోయినవి."

గాంధీజీని సర్వమతములకు అతీతుడైన యుగపురుషుణ్ణిగా చిత్రించారు కృష్ణారావుగారు. ఆయనను "లోకగురువు" అన్నారు. "మహాత్ముని అవతార రహస్యము"అన్న సంపాదకీయంలో "జాతిచేత వైశ్యుడైనను, వానియందు విరాట్పురుషుని సమగ్రత్వము అభి వ్యక్తమగుచున్నది" అన్న మాటలనే "బ్రాహ్మణుని జ్ఞానవైరాగ్య ములను, క్షత్రియుని క్షాత్ర తేజమును, వైశ్యుని ఆర్థిక నీతిని, శూద్రుని స్వకాయ కష్టమును గలిగి ఆదర్శపురుషుడై వెలయు

చున్నాడు" అన్న భావంతో వ్యాఖ్యానించి గాంధీజీ పూర్ణపురుషు డన్న భావాన్ని వెలిబుచ్చారు.

ఇలా ఎన్నో వ్యాసాలలో ముట్నూరివారు తమకు గాంధీ గారి యెడగల భక్తిని వెల్లడిచేసినా, కేవలము మాటలలో వెలిబుచ్చే భక్తి ప్రకటనను ఆయన ఎప్పుడూ ద్వేషిస్తూనే వచ్చారు.

"మహాత్ముని పటము నూరేగింపవచ్చును. సభలలో గంభీ రోపన్యాసముల గావింపవచ్చును. కాని ఆ మహనీయుని జాతీయ నిర్మాణ కార్యక్రమమునందు అనుష్టాన బలమును ప్రదర్శించినప్పుడే ఆ యుత్సవము సార్థకము కాగలదు" అన్న మాటలలో ఆయన కేవలం వ్యక్తి ఆరాధన కాక ఒక సూత్రాన్ని, సిద్ధాంతాన్ని మాత్రమే ఆరాధించే ఉత్తమ వ్యక్తిగా మనకు గోచరిస్తాడు.

## సిద్ధాంత గ్రంథాలు

గాంధీజీ జీవితాన్ని యింతవరకు ఒక ప్రత్యేకమైన, సమగ్ర మైన పరిధిలో మాత్రమే విలోకించినవారి రచనలను గ్రహించాము. కాని గాంధీజీ సిద్ధాంతాలకు, జీవిత విధానానికి వెనుక ఎంతో చరిత్ర వుంది. భారత స్వాతంత్ర్య సమరంలో గాంధీజీ పాత్రను విడిగా మనం విమర్శించడానికి వీలులేదు. అది ఒక జాతి చరిత్రలో తరతరాలుగా వస్తున్న సంప్రదాయానికి అనుగుణమైనదే. కొందరు రచయితలు విశాలమైన పరిధినుంచి గాంధీ జీవితాన్ని, ఆదర్శాలను పరామర్శిం చారు. అట్టి రచనలలో కొన్నింటిని యిక్కడ పేర్కొనడం అవసరం.

పట్టాభిగారు తమ కాంగ్రెసు చరిత్రలోను, తదితర గ్రంథాల లోను గాంధీజీ రాజకీయ జీవితాన్ని గురించి, ఆయన సిద్ధాంతాలను గురించి విపులంగా చర్చించారు. అంతేకాదు. అనేకమైన తెలుగు

గ్రంథాలకు పీఠికలు వెలయించి, అందులో గాంధీజీ ప్రభావం యొక్క వైశిష్ట్యాన్ని చాటి చెప్పారు. "కోమటి సూత్రకారునికి బ్రాహ్మణ భాష్యకారుడు" అని గాంధీజీ పట్టాభిగారిని గురించి ఒకసారి చలోక్తిగా అన్నారట. ఆయన గాంధీ సిద్ధాంతాలకు భాష్యకారుడన్నమాట ఎంత నిజమో కాంగ్రెసు చరిత్ర చదివినవారందరికీ తెలుసు. గాంధీకన్న ముందుగా ఆయనకు జాతీయ సభ వ్యవహారాలు తెలియడంవల్ల గాంధీజీ వచ్చిన తరువాత దాని ప్రణాళికలలో వచ్చిన మార్పులు ఏమిటో ఆయనకు తెలుసు.

పట్టాభిగారు ఆంగ్లంలో వ్రాసిన "*కాంగ్రెసు చరిత్ర*" వంటి దానిని, అంతకు ముందుగానే తెలుగులో వ్రాసిన ఖ్యాతి చెరుకువాడ నరసింహం పంతులుగారిది. ఆంధ్ర దేశంలో గాంధీ భావాలను మారుమూల గ్రామాలకు కూడా ప్రాకించిన వారిలో పంతులుగారు ముఖ్యులు. ఆయన అనర్గళమైన వాక్చాతురికి ఆనందించనివారు లేరు. చెరుకువాడవారు "*స్వారాజ్య దర్పణము*" అన్న గ్రంథాన్ని 1921 లో వ్రాశారు. కాంగ్రెసు పుట్టిన నాటినుంచి గాంధీ శకం ప్రారంభం అయ్యేవరకు గల జాతీయోద్యమ చరిత్రను యిందులో వ్రాశారాయన. చివరకు గాంధీజీ భారత రాజకీయ ప్రవేశంకూడా ఇందులో పేర్కొనబడ్డది. "భారతజాతి పేరిట గాంధిమహాత్ముడు నేడు ప్రపంచమున కొక నూతన సందేశము నొసగబోవుచున్నాడు" అంటూ తమ గ్రంథానికి ముగింపులో "లోకము లన్నియున్ గడియలోన జయించినవాడు" అన్న భాగవత పద్యాన్ని ఉటంకించారు.

"*నవ్యభారతోదయము*" అన్న తమ గ్రంథంలో కామరాజు హనుమంతరావుగారు ఆదికాలమునుండి నేటి వరకును గల హైందవ జీవిత విధానంలో వస్తున్న మార్పులను చర్చిస్తూ ఆ మార్పులకు గాంధీగారి ప్రభావం ఎంతవరకు కారణమో చర్చించారు. గాంధిగారు

అరవిందుడు చెప్పిన సిద్ధాంతాలకు కార్యరూపం యిచ్చిన మహాను భావుడని ప్రశంసిస్తాడు రచయిత. "పూర్వ పశ్చిమ దేశస్థులెల్లరు ఆతని ననుసరించుచు విశ్వమానవకోటి యంతయు నేకకుటుంబ మగుటకు పాటుపడుదురుగాక !" అని ఆశిస్తాడు.

"*సత్యాగ్రహ సమర చరిత్ర*" అన్నది కూడా ఈ కోవకు చెందినదే. రచయిత శ్రీ గుద్దేటి వీరసుబ్రహ్మణ్యం. ఈ గ్రంథంలో మొదటి అధ్యాయం "*ప్రథమ స్వాతంత్ర్య చరిత్ర*" (1857). రెండవది "*సత్యాగ్రహ సమర చరిత్ర*". ఇందులో గాంధి రాక వరకు చిత్రించబడినది. మూడవ అధ్యాయం "*ప్రథమ సత్యాగ్రహ సమరం*"- వేల్సురాజు ఆగమనంనుంచి లజపతిరాయి వీరమరణం వరకు. నాల్గవది "*ద్వితీయ సత్యాగ్రహ సమరం*" - దండియాత్ర నుంచి క్రిప్సు రాయబారం వరకు. చివరిది "*బ్రిటిష్ వారు వెళ్లిపొండి*" అన్నది. క్విట్ ఇండియా తీర్మానంనుంచి గాంధీ మరణం వరకు. దీనికి అనుబంధంగా రచయిత గూడూరు డివిజన్లోని సత్యాగ్రహుల సేవను సంక్షిప్తంగా పరిచయం చేశారు. దీనికి పీఠిక వ్రాస్తూ పట్టాభి గారు ఎన్నో విలువైన విషయాలు తెలియచేశారు. గాంధీజీ తన బహిష్కారత్రయంతో (విద్యాలయాల, కోర్టుల, శాసనసభల) స్వాతంత్ర్యాన్ని ఎలా తీసుకొని వచ్చారో చూపారు.

ఇట్టివే ఎన్నో యితర రచనలు వున్నాయి. గాంధీజీపైన, ఆయన జీవిత విశేషాలపైన వచ్చినన్ని గ్రంథాలు తెలుగులో మరి యే వ్యక్తి మీదా రాలేదు. మరి యే వ్యక్తి గాంధీజీ అంత ఉదాత్తుడు, నిష్కల్మషుడూ, త్యాగనిష్ఠ కలవాడూ కాడు. అందు వల్లనే నాయకులకే నాయకుడైనాడు గాంధీజీ.

## గాంధి - గాంధీ తత్త్వము

భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి ఆంగ్ల మూలానికి కొడాలి ఆంజనేయులుగారి అనువాదం "*గాంధీ - గాంధీ తత్త్వము*".

రెండు సంపుటాల్లో వెలువడ్డ యీ గ్రంథం తెలుగులో గాంధీజీ సిద్ధాంతాలపై వచ్చిన గ్రంథాలలో తలమానికమైనది. భాష్యకారుడుగా పట్టాభిగారికి ఒక ఉన్నతమైన స్థానం ఉంది. ఇక శ్రీ కొండాలివారు కవిగా, దేశభక్తుడుగా నలభై యేళ్లనుంచి తెలుగు ప్రజలకు తెలిసిన వారు. గాంధీసిద్ధాంతాలను ప్రచారం చేయడానికి దీక్ష బూనినవారు వీరిరువురి కలయికతో యీ "గాంధి - గాంధీ తత్త్వము" అన్న గ్రంథం ఒక ఉన్నత ప్రమాణాలు గల రచనగా తెలుగులో వెలువడింది.

ఇది రెండు సంపుటాల గ్రంథం. గాంధీజీ ప్రపంచించిన అన్ని సిద్ధాంతాలకు ఇందులో తగిన వివరణ ఉన్నది. మొదటి సంపుటంలో తొమ్మిది అధ్యాయాలు, రెండవ సంపుటంలో పదినుండి పందొమ్మిది అధ్యాయాలు ఉన్నాయి.

"గాంధి - ఆయన వ్యక్తిత్వము" అన్న మొదటి అధ్యాయం పీఠికామాత్రమైనది. ఇందులో గాంధీజీ భారతీయ రాజకీయ రంగంలో కేవలం కార్యశూరుడుగానే కాక, సిద్ధాంత ప్రవక్తగా ఎలా ప్రముఖుడో, ఆయన వ్యక్తిత్వం యితర నాయకుల వ్యక్తిత్వానికి ఎలా భిన్నమైనదో విపులంగా చూపబడ్డది.

రెండవ అధ్యాయంనుంచి గాంధీ సిద్ధాంతాలపై వివరణ ఉన్నది. పట్టాభిగారి వివరణలన్నీ సిద్ధాంత మూలసూత్రాలపై ఆధారపడి వుంటాయి. ఒక సిద్ధాంతాన్ని స్వీకరించి దానిని నిర్వచించి, దానిపై గాంధీజీ అభిప్రాయం చెప్పి, దాని బాగోగులను నిర్ణయించి, స్వాతంత్ర్య సమర సాధనలో దాని ప్రాముఖ్యం ఏమిటో వివరిస్తారు ఆయన. ఉదాహరణకు గాంధీగారి సత్యాగ్రహాన్ని గురించి చెబుతూ దానిని మూడు అధ్యాయాలుగా విభజించారు పట్టాభి. మొదటి అధ్యాయంలో సత్యాగ్రహం అంటే ఏమిటో, పురాణాల్లో

అది ఎలా ఉపయుక్తం చేయబడ్డదో, గాంధీజీ దాని నెలా నిర్వ చించారో పేర్కొన్నారు. రెండవదానిలో "సత్యాగ్రహ యుద్ధం" భారతీయ భావనకు, సంస్కృతికి ఎలా ప్రాతినిధ్యం వహిస్తుందో, యీనాటి భారత రాజకీయ రంగంలో దానికి గల స్థాన మేమిటో వివరిస్తారు. దానిపై వ్రాసిన మూడవ అధ్యాయం "సత్యాగ్రహము - దాని నైపుణ్యము" అన్న దానిలో సత్యాగ్రహసమర విజయానికి గల కారణాలను పేర్కొంటారు. ఇలా ప్రతి సమస్యను, సిద్ధాంతాన్ని స్వీకరించి దాని పూర్వాపరాలను విచారించి మన ముందు ఉంచుతారు పట్టాభి. అటు పాఠకుని ఊహకు గాని, యిటు అస్పష్టతకుగాని లోను గాకుండా తర్కబద్ధంగా వ్రాయబడిన యీ సిద్ధాంత గ్రంథా నికి తగినంత ప్రచారం వచ్చినట్లు తోచదు. దీనినిబట్టి భారతీయులు యీనాటికి కూడా తమ నాయకులను వీరపురుషులను వలె కొలుస్తారు కాని, వారు చెప్పిన సిద్ధాంతాలను ఆచరించరన్న సత్యం వెల్లడి అవుతున్నది.

ఈ గ్రంథానికి శ్రీ కొడాలి వారి అనువాదం సులభమైన శైలిలో, నలుగురికీ తేలికగా తెలిసే వ్యావహారిక భాషలో చేయ బడ్డది. కొడాలి వారిలోని కవితాతత్త్వం యిందుకు ఎంతో ఉపక రించి దీనిని అనువాద గ్రంథంగా కాక మౌలిక గ్రంథమన్న భావాన్ని కలగచేస్తున్నది.

### గాంధి తత్త్వోపదేశము

గాంధీజీ సిద్ధాంతాలను మొదటిసారి తెలుగువారికి అందించిన గ్రంథం మానికొండ సత్యనారాయణశాస్త్రిగారి "*గాంధి తత్త్వోప దేశము*" (1922). ఇది గాంధీజీ వివిధ విషయాలపై వ్రాసిన వ్రాతలకు అనువాదం. దానితో పాటు మానికొండ వారు ఆ సిద్ధాంతాల మంచి చెడ్డలను, ప్రజలందరూ వానిని ఆచరించవలసిన

ఆవశ్యకతను గురించి పేర్కొన్నారు. "దేశీయ మహాసభ (Congress)-తత్స్థాపకులు" అన్న విషయంతో ప్రారంభమై, బంగాళావిభజన, స్వరాజ్యమననేమి, ఇంగ్లండుస్థితి, హిందూదేశమేల పరుల పాలయ్యెను, భారతదేశమెట్లు ముక్తిని బడయగలదు-వంటి విషయాలను గురించి చర్చిస్తుంది యీ గ్రంథం. అంతేకాక భారతవర్షస్థితి - డాక్టర్లు, లాయర్లు మొదలైన వారి కర్తవ్యము, గాంధీజీ చెప్పిన సాత్త్వికనియమాలు, వాని ప్రాముఖ్యము-వీనిని గురించి కూడా పేర్కొన్నారు రచయిత.

గాంధీజీ రాజకీయ భావాలను గురించి శ్రీ పింగళి లక్ష్మీనారాయణ వ్రాసిన "స్వసామ్రాజ్య వైభవము" (1927) అన్న గ్రంథం గాంధేయ భావాలకు అనుగుణంగా వ్రాయబడ్డ మొదటి రాజకీయశాస్త్ర గ్రంథం. ఇందులో - భారతదేశం స్వపరిపాలనమును సంపాదిస్తే రాజకీయ రాజ్యాంగము ఎలా రూపొందింపబడాలన్న విషయం చర్చింపబడ్డది. స్వపరిపాలనము, ప్రతినిధి సంఘముల విధులు, సాయుజ్యుల ఎన్నిక మొదలైన విషయాలు ఉన్నాయి యిందులో. వీరు కొన్ని ఆంగ్ల పదాల కిచ్చిన అనువాదాలు ప్రశస్తంగా ఉండి అనుసరణయోగ్యమై ఉన్నాయి. ఉదాహరణకు - పింగళివారు Representatives కు 'సాయుజ్యులు' అని, ఎగువ సభకు 'ప్రాజ్ఞసభ' అని, Parliament కు 'మహామండల సభ' అని, Candidate కు 'నియోగ్యుడు' అని యిచ్చిన అనువాదాలు ఖావున్నాయి.

గాంధీజీ ఆర్థిక విధానాలను చర్చించిన ముఖ్యమైన గ్రంథాలలో "*గాంధీ ప్రణాళిక*" (1945) ఒకటి. ఇది శ్రీ శ్రీమన్నారాయణ్ అగర్‌వాల్ వ్రాసిన ఆంగ్ల గ్రంథానికి శ్రీ కొడాలి ఆంజనేయులు గారి అనువాదం. "గాంధీజీ జీవిత విధానంలో సంపూర్ణమైన సానుభూతిగల" శ్రీమన్నారాయణ్ వ్రాసిన గ్రంథం దీనికి మాతృక. గాంధీజీ ఆర్థిక సిద్ధాంతాలకు "ఆధునిక రాజకీయ పరిభాషలో

వ్యాఖ్యానం చేయడమే యీ చిన్ని పుస్తకం పరమోద్దేశం." గ్రామాలను, పంచాయతీలను, పరిశ్రమలను, వాని ఆర్థిక విధానాలను పరిశీలించాక ముగింపులో శ్రీమన్నారాయణ్ పేర్కొన్న మాటలు ఎంతో సత్యమైనవి :

"ఈ ప్రణాళికను ఆచరణలో పెట్టి పని చేయడానికి ఈ నూతన సిద్ధాంతంలో అకుంఠిత విశ్వాసంగల సుశిక్షితులైన సమర్థులగు యువకులు అనేకమంది కావాలి. సజీవమూ, ఉత్తేజకరమూ అయిన విశ్వాసం కొండలను కదిలించగలదు." - అది లేకపోవడం వల్లనే గాంధిగారి పేరును రాజకీయ కారణాలకు గాను స్మరణచేస్తూ, ఆయన చెప్పిన సిద్ధాంతాలను మాత్రం హాయిగా దేశం మరచి పోయింది.

హరిజన సమస్యను గురించి ఎన్నో సిద్ధాంత గ్రంథాలు వచ్చాయి - అందులో మౌలికమైనవీ, అనువాదాలు కూడా ఉన్నాయి. మౌలికమైన రచనల్లో - పద్యాలలో వచ్చిన "*నిరుద్ధ భారతము*" విషయం పూర్వమే ప్రస్తావించబడ్డది. "*హరిజనులు అస్పృశ్యులు గారు*" అన్న కామఋషి మృత్యుంజయవర్మగారి గ్రంథం (1933) "శృతి స్మృతి పురాణముల ననుసరించి వ్రాసిన నిశ్చయాభిప్రాయము." దీనికి ముందు "మహాత్ముడు - హరిజన సమస్య" అని కలగ సత్యనారాయణగారి పీఠిక ఉన్నది. ఇటీవల వచ్చిన అనువాదాలలో గాంధిగారి గ్రంథాలకు ఆర్.సూర్యనారాయణ మూర్తిగారి "*అస్పృశ్యతానివారణము - కార్యకర్తలకు*", "*హరిజన సమస్య*" అన్న నండూరి వెంకటకృష్ణమాచార్యులుగారి అనువాదం పేర్కొనదగినవి

అలానే ఇటీవల గాంధేయ సాహిత్య అనువాదాలలో గాంధీజీ సిద్ధాంతాల కన్నిటికి అనువాదాలు వచ్చాయి. వస్తున్నాయి. ఇవి

దాదాపు రెండు వందల గ్రంథాలకు మించి ఉండడంవల్ల, అన్నీ ఆంగ్లంలో నుంచో, హిందీలోనుంచో అనువాదాలు కావడంవల్ల వానిని గురించి వివరంగా చెప్పడానికి యిది తగిన సమయం కాదు. కాని సంక్షిప్తంగా చెప్పాలంటే యీ క్రిందివారి అనువాదాలను పేర్కొనవచ్చు: "*మానవులందరు సోదరులు*" అన్న పింగళి లక్ష్మి కాంతంగారి అనువాదం, "*నా స్వప్నసీమ భారతభూమి*", "*నా అహింసా ధర్మం*" అన్న మల్లవరపు విశ్వేశ్వరరావుగారి అనువాదాలు, "*మన గ్రామపునర్నిర్మాణము*", "*జాతీయభాషను గూర్చిన భావాలు*" అన్న కొడాలి ఆంజనేయులుగారి అనువాదం, "*శాంతి సమరములో అహింసా సిద్ధాంతము*", "*నవీన విద్యాపథములో*" అన్న తల్లాప్రగడ ప్రకాశరాయుడిగారి అనువాదం, ప్రభాకర్ జీగారి "*సర్వోదయము*" పేర్కొనదగినవి.

## గాంధీజీ ఉపన్యాసాలు

గాంధీజీ యిచ్చినన్ని ఉపన్యాసాలు ప్రపంచనాయకులలో ఏ కొద్దిమందో గాని యిచ్చి వుండరు. ఆయన ఉపన్యాసాల నన్నింటిని గురించి ప్రస్తావించడం మరొక ఉద్గ్రంథంలో చేయవలసిన పని. అప్పు డప్పుడు గాంధీజీ చెప్పిన ఉపన్యాసాలు - పుస్తకరూపంలో వచ్చినవి మాత్రమే - యిక్కడ స్థాలీపులాక న్యాయంగా చర్చించబడతాయి.

1921 నుంచి కూడా గాంధీజీ యిచ్చిన ఉపన్యాసాలను, ఉప దేశాలను గీతోపదేశమంత భక్తితో ప్రజలు స్వీకరించారు. "*గాంధి మహాత్ముని ఉపదేశములు, జీవిత సంగ్రహము*" (1921) అన్న తల్లా ప్రగడ రామారావుగారి పుస్తకం యీ రకం రచనలలో ప్రథమంగా వెలువడ్డది. ఇందులో మహాత్ముని ఆంధ్రదేశ పర్యటన, యిచ్చిన ఉప న్యాసాలు కూడా పొందుపరచబడ్డాయి.

"*నాగపురం కాంగ్రెసు - కొన్ని ముఖ్యాంశములు*" (1921) అన్న పట్టాభిగారి చిన్న గ్రంథంలో నాగపురం కాంగ్రెసు విశేషాలతో

పాటు గాంధీగారిచ్చిన ఉపన్యాసం కూడా చేర్చబడ్డది. అలాగే "*38 వ దేశీయ మహాసభ, కాకినాడ*" అన్నదానిలో కొండా వేంకటప్పయ్యగారి ఉపన్యాసంతోపాటు గాంధీజీ, మహమ్మదాలీల ఉపన్యాసాలున్నాయి. ఇలా ప్రతి కాంగ్రెసుసమావేశంతరువాత గాంధీజీ యిచ్చిన ఉపన్యాసాలు పుస్తకరూపంలో వచ్చాయి.

"*దండి యాత్రా ప్రవచనములు*" (1931) అన్న దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారి అనువాదం యీ కోవకు చెందిన గ్రంథాలలో ఉత్తమమైనది. దండి సత్యాగ్రహానికి పోతూ గాంధీజీ "మార్గ మధ్యమున ప్రజల కుపదేశించిన పవిత్ర ధర్మములు '*నవజీవన*' పత్రిక యందు ప్రచురించబడెను. ఈ యుపన్యాసములందు ఆంగ్ల ప్రభుత్వ నీతి, సత్యాగ్రహ ధర్మ స్వరూపము వ్యక్తీకరింపబడినవి."

ఈ గ్రంథాన్ని ప్రచురించిన మానవాదర్శ గ్రంథమండలి, అంగలూరు వారే *గాంధిగారి దండియాత్ర*, *మహాత్ముని అమృత వాణి*, *గాంధిగారి యరవాడ జైలు ప్రవచనాలు* - అన్న గ్రంథాలు వెలువరించారు. చివరి గ్రంథంలో మహాత్ముడు యరవాడ జైలు నుండి "ప్రతి వారము సబర్మతీ ఆశ్రమవాసులు పాలించవలసిన అహింస, సత్యము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము - మున్నగు నియమములను గురించియు, నిబంధనలను గురించియు వ్రాసిన లేఖలు గలవు." ఇటీవల వచ్చిన గ్రంథాలలో "*బాపూజీ ఉపన్యాసములు*" అన్న కందిరాజు వేంకట కిషన్‌రావుగారి అనువాదం పేర్కొనదగినది.

గాంధి సూత్రములు

గాంధీజీ సిద్ధాంతాలను సూత్రప్రాయాలుగా కుదించి నిత్యమూ పారాయణ గ్రంథంగా ఉపయోగించుకోవడానికి వీలుగా వ్రాయబడ్డ గ్రంథాలలో ఒకటి "*గాంధి సూత్రములు*" (1963). ప్రొఫెసర్ డి. యస్. శర్మ (దిట్టకవి సుబ్రహ్మణ్యశర్మ) గారి ఆంగ్ల

గ్రంథానికి కామరాజు హనుమంతరావుగారి అనువాదం యిది. ఈ గ్రంథంలో మూడు అధ్యాయాలన్నాయి - 'ఉపోద్ఘాతము, గాంధి సూత్రములు, గాంధి సూక్తులు - జిజ్ఞాస' అన్నవి.

మూడవ అధ్యాయంలో అహింస, సత్యము, బ్రహ్మచర్యము మొదలైన విషయాలపై సూక్తులు ఉన్నాయి. ఇందులోని 108 సూత్రాలు - మూడు భాషల్లో యివ్వబడ్డాయి. సంస్కృతం, ఇంగ్లీషు, తెలుగులలో యివ్వబడిన యీ సూత్రాలకు ఒక ఉదాహరణ:

రెండవ ప్రకరణం *"సత్యాగ్రహ ధర్మము"* అన్న దానిలోని 53 వ సూత్రం :

సంస్కృతం : సత్యాగ్రహ ఇతి ధర్మస్తైవ సనాతన స్వన వోల్లేఖః

ఆంగ్లం : Satyagraha is a new manifestation of Sanatana Dharma.

తెలుగు : సత్యాగ్రహము సనాతన ధర్మము యొక్క నవీనరూపము.

*"గాంధి మహాత్ముని నీతిమంజరి"* (1926) అన్న గ్రంథంలో అకారాదిగా గాంధిగారి ప్రవచనాలు యివ్వబడ్డాయి. ముదిగంటి జగ్గన్నశాస్త్రి, శనివారపు సుబ్బారావు గార్ల సంపాదకత్వాన వెలువడిన యీ గ్రంథంలో Young India, Navajivan పత్రికలలో గాంధిగారు వ్రాసిన ప్రవచనాలు సేకరించి ప్రకటించబడ్డాయి. ఇట్టివే - మానవాదర్శ గ్రంథమండలి వారి *"మహాత్ముని అమృతవాణి"*, పింగళి లక్ష్మీకాంతంగారు సంకలనం చేసిన *"మహాత్ముని ఉపదేశము"* అన్న గ్రంథాలు.

ఈ ప్రకరణంలో చేర్చబడని అనేకములైన గ్రంథాలుఉన్నాయి. అందులో ఎక్కువ భాగం అనువాద గ్రంథాలు కావడం-దీనికి మొదటి కారణం; రెండవది 1920-25 ప్రాంతాల వెలువడినగ్రంథాలు ఎక్కడా దొరకకపోవడం. వానిలో ఉత్తమమైన వానిని గాంధి స్మారకనిధి, హైదరాబాదు వారు ప్రచురిస్తే దేశానికి ఎంతో మేలు చేసినట్లు

# 10

# సింహావలోకనం

ఈ ముగింపు అధ్యాయంలో గాంధీజీ నాయకత్వాన ఒక మహోద్యమం దేశంలో బయలుదేరడం వలన సాహిత్యంలో - ముఖ్యంగా తెలుగు సాహిత్యంలో - ఆ మహోద్యమం, ఆ మహోద్యమ నాయకుడు ఎట్టి మార్పులకు కారణం అయ్యారు - అన్న విషయం స్థూలంగా చర్చింపబడుతుంది. ఇంతవరకు చేయబడినదంతా సమీక్ష. ఈ సమీక్షను ఆధారంగా చేసుకొని గాంధేయ సాహిత్యమంతటినీ అవలోకిస్తే మనకు కనిపించే కొన్ని ప్రాథమిక సత్యాలను ఇక్కడ పేర్కొంటాను.

గాంధేయ సాహిత్యంవల్ల తెలుగు సాహిత్యంలో ఏమైనా మార్పులు వచ్చాయా ? వస్తే అవి పరోక్షంగా వచ్చినవా, లేదా ప్రత్యక్షాలేనా ? ఆ మార్పులవల్ల సాహిత్యానికి ఎంత వరకు మేలు చేకూ ంది ?—

ఈ ప్రశ్నలకు సమాధానాలుగానే ఈ అధ్యాయం ఉద్దేశించబడ్డది.

భారతదేశంలో ప్రారంభమైన జాతీయోద్యమాన్ని గురించి,

అది సాహిత్యాన్ని ప్రభావితం చేయడాన్ని గురించి 1923 లో "*ఆంధ్రపత్రిక*" సంవత్సరాది సంచిక ఇలా వ్రాసింది :

"భారత హృదయ ప్రబోధమునకు లక్షణమైన వాఙ్మయ నిర్మాణమునందు నాంధ్రహృదయము ధర్మారాధనము జేయుచున్న విధము నాంధ్రవాఙ్మయ పరిశోధనము విశదము చేయుచున్నది......... ప్రజా సంకల్పములను, ప్రజాశయములను విశదము చేసి ప్రజలను కార్యపరతంత్రులనుగ జేయుటకు వాఙ్మయము పరమ సాధనముగనున్నది."[1]

వాఙ్మయం ద్వారా ఒక వంక మాతృదేశాభిమానము, వేరొక వంక మాతృభాషాభిమానము సమంగా వ్యక్తం అవుతాయని కూడా సంపాదకులు ఈ "ప్రస్తావన"లో పేర్కొన్నారు.

"ఆంధ్ర భాషయందు ప్రకటితములైన కావ్యములు, నాటకములు, ప్రబంధములు, పాటలు, పద్యములు ప్రజాహృదయమును దెలుపుచున్నవి. స్వరాజ్య నాటకములు, గాంధి సంకీర్తనములు, స్వరాజ్య గేయములు, భజన గానములు ప్రజాహృదయము నావరించిన స్వాతంత్ర్య ప్రియత్వమును వెల్లడి చేయుచున్నవి."[2]

ఈ విధంగా జాతీయ జీవన విధానానికి, సాహిత్య సృష్టికి గల అవినాభావ సంబంధం ఏనాడో సుస్పష్టం చేయబడ్డది. కాని గాంధేయ సాహిత్యం కేవలం ఒక ఉద్యమాన్ని ప్రతిబింబించడం కన్న ఎంతో ముందుకు పోయింది. ఏక వ్యక్తి నిష్ఠం కావడమే ఈ సాహిత్యం ప్రత్యేకత. ఇట్టి సాహిత్యం నిజానికి పూర్వకాలాల్లో రాజులను గురించి కూడా రాలేదు. కవులు తమ రాజులకు తమ కృతులను అంకితం చేసి, షష్ఠ్యంతాల్లో వారి చరిత్రను ఉటంకించారు ఒక్కొక్కప్పుడు వారినే నాయకులను చేసి గ్రంథాలు రచించారు. కాని కొన్ని వందల

మంది రచయితలు ఒకే ఒక్క వ్యక్తిని గురించి ఇన్ని వందల గ్రంథాలు వ్రాయడం భారతదేశ చరిత్రలో మనకు కన్పించదు. అలా రావడానికి కారణం ఒక్కటే. రవి అస్తమించని ఆంగ్లేయుల పాలనకు ప్రజలు విసుగెత్తి, భయపడి, నిరావహులై ఉన్న సమయంలో గాంధీజీ తన వ్యక్తిగతమైన ఆకర్షణతోను, తరతరాల భారతీయతకు ప్రతిబింబాలనదగిన అహింస, సత్యము- వంటి సిద్ధాంతాలతో రాజకీయ రంగం మీదకు ప్రవేశించాడు. అందువల్లనే ఆయన రాక మరో "అవతార ఆగమనం" అనిపించింది ప్రజలకు. ఎప్పుడైతే గాంధీజీ భగవదవతారంగా భావింపబడ్డాడో, అప్పుడే ఆయన మీద— భగవంతునిమీద ఎలా వచ్చాయో అలానే— కీర్తనలు, గేయాలు, మంగళహారతులు- వెలువడ్డాయి. అందువల్లనే గాంధీ సాహిత్యంలో ఎక్కువ భాగం భక్తి తత్పరతను చాటే రచనలే!

అయితే గాంధీజీ కృతయుగంలోను, త్రేతాయుగంలోను పుట్టినవాడు కాదు. ఆధునిక యుగంలో జన్మించినవాడు. అందువల్ల రచయితలకు అందుబాటులో వున్న ప్రతి సాహిత్య ప్రక్రియలోను ఆయన కీర్తింపబడ్డాడు. కావ్యాలు - అందులో తిరిగి శతకాలు, ఖండ కావ్యాలు, నవలలు, నాటకాలు,— ఇన్ని రకాల ప్రక్రియలు పూర్వపు దేవుళ్లెవరిమీదా కూడా వ్రాయబడలేదేమో!

గాంధీజీపై వచ్చిన అసంఖ్యాకములైన రచనలకు ఆయన భగవంతుని అవతారమేనని చాలమంది ప్రజలు, రచయితలు భావించడమే కారణం అయినా, దానివలన సాహిత్యానికి కొంతమేలు చేకూరిందనవచ్చు. ఈ మేలు కేవలం రచనల సంఖ్యా దృష్ట్యానేకాక, భాషలోను, శైలిలోను, కొత్త సాహిత్య ప్రక్రియలకు ఈ సాహిత్యం వల్ల వచ్చిన ప్రచారం— వీని దృష్ట్యా కూడా పేర్కొనదగినదే!

ఈ ఉద్యమం వలన తెలుగు సాహిత్యంలో వచ్చిన మొదటి

మార్పు పత్రికల ప్రాముఖ్యం. గాంధీజీ నాయకత్వం చేపట్టిన తర్వాత ఈ ప్రాముఖ్యం ఇతోధికమై కన్పట్టుతుంది. "అమృత బజారు పత్రిక", ప్రకాశంగారి "స్వరాజ్య", సి. వై. చింతామణిగారి "లీడర్" భారతదేశంలో ఎట్టి ప్రాముఖ్యతకు వచ్చాయో, అలానే ఆంధ్రదేశంలో కాశీనాధునివారి "ఆంధ్రపత్రిక", ముట్నూరివారి "కృష్ణాపత్రిక" కూడా ప్రాముఖ్యానికి వచ్చి పండిత పామరులకు కూడా గాంధీజీని గురించి, ఆయన ఉద్యమాన్ని గురించి తెలియ చెప్పాయి.[3]

గాంధీజీ నాయకత్వం వలన ప్రత్యక్షంగా వచ్చిన ప్రభావం తెలుగు సాహిత్యంలో మొదటిసారి "రాజకీయ సాహిత్యం" ప్రారంభం కావడం. అంతవరకు కాల్పనిక, చారిత్రక, సాంఘిక, పౌరాణిక సాహిత్యమేకాని రాజకీయ సాహిత్యం లేదు మనకు. జరిగిన సంఘటనలను జరిగినట్లుగా సాహిత్యంలో ప్రవేశపెట్టడం, ఆ సంఘటనలలో జరిగిన వ్యక్తులను కూడా యథాతథంగా చూపడం ఈ రాజకీయ సాహిత్యానికి లక్షణాలు.

ఇట్టి సాహిత్యంలో చెప్పుకోతగినవి "రాజకీయ నాటకాలు". అంతవరకు సాహిత్యంలో చారిత్రక నాటకాలే[4] కాని, రాజకీయ నాటకాలు లేవు. మొదటి రాజకీయ నాటకం "గాంధి మహోదయము"[5]. గాంధీజీ రాజకీయ రంగం మీదకు రాగానే వ్రాయబడ్డది. ఆనాటి నుంచి దాదాపు రెండు డజన్ల నాటకాలు వ్రాయబడి, ప్రదర్శించబడి తెలుగు దేశంలో ఎంతో ప్రచారంలోకి వచ్చాయి.

ఈ సాహిత్యం వలన వచ్చిన మరొక ముఖ్యమైన మార్పు "రాజకీయ రచయితలు" తయారు కావడం. 1920 కి ముందు కూడా రాజకీయాలను స్పృశించిన రచయితలు, పత్రికా సంపాదకులు ఉన్నారు. కాని కేవలం రాజకీయాలను గురించి ఆత్మాశ్రయ పద్ధ

తిలో కాక, వానిని విశ్లేషించి, భాగోగులను చర్చించే రచయితలు కొందరు వెలికివచ్చారు. పట్టాభిగారు గాంధీజీ రాకకు పూర్వమే రాజకీయాలను గురించి "*ఆంధ్రభారతి*", "*ఆంధ్రపత్రిక*"లలో అప్పుడప్పుడు వ్రాస్తూనే వచ్చారు. కాని 1918-19 ల తరువాత ఆయన వ్రాసిన వ్యాసాలు క్రమం తప్పకుండా వస్తూ వుండేవి. గాంధీగారిని గురించి "*ఆంధ్రభారతి*"లోని తన వ్యాసం ద్వారా మొదటిసారి పరిచయం చేసింది ఆయనే! పట్టాభిగారు కాక, కాశీనాధుని, ముట్నూరి, చెరుకువాడ నరసింహంగార్లు ఈ కోవకు చెందిన రచయితలు.

ఒక వంక గాంధేయులై, ఆయన సిద్ధాంతాలను అనుసరిస్తూనే ఆయన సిదాంతాలను గురించి, ఆయన కార్యక్రమాలను గురించి తెలుగువారికి ఎప్పటికప్పుడు తెలియచెప్పిన రచయితలు ఇంకా ఎందరో ఉన్నారు. అట్టివారిలో శ్రీ మానికొండ సత్యనారాయణ శాస్త్రి, శ్రీ కొడాలి ఆంజనేయులు, శ్రీ కొమాండూరు శఠకోపాచార్యులు, శ్రీ ముదిగంటి జగ్గన్నశాస్త్రి గార్లవంటి రచయితలు గాంధేయులు; గాంధేయ సాహిత్యాన్ని తెలుగువారికి అందించడంలో కృషిచేసినవారు.

కొందరు అనువాదకులు తెలుగులోకి గాంధేయ సాహిత్యాన్ని అనువదించడం ద్వారా తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు. మరి కొందరు గాంధేయులు ఆయనను గురించి, ఆయన సిద్ధాంతాలను గురించి కావ్యాలు, ఖండకావ్యాలు, గేయాలు, పాటలు ఎన్నో వ్రాశారు. నవలలు, నాటకాలు వచ్చాయి. గాంధీని గురించి వ్రాయడం ద్వారా గాంధేయులైన రచయితలు కూడా మన దేశంలో ఉన్నారు. శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి, శ్రీ వేలూరి శివరామశాస్త్రి ప్రభృతులు తమ రచనలద్వారా గాంధేయులైనవారు.

గేయ రచయితలలో మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి, బసవరాజు అప్పారావుగార్లు, నాటకరచయితల్లో దామరాజు కూడా ఇట్టి గాంధేయులే!

మూడు నాలుగు దశాబ్దాల కాలంలో తెలుగులో కలం పట్టడం నేర్చిన ప్రతివాడూ గాంధీజీని గురించి, ఆయన సిద్ధాంతాలను గురించి తాను ప్రభావితుడై, ఆ ప్రభావాన్ని సాహిత్య రూపంలో వెలువరించాడు. అందువల్ల గాంధేయ సిద్ధాంతాలు, ఆయన జీవితం రచయితల రచనలకు మూలకంధమై నిలిచిందనడంలో అతిశయోక్తి లేదు.

ఇక భాష, శైలి-లలో ఈ ఉద్యమం ఎంతో ప్రభావాన్ని పరోక్షంగా వెలువరించింది. ఏ రాజకీయ సాహిత్యానికైనా ప్రథమ లక్షణం అది మామూలు ప్రజలకు అందుబాటులో ఉండడం. అలా ఉండాలంటే అంతగా విద్యావంతులు కాని ప్రజలకు కూడా తెలిసే విధంగా తేలికగా, వారిభాషలో సాహిత్యం వ్రాయబడాలి తెలుగులో వచ్చిన గాంధేయ సాహిత్యాన్ని పరిశీలిస్తే, కేవలం ఆయన జీవితాన్ని గురించి, ఆయన సిద్ధాంతాలను గురించి వ్రాయబడడమేకాక, ఆ వ్రాయబడిన రచనలన్నీ లలితమైన శైలిలో వ్రాయబడ్డాయి. "*కొల్లాయి గట్టితేనేమి*" వంటి పాటలు ప్రజలకు అతి సన్నిహితం అయ్యాయంటే ఆశ్చర్యం ఏముంది?

అలాగే కీర్తనలలోను, పాటలలోను, గద్యరచనలలోను వ్యావహారికమో, వ్యావహారికానికి అతి దగ్గరలో ఉండే శిష్టవ్యావహారికమో వాడబడ్డది. దీనికితోడు పత్రికల ప్రభావం కూడా కొంత ఉండడంతో భాషలో వచ్చిన మార్పు ఇంకా త్వరగా రావడానికి వీలు చిక్కింది. మొత్తంమీద గ్రాంథిక భాషనుంచి వ్యావహారిక భాషకు మారడానికి ముఖ్యంగా దోహదం చేసింది గాంధేయ సాహిత్యమేనని చెప్పాలి.

ఈ విధంగా అటు భావంలోను, ఇటు భాషలోను ఎంతో మార్పును ప్రత్యక్షంగాను, పరోక్షంగాను తీసుకొని రావడమే ఏ ఉద్యమమైనా, ఏ ఉద్యమ నాయకుడైనా ప్రజలకు సన్నిహితుడైనాడో, లేదో చూపడానికి పడికట్టు. ఈ పడికట్టును ఉపయోగించి చూస్తే గాంధీజీ వలన గాంధేయ సాహిత్యం ఎలా ప్రభవించిందో, అలానే గాంధేయ సాహిత్యం వలన ఆయన ప్రజలకు ఎంత సన్నిహితుడైనాడో కూడా మనకు స్పష్టం అవుతుంది. అట్టి వ్యక్తి భగవంతునిగా ఆరాధింపబడ్డాడంటే ఆశ్చర్యంలేదు. ఆ రోజుల్లోని ప్రజలు ఆయనను అలా ఆరాధించారని చెప్పడానికి గాంధేయ సాహిత్యం ప్రబలమైన సాక్ష్యం.

ఈ విధంగా మూడు దశాబ్దాల మధ్య కాలంలో వచ్చిన రచయితలకు గాంధీకథ భావాలను, ఇతివృత్తాలను అందించింది. ఆయన కార్యకలాపాలు వారి రచనలకు ఆలంబనం అయ్యాయి. ఆయనను గురించి, ఆయన సిద్ధాంతాలను గురించి ప్రజలకు తెలియచెప్పాలన్న ఉత్సాహంతో రచయితలు ప్రజలకు అందుబాటులో ఉన్న భాష, శైలిలను అనుసరించారు.రాజకీయ రంగంలో ఆయన భావాలకు అనువర్తులై ప్రజలు ఎలా సంచరించారో, సాహిత్యరంగంలో ఆయనను గురించి తమ తమ ప్రజలకు తెలియచెప్పడానికి రచయితలు కూడా అందుకు అనువైన పద్ధతులను ఎన్నుకొన్నారు.

తెలుగులో వెలువడిన ఇంత విస్తృతమైన గాంధేయ సాహిత్యం దాని ఫలితమే ! ఒక జాతిని రాజకీయంగానే కాక, సాహిత్య పరంగా కూడా ఇంతగా కదిలించిన వ్యక్తి "మహాత్ముడు" కావడం ఎంత సమంజసం !

## జ్ఞాపికలు

### 1. సాహిత్యం - జాతీయత

[1] "A body of England's, breathing English air" - Ruper Brooke, 'The Soldier."

[2] రాధా కుముద్ ముఖర్జీ : "Nationalism in Ancient India" పుటలు 14, 27-28, 42.

[3] శ్రీ అరవిందులు "On Nationalism", 69 వ పుట

[4] ఈ విషయాన్ని గురించిన వివరాలకు క్రింది వ్యాసాలను చూడవచ్చు : 1. వాఙ్మయముపై జాతీయోద్యమ ప్రభావము—"నవనీతము", పుటలు 35-48 - రచన : శ్రీ దేవులపల్లి రామానుజరావు 2. ప్రచార సాహిత్యం- "ప్రభాస" - రచన డాక్టర్ కేతవరపు రామకోటిశాస్త్రి.

[5] "ప్రస్తావన" - ఆంధ్ర పత్రిక . ఉగాది సంచిక (1928)

[6] శ్రీ విశ్వనాథ సత్యనారాయణ - "వేయిపడగలు", పదునొకండవ అధ్యాయం.

[7] భగవద్గీత, అధ్యాయం 3. శ్లోకం 35.

### 2. కావ్య సాహిత్యం

[1] అభినవ తిక్కన సన్మాన సంచిక, పుట 6.

[2] "సరసులెల్ల మెచ్చ మెఱయింతు కవితలో
గమ్మదనము మత్కులమ్మునవలె" - బాపూజీ ఆత్మకథ, కృత్యాది.

[3] "బాపూజీ ఆత్మకథ" మనవి, పుట 1.

[4, 5, 6] "బాపూజీ ఆత్మకథ", కృత్యాది, పుట 7.

[7] శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి : "బాపూజీ ఆత్మకథ", తిలక రచన,

[8] " .... .. . .. . మా తిక్కయజ్వలు
త్రొక్కిన త్రోవకేను సమ్మతి పడెదన్"-"బాపూజీ ఆత్మకథ",కృత్యాది.

9 "బాపూజీ ఆత్మకథ", కృత్యాది.

10 Birth and Parentage · "My Experiments with Truth".

11 "బాపూజీ ఆత్మకథ", తొలిపాలు : అభిప్రాయము.

12 "మహాత్మకథ" - తెలివిడి.

13, 14, 15 "మహాత్మకథ" - కృత్యాది.

16, 17, 18 "మహాత్మకథ" - కృత్యాది.

19 "మహాత్మకథ" - కృత్యాది. చివరి పద్యము.

20 "రాగలదోయి ! ధర్మ సమరం; బిది
భారతజాతి ముక్తికై
సాగినదోయి .... ... ....
సంగరము సేయుడు త్రోయుడు
మాతృ దుఃఖముల్" - "మహాత్మకథ", పుట ౨౭.

21 శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు - "పఱిగపంట" కావ్యసంపుటికి పీఠిక.

22 "అహింసాజ్యోతి" (జనవరి 26, 1951) "బాపూజీ ఆత్మకథ" లో ముద్రితమైన ఖండిక.

23 "మహాత్మకథ", ముగింపు పద్యము.

24 "శ్రీ గాంధీ భారతము", నిర్యాణ పర్వము, కథా ప్రారంభము.

25 "ఛౌదరీ సోదరముఖ నిర్గతంబైన
నీ ఆజ్ఞను శిరమున దాల్చి దేశమాతృ
ప్రార్థనంబుతో సభ ప్రారంభించుచున్నాను" అంటాడు అభినవసూతుడు.

26 "శ్రీ గాంధీ భారతము", ప్రస్తావన.

27 శ్రీ పింగళి లక్ష్మికాంతము : "శ్రీ గాంధీభారతము"- అభిప్రాయము

28 "శ్రీ గాంధీ మాహాత్మ్యము", ప్రథమ పంచకము, పీఠిక.

29, 30 "శ్రీ గాంధీ మాహాత్మ్యము", ప్రస్తావన

31 "శ్రీ గాంధీ మాహాత్మ్యము", పీఠిక.

32 కృష్ణా పత్రిక : 27-3-1937 నాటి సంచిక.

33 "సౌందరనందము", ధర్మసంవాదము.

34 డా॥ సి. నారాయణరెడ్డి · "ఆధునికాంధ్ర కవిత్వము", పుట 451.

35 "సౌందరనందము", ఉపదేశము.

36 పింగళి, కాటూరులకు కావలిలో జరిగిన సన్మానంలో (1-1-55) తుమ్మలవారు చెప్పిన "అభినందనము", "పఱిగపంట" ఉపద, పుట 74

37 శ్రీ విశ్వనాథ సత్యనారాయణ : "రాణాప్రతాపసింహ చరిత్రము", భారతి, 1943.

38 శ్రీ మంగిపూడి వేంకటశర్మ : "రాణాప్రతాపసింహ చరిత్రము", అభిప్రాయము, పుట 20

39 చిరంతనానందస్వామి · "రాణాప్రతాపసింహ చరిత్రము" పుట 27.

40 "రాణాప్రతాపసింహ చరిత్రము", పుట 6.

41 "రాణాప్రతాపసింహ చరిత్రము", పుట 432.

42 "రాణాప్రతాపసింహ చరిత్రము", పుట 434.

43 "అమరసింహ చరిత్ర", ప్రబంధము, పద్యము 81. ఇదే అభిప్రాయాన్ని వెనకనే పేర్కొన్నట్లు చాలామంది ఆంగ్లకవులు కూడా వెలువరించారు.

44 శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, విపుల సమీక్ష, పుట 1.

45 భారతి, నవంబరు 1943.

46 "శ్రీ శివభారతము", ప్రస్తావన, పుట XXXV.

47 "శ్రీ శివభారతము", పుటలు XI, XII.

48 "శ్రీ శివభారతము", అభిప్రాయములు, డా॥ చిలుకూరి నారాయణ రావు, పుట X.

49 "శ్రీ శివభారతము", అభిప్రాయములు, డా॥ చిలుకూరి నారాయణ రావు, పుట X.

50 "శ్రీ శివభారతము", పుట 393.

51 "శ్రీ శివభారతము", పుట 488.

52 "శాంతివిజయము", విన్నపము, పుట 2.

53 "భారత స్వాతంత్ర్య సంగ్రామము", ప్రథమ రంగము, పుట 12.

54 "భారత స్వాతంత్ర్య సంగ్రామము", పంచమరంగము. పుట 80.

55 "భారత స్వాతంత్ర్య సంగ్రామము", పుట 30.

56 "భారత స్వాతంత్ర్య సంగ్రామము", పుట 30.

57 "కళాక్షేత్రము", భూమిక, పుట 1.

58 "దేవుని యవతారంబది గావచ్చును
మనుజ జన్మ గాంచి బహుజన
ప్రావిర్భూత మహోన్నతి దేవత్వము
నెనయవచ్చు దెలియ నరిదియా"

—అవతార ఖండము, పుట 17.

## 4. ఖండకావ్యాలు - ఖండికలు

1 విజ్ఞాన సర్వస్వము, "సంపత్" వ్యాసము, పుట 780.

2 డా॥ సి నారాయణరెడ్డి : "ఆధునికాంధ్ర సాహిత్యము", పుట 378

3 "మనోరమ" పత్రిక, 1906, అక్టోబరు సంచిక 10.

4 ఇవి అన్నీ - తర్వాత శ్రీ శర్మగారు వ్రాసిన "నిరుద్ధ భారతం" లో చేర్చబడ్డాయి.

5 దీని రెండో కూర్పే 1905 లో వెలువడింది.

6 "భారత ధర్మ దర్శనము", ఆంధ్రులకొక విజ్ఞాపనము (1-10-1907)

7 ఆంధ్రపత్రిక – ఉగాది సంచిక 1911

8 ఆంధ్రపత్రిక – ఉగాది సంచిక 1914

9 శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతకవి : "స్వరాజ్య రథము"

10 శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతకవి : "స్వరాజ్య సమస్య"

11 "ఆంధ్రరత్న" అన్న శీర్షిక క్రింద శ్రీ అడవి బాపిరాజు

"గంగా ధారే కంఠశ్రుతులు
నింగీ నేలా కురిసే అమృతం
నీ విచ్చిన మా చైతన్యానికి
నీకే హంగూ మాకే పొంగూ"

"మా గోపాలకృష్ణుడు" అన్న శీర్షిక క్రింద శ్రీ బసవరాజు అప్పారావు

"భాగ్యవశమ్మున భావికాలాన
అమృతతుల్యమ్ములు నతి భావ భరిత
ములు నయిన నా గీతముల వినినంత
గోపాలకృష్ణుని గొప్ప దీపించు" - అన్నారు.

12 " 'ఆంధ్రరత్న' గోపాలకృష్ణుని చాటువులు", పుట 2.

13 కవికోకిల గ్రంథావళి, రెండవభాగము, పుట 359.

14 కవికోకిల గ్రంథావళి, రెండవ భాగము, పుట 359.

15 కవికోకిల గ్రంథావళి, రెండవ భాగము, పుట 38.

16 కవికోకిల గ్రంథావళి, రెండవ భాగము, పుట 253.

17 కవికోకిల గ్రంథావళి, రెండవ భాగము, పుట 253.

18 రామిరెడ్డిగారి గేయాలను గూర్చిన ప్రస్తావన వచ్చే అధ్యాయంలో చేయబడుతుంది.

19 కవికోకిల గ్రంథావళి, రెండవ భాగము, పుట 258.

20 కవికోకిల గ్రంథావళి, రెండవ భాగము, పుట 258.

21 కవికోకిల గ్రంథావళి, రెండవ భాగము, పుట 260.

22 కవికోకిల గ్రంథావళి, రెండవ భాగము, పుట 260.

23 "బాపూజీ", వినతి.

24 ఇది ఇంగ్లీషులోని 'Oxymoron' కు దగ్గరి రూపము.

25 "గబ్బిలము", రెండవ భాగము, తొలిపలుకు.

26 "గబ్బిలము", రెండవ భాగము, పుట 1.

27 "గబ్బిలము", రెండవ భాగము, పద్యము 20.

28 "గబ్బిలము", రెండవ భాగము, పద్యము 38.

29 "స్వయంవరం", భూమిక, పుట 1.

30 "స్వయంవరం", భూమిక, పుట 1.

31 "స్వయంవరం", బాల్యము, పుట 5.

32 "స్వయంవరం", భూమిక పుట 19.

33 "స్వయంవరం", భూమిక, పుట 1.

34 "స్వయంవరం", పుట 61.

35 "స్వయంవరం", పుట 62.

36 కట్టమంచివారి పీఠిక, "ఆత్మకథ".

37 "పణిగపంట", తపస్సిద్ధి, పుట 184.

38 "పణిగపంట", తపస్సిద్ధి, పుట 184.

39 విశ్వనాథవారి పీఠిక, "శబల", పుట ix

40 "పణిగపంట", పుట 167.

41 "ఆత్మార్పణము", పుట 178.

42 "ఆత్మార్పణము", పుట 169

43 "శబల", పీఠిక, పుట x

44 భారతి, మాసపత్రిక, మార్చి 1962, పుటలు 65-69.

45 "పణిగపంట", పుట 184.

46 "ఉదయశ్రీ", పుట 12.

47 "ఉదయశ్రీ", శాంతిదూత, పుట 53.

48 "ఉదయశ్రీ", విషకణము, పుట 60

49 "విజయశ్రీ", కురుక్షేత్రము, పుట 18.

50 "మహాంధ్రోదయము", పుట 77.

51 "మహాంధ్రోదయము", పుట 69.

52 "మహాంధ్రోదయము", పుట 69.

53 డా॥ సి నారాయణరెడ్డి, "ఆధునికాంధ్ర కవిత్వము", పుట 677.

54 ఇకనుంచి పేర్కొంటున్న కవుల రచనలన్నీ ఇటీవలనే గాంధీ సాహిత్య ప్రచురణాలయము, హైదరాబాదు వారు ప్రచురించిన "కావ్యాంజలి" అన్న రెండు సంపుటాలనుండి గ్రహించబడ్డాయి.

55 "మణిమాల", పుట 46.

[56] "గాంధి", భూమిక, 1950.

[57] "గాంధీజీ మహాప్రస్థానము", మొదటి మజిలీ.

[58] వీనిని గూర్చి ముందు ప్రకరణం ("గేయాలు, పాటలు")లో పేర్కొంటాము.

[59] ఇంతవరకు ఖండ కావ్యాలు వ్రాసినవారి ఖండికలే పరిశీలింపబడ్డాయి కేవలం ఖండికలు మాత్రమే వ్రాసిన రచయితల రచనలను కొన్నింటిని గూర్చి యిక్కడ వివరించడం జరుగుతుంది.

[60] "ఆధునికాంధ్ర కవిత్వము", పుట 453.

[61] "పన్నీటి జల్లు", పుట 76.

[62] "జాతీయ గీతము" చివరి పద్యం మాత్రం చిత్రంగా ఉంది !

దేవదేవుని కారుణ్య దృష్టివలన
నాంధ్రమండల మౌన్నత్య మందుగాక
సాధుపథవర్తి మన జార్జి చక్రవర్తి
యాహవంబున విజయము నందుగాక !

## 5. గేయాలు - పాటలు

[1] శ్రీ కురుగంటి సీతారామయ్యా : "నవ్యాంధ్ర సాహిత్య వీధులు", తృతీయ" భాగము, పుటలు 384 - 385.

[2] "జాతీయ గీతములు", శ్రీ చెఱుకువాడ వెంకటరామయ్యా, శ్రీ దామోజీపురపు వేంకటనరసింహారావు, పుట 8.

[3] "కవిరాజు శతకాలు, గీతాలు" - అనుబంధము పుట 1.

[4, 5] "కవిరాజు శతకాలు, గీతాలు" - సూతాశ్రమగీతాలు, పుటలు 51, 52.

[6] రామదండు పాట, పుట 6

[7] "బసవరాజు అప్పారావు గీతాలు", పుట 143.

[8] "బసవరాజు అప్పారావు గీతాలు", పుట 143-144.

[9] "బసవరాజు అప్పారావు గీతాలు", పుట 144.

[10] "బసవరాజు అప్పారావు గీతాలు", పుట 144.

11 "బసవరాజు అప్పారావు గీతాలు", పుట 145.

12 "బసవరాజు అప్పారావు గీతాలు", పుట 143.

13 "బసవరాజు అప్పారావు గీతాలు", పుట 147.

14 "బసవరాజు అప్పారావు గీతాలు", పుట 147.

15 "బసవరాజు అప్పారావు గీతాలు", పుట 149.

16 "కవికొండల గేయాలు", పుట 97-98.

17 దీని రచనా కాలము 30-3-1919 గా యివ్వబడినది.

18 రచన : 3-2-23.

19 "సమదర్శనం", పుట 12.

20 "సమదర్శనం", పుట 13.

21 "సమదర్శనం", పుట 14.

22 ఆంధ్ర ప్రభ, వార పత్రిక · 2-10-68, పుట 4.

23 భీమవరం ఆశ్రమంలో చికిత్సకోసం వచ్చిన "ఆనందుడు" అన్న అనుయాయికి గాంధీజీ సుమారు రెండు సంవత్సరాలపాటు (నవంబరు 20, 1944 నుంచి అక్టోబరు 10, 1946 వరకు) ప్రతిరోజూ ఒక సూక్తిని వ్రాసి పంపేవారట. ఆ సూక్తులను (అవి మొత్తం నూరు) తెలుగులోనికి అనువదించారు డాక్టరు సి నారాయణరెడ్డి "గాంధీయం" అన్న పేరుతో.

"నిత్య సత్యపథమున పయ
నించువాడు జారిపడడు"
"వ్యక్తిత్వము కోల్పోయినచో స
ర్వము కోల్పోవును మానవుడు"

వంటి సూక్తులకు క్లుప్తంగా, సూటిగా ఉండే విధంగా వారి సహజపద్ధతిలో అనువదించారు రెడ్డిగారు.

24 "బాపూ నీ పుట్టినరోజు" అన్న గేయంలో రచయిత పూర్వకాలంలో భారతీయకవులు భగవంతునికి నివాళి పట్టిన పద్ధతిని, ఈనాటి కవులు గాంధీజీకి శ్రద్ధాంజలులు ఘటించిన పద్ధతినే అనుసరించారు. గాంధీజీని రాము, రహీం లతో పోల్చారు.

"హరి-జనుడై పుట్టిన రోజు
హరిజనుడే పుట్టిన రోజు"

అంటూ గాంధీజీని భగవంతుని అవతారంగా భావించి, ఆయన అవతారం ఎత్తిన కారణాన్ని కూడా వివరించారు.

25 ఇప్పుడు పేర్కొనేవి అన్నీ గాంధీ సాహిత్య ప్రచురణాలయం, హైదరాబాదు వారు ప్రచురించిన "కావ్యాంజలి" రెండు సంపుటాలనుంచి స్వీకరించ బడ్డవి.

## 6. కీర్తనలు - భజనలు మొదలైనవి

1 కల్లుతాగి నీ యిల్లునెల్ల గుల్లచేయకు
నీ వొళ్లు రోగాల కెల్ల వడ్డీ నీయకు.

2 శ్రీ ధవళేశ్వరపు సోమలింగాచార్యులు, 1922.

3 ఇదే భావాన్ని చాలామంది వ్యాసకర్తలు, నాటికా రచయితలు కూడా గ్రహించారు. దీనిని గురించి ముందు అధ్యాయంలో.

4 "గేయగుచ్ఛము", (1936), పుట 2.

5 "గేయగుచ్ఛము", తొలిపలుకు, పుట 1.

6 "గేయగుచ్ఛము", గాంధీ, పుట 16.

7 "గేయగుచ్ఛము", పశ్చాత్తాపము, పుటలు 20-21.

8 "గేయగుచ్ఛము", మహాత్ముని సందేశము, పుటలు 40-41.

9 "గేయగుచ్ఛము", మహాత్ముడు, పుట 34.

10 "గేయగుచ్ఛము", మహాత్ముడు, పుట 35.

## 7. నాటక సాహిత్యం

1 డా॥ పి. యస్. ఆర్. అప్పారావు, "ఆంధ్ర నాటక వికాసము", పుట 346.

2 "భారతీయ సందేశము", ద్వితీయ రంగము, పుట 12.

3 "భారతీయ సందేశము", ద్వితీయ రంగము, పుట 12.

[4] శ్రీమతి నాగభూషణ్: "తెలుగులో చారిత్రక రూపకాలు", నాట్య కళ - డిశంబరు, 1963 (విశేష సంచిక).

[5] శ్రీమతి నాగభూషణ్: "తెలుగులో చారిత్రక రూపకాలు", నాట్య కళ - డిశంబరు, పుట 48, 49.

[6] ఈయన వ్రాసిన మూడవ నాటకము "సంస్కారిణి" పేర్కొనతగిన సాంఘిక నాటకము. ఈ మూడింటి తర్వాత వ్రాయబడిన రాజకీయ నాటకము "పాంచాల పరాభవము". దానిని కూడా పరామర్శించడం జరిగింది.

[7] "నవయుగారంభము" తొలిపలుకు.

[8] "నవయుగారంభము" ఉపోద్ఘాతము, పుట 6.

[9] "నవయుగారంభము" ఉపోద్ఘాతము, పుట 6.

[10] "నవయుగారంభము", ప్రథమాంకము, 2 వ రంగము, పుట 16.

[11] "నవయుగారంభము" తృతీయాంకము, పుట 57.

[12] "గాంధీ విజయము", నాంది.

[13] "గాంధీ విజయము", ప్రస్తావన, పుట 2.

[14] "గాంధీ విజయము", ప్రథమాంకము, పుట 16.

[15] "గాంధీ విజయము", ద్వితీయాంకము, పుట 21.

[16] "గాంధీ విజయము", ద్వితీయాంకము, పుట 21.

[17] "గాంధీ విజయము", ద్వితీయాంకము, పుట 25.

[18] "గాంధీ విజయము", ద్వితీయాంకము, పుటలు 25, 26.

[19] "గాంధీ విజయము", తృతీయాంకము, పుట 34

[20] ఇక్కడ రచయిత మాటలను వినండి. "ఇచ్చట గాంధీ పరమేశ్వరుని గూర్చి ధ్యానించుచున్నాడు. తిలక్, పరమేశ్వరు లోకరేయని యూహించునది."

[21] గాంధీ విజయము, తృతీయాంకము, పుట 53.

[22] ఇట్లా తిలక్ నుంచి ఒకశక్తి గాంధీజీలో ప్రవేశించడం అన్నది ఈ కాలంలో వచ్చిన నాటకాలన్నింటిలోను కనిపిస్తుంది దీనికి కారణం ఉన్నవ

వారి వ్యాసం అని తెలుస్తున్నది. దానిని వ్యాసాలను గురించిన అధ్యాయంలో వివరిస్తాను.

23 ''స్వరాజ్య ధ్వజము'', తృతీయాంకము, పుట 64.

24 ''తిలక్ మహారాజ నాటకము'', తృతీయాంకము, పుట 64.

25 శ్రీపాదవారు పేర్కొన్న నాటకము దామరాజువారి "గాంధీ విజయము" అన్నది.

26 శ్రీ కొడాలి ఆంజనేయులు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణలు కలిసి వ్రాసిన "అవతార పరివర్తనము" ఇట్టివానిలో ఒకటి. దీనిని అయిదు, ఆరు చోట్ల ప్రదర్శించారని, చివరకు బాపట్లలో ప్రదర్శిస్తూ ఉండగా, ఆనాటి ఆంగ్ల ప్రభుత్వాధికారులు ఆ నాటకము వ్రాతప్రతులన్నింటిని స్వాధీనపరచుకొని తగలబెట్టినారని శ్రీ కొడాలి తెలిపారు.

27 ఈయన వ్రాసిన ''దివ్యవాణి'' అన్న కథ ఒక హరిజనుని దయనీయమయిన చరిత్రను చిత్రిస్తుంది. అతని త్యాగంవల్ల కఠినుడైన పూజారి హృదయము కూడా మారినట్లు చూపబడ్డది.

28 "కాంగ్రెసువాలా", కవికోకిల గ్రంథావళి, పుటలు 315, 316.

29 "కాంగ్రెసువాలా", కవికోకిల గ్రంథావళి, పుటలు 315, 316.

30 "గాంధేయ విజయం", ఉపోద్ఘాతము, శ్రీ భో.పట్టాభిసీతారామయ్య

31 "రాజపుత్ర తేజఃపుంజము", ప్రస్తావన, పుట 3.

32 భారత జాతీయోద్యమంతోపాటు ఆంధ్రోద్యమం కూడా 1921 నుంచే ముమ్మరంగా ప్రారంభమైంది. అందువల్ల ఈ నాటకాలు ఒకప్రక్క ఆంధ్ర రాష్ట్రోద్యమానికి; మరోప్రక్క భారత జాతీయోద్యమానికి కూడా ఆలంబనము లైనాయి.

33 ఎప్పుడో చదివిన ఈ నాటకం ఇప్పుడు నాకు దొరకకపోవటంవల్ల దీనిని గూర్చి విపులంగా చర్చించే అవకాశం లేకపోయింది.

34 ఈ "అవతార పరివర్తనము" అనే నాటక ప్రస్తావన శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రి వ్రాసిన "కృష్ణాజిల్లా జాతీయోద్యమ పరివర్తనము" అనే గ్రంథంలో ఉన్నట్లు కొడాలివారు తెలిపారు.

## 8. నవలా సాహిత్యం

1 "శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు సుప్రసిద్ధాంధ్ర నాయకులు, సంస్కర్తలు, సాహిత్య విశారదులు, కార్యశూరులు" – మాలపల్లి, నాగేశ్వరరావు పంతులుగారి తొలిపలుకు, పుట XVIII.

2 "మాలపల్లి, తొలిపలుకు", పుట IX.

3 "మాలపల్లి", పుట 667.

4 "వేయిపడగలు", పదునొకండవ అధ్యాయము, పుట 291.

5 "వేయిపడగలు", పుట 505.

6 "వేయిపడగలు", పుట 505.

7 "నారాయణరావు", పుట 17.

8 "నారాయణరావు", పుట 95.

9 "నారాయణరావు", పుట 57.

10 "నారాయణరావు", పుట 241.

11 "నారాయణరావు", పుట 291.

12 శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు, క్వాలిటీ పబ్లిషర్సు ప్రచురించిన "కోనంగి" కి పరిచయం, పుట 6.

13 "కోనంగి", పుట 105.

14 "కోనంగి", పుట 108.

15 "కోనంగి", పుట 115.

16 "కోనంగి", పుట 159.

17 "కోనంగి", పుట 160.

18 "కోనంగి", పుట 261.

19 "చివరకు మిగిలేది", 'చప్పుడు చెయ్యని సంకెళ్ళు', పుట 223.

20 "చదువు", పుట 118

21 "చదువు", పుట. 123

22 "చదువు", పుట. 140

23 "కొల్లాయి గట్టి తేనేమి", ఒక్కమాట.

24 ఈ నవల రచయిత శ్రీ వి. యస్. రంగస్వామి ఇది "ఆంధ్రప్రభ" సచిత్ర వారపత్రికలో 17-2-65 న ప్రారంభమై, 7-4-65 తో అంతమైనది.

## 9. జీవిత చరిత్రలు - సిద్ధాంత గ్రంథాలు

1 "ఆంధ్రభారతి", ప్రథమ సంపుటము, 1910, పుట 77.

2 "ఆంధ్రపత్రిక", సంవత్సరాది సంచిక, 1914,

3 "ఆంధ్రపత్రిక", సంవత్సరాది సంచిక, 1914, పుట 68

4 "ఆంధ్రపత్రిక", సంవత్సరాది, సంచిక, 1914, పుట 71.

5 "శ్రీ గాంధీమహాత్ముని జీవిత చరిత్ర", పుటలు 298-99.

## 10. సింహావలోకనం

1 "ఆంధ్రపత్రిక", సంవత్సరాది సంచిక, 1922, ప్రస్తావన.

2 "ఆంధ్రపత్రిక", సంవత్సరాది సంచిక, 1923, ప్రస్తావన.

3 ముట్నూరి కృష్ణారావు, కాశీనాధుని నాగేశ్వరరావుగార్ల సంపాదకీయాలు ఆనాడు దేశాన్ని ఉర్రూత లూగించాయి. వానిని పుస్తకరూపంలో ప్రచురించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

4 తెలుగులో వచ్చిన చారిత్రక నాటకాలలో చాలభాగం చారిత్రక సత్యాలను నాటకీకరించడంకన్న, కాల్పనికమైన సంఘటనలను నాటకీకరించడమే ఎక్కువగా కన్పిస్తున్నది అందువల్ల సంఘటనలను యథాతథంగా స్వీకరించి, నాటకీకరించడంలో కూడా ఈ రాజకీయ నాటకాలే ప్రథమములని చెప్పవచ్చు.

5 శ్రీ దామరాజు పుండరీకాక్షుడుగారు ఇట్టి నాటకాలు వ్రాయడంలో ఆద్యులు.

# ప ద సూ చి క